# సృష్టి-మానవుడు-మానవజన్మ

ఓం





" THIS BOOK IS PUBLISHED WITH THE FINANCIAL ASSISTANCE OF TIRUMALA TIRUPATI DEVASTHANAMS UNDER THEIR SCHEME AID TO PUBLISH RELIGIOUS BOOKS"

(Ref. Roc. No. Edit 5/624/95)

సృష్టి - మానవుడు - మానవజన్మ

ప్రతులు : 750 కాపీలు

ప్రథమ ముద్రణ : 1998, బహుధాన్యనామ సం॥



ప్రౌఢసరస్వతి గ్రంథమాల మేనేజరు
స్మార్తప్రౌఢ, పంచవృత్తుల పురోహితులు, స్మార్తవిశారద,
కవికుమార్ చేవూరి భానుమూర్త్యాచార్య (శ్రీమూర్తి
కొత్తపేట, గొల్లవీధి, నీళ్లటేంకుదరి, విజయనగరం-2.

ముద్రణ : మహారాణి విద్యావతిదేవి ప్రింటింగ్ ప్రెస్,
కోట, విజయనగరం-535 002.

# సృష్టి - మానవుడు - మానవజన్మ

గ్రంథరాజము సర్వజన కల్పభూజము



గ్రంథకర్త :

ప్రౌఢసరస్వతి, స్మార్తసింహ, పండిత, మహాకవి

కీ॥ శే॥ చేవూరి వేంకట సోమసుందరశాస్త్రిగారు

పెదపెంకి గ్రామం

విజయనగరం జిల్లా.

# సృష్టి - మానవుడు - మానవజన్మ



ప్రౌఢసరస్వతి గ్రంథమాల మేనేజరు

స్మార్తప్రౌఢ, పంచవృత్తుల పురోహితులు, స్మార్త విశారద,

కవికుమార్ **చేవూరి భానుమూర్త్యాచార్య (శ్రీమూర్తి)**

కొత్తపేట, గొల్లవీధి, నీల్లటేంకుధరి, విజయనగరం-2.

---

ఈ గ్రంథములు కావలసినవారు పై అడ్రసును సంప్రదించవలెను.

శుభమస్తు ఓం అవిఘ్నమస్తు

జై పరమేశ్వర

# ★ కవిగారి పరిచయము ★

కీర్తిశేషులు, ప్రౌఢసరస్వతి, స్మార్తసింహ మహాకవీశ్వర్లుగారి

## జన్మస్థలం

ఆ॥ గీ॥ గాయకులు, వేదవిదులు, సత్కర్మపరులు
శాస్త్రవిధులు, పౌరాణికులు, సత్కవులును
ధనికులాత్మజ్ఞులును, సత్యధర్మపరులు
గలుగువారలు పెదపెంకి గ్రామమందు॥

ఆ గ్రామము విశాఖపట్టణముజిల్లా, బొబ్బిలి తాలూకా, పెదపెంకి గ్రామమందు, విశ్వబ్రాహ్మణ వంశమందు, చేపూరి వంశమందు వీరి ముత్తాతలు ఇద్దరిలో 2వ వాడు చిన్నయాచార్యులుకు 4 గురు కుమారులలో 3వ వాడు బుట్టియాచార్యులుకు ఇద్దరులో ప్రథముడు, సాంఖ్యేయ గణమంజరి, గ్రంథనిర్మాత లక్ష్మీనారాయణాచార్యులు, వీరికి ఇద్దరు కుమారులలో ప్రథమ సుపుత్రుడు యీ సృష్టి-మానవుడు-మానవజన్మ గ్రంథ నిర్మాత ప్రౌఢసరస్వతి, స్మార్తసింహ, పండిత మహాకవీశ్వర్లుకు ముగ్గురు తనయులు. జేష్టుడు కవిశేఖర లక్ష్మీనారాయణాచార్య, 2. మల్లిఖార్జునాచార్య, 3వ వాడు కవికుమార్ భానుమూర్త్యాచార్యన్ను. జ్యేష్ట కుమారుడు తండ్రిగారు జననం 1872వ సంవత్సరం, నిర్యాణం 1951వ సంవత్సరం. శ్రీవారు సజీవంగా ఉన్నప్పుడు వారి రచనలు దాతలవల్ల (1) శ్రీ సత్యనారాయణ వ్రతకథ - 1920 లోను (2) రాజయోగచరితము 1909, (3) మల్లిఖార్జున శతకము - 1924, (4) శ్రీ మల్లిఖార్జున విలాసము 1924, (5) సుందరేశ్వర శతకము - 1930, (6) నిశ్చయానంద భోదనము 1911. వారు గతించిన తరువాత జ్యేష్టకుమారుడు, కనిష్ట కుమారుడు తండ్రిగారి పేరున 1968-8-15 వ తేదిన ప్రౌఢసరస్వతీ గ్రంథమాలను స్థాపించి, దాతలు ఉదార స్వభావులు చేతను (1) గణాధిపతి పూజాకథా విధానము - 1968, (2) సృష్టి-మానవడు-మానవజన్మ ప్రథమ భాగం 1968, (3) శ్రీ వీరబ్రహ్మేంద్రపూజా విధానము - 1968, (4) సుదర్శనో

ద్ధరణము - 1969, (5) శ్రీ విరాట్ పోతులూరి వీరబ్రహ్మేంద్రస్వామి వారి పూజా విధానము - 1969, (6) 2వ భాగం సృష్టి-మానవుడు-మానవ జన్మ - 1971, (7) శ్రీ కంచికామాక్షీదేవి పూజావిధానము - 1972, (8) చాతుర్థికోద్బోధము - 1978, (9) 2వ ముద్రణ కంచికామాక్షీదేవి పూజా విధానం - 1984, (10) ప్రౌఢసరస్వతి జీవితచరిత్ర - 1986, (11) వివాహ శుభకార్యముల సామాగ్రి పట్టిక - 1987, (12) 3వ ముద్రణ శ్రీ కంచి కామాక్షీదేవి పూజావిధానం - 1988, (13) చేపూరి భానుమూర్త్యాచార్య జీవిత షష్టిపూర్తి చరిత్ర - 1989, (14) త్రికాల సంధ్యావందన గోత్రాది వంశవృక్షము - 1992, (15) వివాహ శుభకార్యముల సామాగ్రి పట్టిక 1994, (16) వివాహ శుభకార్యముల సామాగ్రి పట్టిక - 1997, (17) సృష్టి - మానవుడు - మానవజన్మ గ్రంథరాజమును సర్వజనమత గ్రంథ మును 1998 లో ముద్రణలు, దాతలు మహారాజ పోషకులు ద్వారాను పై గ్రంథాలు ముద్రణలు జరిపించిరి. మిగతా 20వది గ్రంథములు మాత్రం ముద్రణ కాలేదు గాన దాతలు ఉదారులు పోషకులు శ్రీవారి కుమారుడు చేపూరి భానుమూర్త్యాచార్యవారిని సంప్రదించ కోరుచున్నాను.

ఇట్లు

విబుధజన విధేయులు,

ప్రౌఢసరస్వతి గ్రంథమాల మేనేజరు

స్మార్తప్రౌఢ, పంచవృత్తుల పురోహితులు, స్మార్తవిశారద,

కవికుమార్ **చేపూరి భానుమూర్త్యాచార్య (శ్రీమూర్తి)**

కొత్తపేట, గొల్లవీధి, నీల్లటేంకుధరి, విజయనగరం-2.

## కవి సన్మానము

బొబ్బిలి తా॥ పెదపెంకి కాపురస్తులు బ్రహ్మశ్రీ చేపూరి వేంకట సోమసుందర శాస్త్రిగారు అనేక గ్రంథములు రచించిన మహాకవి. వారిని రాజమహేంద్రవరము పౌరులు సన్మానింప నెంచినారు. తే 2-3-49 దీ బుధవారము సాయంకాలము 5 గంటలకు (గోదావరీ స్టేషన్ ఎదురుగా నున్న) గౌరీశంకర విలాసము హాలులో మహాసభ జరుపనెంచిరి. సదరు సభకు కవిసార్వభౌములధ్యక్షతను వహింతురు, పెక్కుమంది ఉపన్య సింతురు. ఎల్లరు దయచేయ ప్రార్థితులు.

రాజమండ్రి,
2-3-49

ఇట్లు బుధజన విధేయులు,

**విశ్వబ్రాహ్మణ సంఘం**

# -: తొలిపలుకు :-

అంధ్ర మహాశయులారా!

ఈ "సృష్టి - మానవుడు - మానవజన్మ" యను గ్రంధమును రచించుటకు సత్వగుణ సంపన్నులును, జ్ఞాన మార్గావలంబులును మద్గురు, జనకులునగు, బ్ర॥ చింతాడ చామలింగాచార్యులవారు, చేవూరి లక్ష్మీనారాయణాచార్యులవారు నా యందు కటాక్షమున, షణ్ముఖి సాంఖ్య తారకాదు లుపదేశించుటలో, పరతత్వ, జీవతత్వములు, సమ స్తేంద్రియాదులు దేహము నాశ్రయించి యుండుటచే, తొలుత దేహ తత్వము తెలిసికొని జీవతత్వ పరతత్వములు శోధించి సద్గతింబొందుట ముఖ్యమని, యుపదేశించిన, శ్రీవారి వాక్యములను బట్టి ఇంచుమించు ఏబది సదుద్గ్రంధముల నాలోడనముగావించి యందలి విషయముల నేర్చి పేర్చి షోడశకర్మలు, షణ్ణవతి తత్వనిరూపణము, జీవతత్వ నిరూ పణము, భక్తి, జ్ఞాన, వైరాగ్యములు, మాయాసృష్టి మున్నగు నూట యేబది విషయములును, సుమారు పదునొకండు నూరుల గీత, సీసము లతో, తేటతెల్లముగ నల్లి, తెలుగుతల్లి పదపల్లవముల కర్పించితిని.

ఏతద్గ్రంధము నాలించి, యవలోకించి, వారి సదభిప్రాయముల దయతో నొసంగిన పండిత కవితల్లజులగు.


గ్రంధకర్త :

ప్రౌఢసరస్వతి, స్మార్తసింహ, పండిత, మహాకవి

కీ॥ శే॥ చేవూరి వేంకట సోమసుందరశాస్త్రిగారు

పెదపెంకి గ్రామం

విజయనగరం జిల్లా.




శ్రీ విశ్వకర్మ పరబ్రహ్మణే నమః

24-4-36 కొమ్మూరు సంగమేశ్వరవాచస్పతి, రాజాము

# సృష్టి - మానవుడు - మానవజన్మ

అను నపూర్వ గ్రంథరాజమును గురించి శిల్పశిరోమణి, శతావధాని, ఆంధ్రవిద్యావాచస్పతి, నతనానా కవిసార్వభౌమ శిరఃపాదపీఠాద్యనేక బిరుదాంకితులగు బ్రహ్మశ్రీ కొమ్మూరు సంగమేశ్వర కవిగారొసంగిన పండితాభిప్రాయము.

(1) సృష్టి - మానవుడు - మానవజన్మ యనుపేర వ్రాయబడిన ఈ యఖండ పద్యకావ్యము గ్రంథకర్తలగు బ్రహ్మశ్రీ చేపూరి వేంకట సోమసుందరశాస్త్రిగారు అల్పజ్ఞుడనగు నాకు నభిప్రాయము నిమిత్తమంపించిరి నేనామూలాగ్రముగా నీగ్రంథ మాలోడనము చేసి నాకు దోచునభిప్రాయము నిందు బొందుపరచు నా సాహసమునకు బండితలోకము మన్నింపక పోదు,

(2) భారతదేశమునకు ప్రధాన భుజమగు చెన్నరాజధానీలో. చేరిన విశాఖపట్టణ మండలమున నొప్పారు శ్రీ శ్రీ శ్రీ బొబ్బిలి సంస్థానాధీశ్వరుల సుప్రసిద్ధ పరిపాలనమునకు జిక్కిన గ్రామములలో మిన్నయగు పెదపెంకి పూర్వ మెట్లుండెడిదో నిర్వచింప వశము కాదుగాని సుమారు 150 సంవత్సరములకు బూర్వము కవుల కాలవాలమై పండితులకునికిస్థానమై వేదవేదాంగవేత్తలకు జన్మభూమియై సుప్రసిద్ధ శిల్పులకునికి పట్టునై యుండెడి దనుట కవి చమత్కారము కానేరదు.

(3) ఏతద్గ్రామనివాసియగు చాటపర్తి లచ్చిరాజు కృతు లీ యాంధ్రభూమియందు విరాజిల్లుచున్నవి. వయస్సు నందంత కించుక తక్కువవారగు చేపూరి బుట్టియాచార్యులుగారి హాస్యరచన యీ ప్రాంతము మరువలేదు. ఏతత్కృతికర్తపూర్వులగు వారందరును బండితులనియు గవులనియు స్థలజ్ఞులు చెప్పుకొనుచున్నారు. ఇంచుమించు వెల్లటూరి శేషాచలావధానుల కంటే ముందు చేపూరి కందికుప్పవారలే విశ్వబ్రాహ్మణ పురోహితవృత్తి నభివృద్ధి పరచిరను వాడ మసాధువు కానేరదు. నేటికిని గ్రామ పూర్వ ప్రతిష్ఠ మరువవగినవారలు పెదపెంకిని బుట్టకుండుట మోదావహము.

(4) అట్టి పట్టణమున బుట్టి సాహిత్యవృద్ధిని బలపరచుకొని శ్రౌత స్మార్త విద్యలయందు నఖండ ప్రజ్ఞనార్జించి వాస్తు జ్యోతిషములలో పండితులనైనను నాశికాంగుష్ఠమును సంధింప జేయగలిగిన ప్రజ్ఞ లలవరచుకొని ఈ కావ్యముకంటె ముందు పదుమూడు సమున్నత గ్రంథములు రచియించి స్వకులాన్యకుల పండిత దృక్పథంబునకు గురియై యుండుటయే గాక యొకప్పుడు. మా యగ్రా సనాధిపత్యమున బురుపంబడిన తెనాలి పట్టణ సభాకాల నిర్మిత పరిషత్సభ వారిచే ప్రౌఢసరస్వతీ బిరుదమును బొంది దిగంతయశోవిరాజిత మండలులగు శాస్త్రిగారిని నెరుగని యాంధ్ర భూమిలేదు.

(5) శ్రీవీరు విరచించిన గత కావ్యముల మాట యటు లుండ నీ సృష్టి - మానవుడు - మానవజన్మ మానవజన్మ మెత్తినవారికెల్ల నవసర కావ్యమని శ్రీవారి శత్రుపక్షము వారైనను అంగీకరింపక తప్పని విధి

(6) తొల్లింటి మహాకవులు కులములాత్మలందిడికొని మత వైషమ్యా భావయుతులై వ్రాసిపెట్టిన గ్రంథము లొక్కొక్క కులమువారికి గాని యొక్కొక్క మతము వారికిగాని పూజార్హములైనను వేరొక మతమువారి చేతను యింకొక కులమువారి చేతను దూరబడు చున్నయవి. శాస్త్రములు పురాణముల మాట యట్లుండ సర్వ మానవలోకా ద్యవసరములగు నద్వైత గ్రంథములు సైతము ఇదే మార్గమునం దరుగుటంబట్టి ప్రకృతనాగర ప్రపంచము నందు పూర్వోపాహృత గ్రంథములు ని వేదాంతాది గ్రంథములు విమ ర్శకుల విమర్శలకు వశం వదములై దూదిపింజల భాతి నెగర గొట్ట బడుచున్నయవి.

(7) కావున నేటి గాంధీ యుగమున సర్వమానవావసర కావ్యము లావిర్భవించు టావశ్యకములని రాజకీయవేత్తలు విమర్శనా జ్ఞానము గల పండిత కవులును యెలుగెత్తి చాటుటయేగాక రవీంద్ర కవీంద్రుని వంటి ప్రాపంచక పండితుడు సైతము యిదే భావమును యీవత్సరముననే విశాఖపట్టణమున నుడివియున్నాడు. ఆ మధ్య తార్కికాగ్రేసరుడగు గదాధర విద్యాధరపండితుడు ఆత్మనొప్పింప గల కావ్య మాంధ్ర దేశమున మాత్రమేకాక భారతదేశ వాఙ్మయ ములందు లేదని ఘోషించినాడు. అంతతో తీరక మహాత్ముడు నిష్పక్షపాత కావ్యమునెందు వ్రాసినవారు భారతదేశ వాఙ్మయము

నందు బొడమిమికి జింతించు చున్నాడనని తమ ఎంగిండియా. యొకమాటు సలహా నందించినాడు.

ఇట్లు దేశమంతయు నొక ప్రధాన కావ్యము కొరకు నిరీకించు చున్న తరుణమున నీ సృష్టి - మానవుడు - మానవజన్మ వేంకట సోమసుందరశాస్త్రిగారి ముఖము నుండి యావిర్భవించుట సమ యోచితముగ నున్న యది. వేదవేదాంగముతెల్లను తలక్రిందులుగ తిరుగవేసి సాధ్యమైనంతవరకు జర్చించి సృష్టి-మానవుడు-మానవ జన్మ కవసరమగు ధర్మములన్నియు సృష్టి - మానవుడు - మానవ జన్మలో గుప్పించి దేశమునకు నొక శుభకావ్యమును ప్రసాదించి నారు. ప్రౌఢా వివాహ ములవసరమను నీదినములలో స్త్రీ పునర్వి వాహములు కావలయునను నీ తరుణములో - హిందూ మహమ్మ దీయ సమ్మేళన మవసరమనెడి యీ రోజులలో - స్త్రీ స్వాతంత్ర్య మత్యావశ్యక మనెడు నీ కాలములో - పంచమకుల సమ్మేళనము కర్తవ్య మనెడు నీ యెగలో వేదముతెల్ల మానవులకు సమాన మగు హక్కని చూపగలిగిన యీ యుగములో వేంకట సోమ సుందరశాస్త్రిగారి కృత సృష్టి-మానవుడు-మానవజన్మ వేదమనుట నిరభ్యంతరము.

నానానేక పూర్వగ్రంథ సుప్రసిద్ధ సాంప్రదాయ శ్లోకములగ్ర హించి మనుష్య జన్మమెత్తిన ప్రతివానికి సమాన హక్కుసు స్థాపింపనై వ్రాయబడిన యీ సృష్టి - మానవుడు - మానవజన్మ వచన పూర్వకముగా నుండిన బాగుండునుగాని పద్యకవిత్వమున కొమ్ములు తిరిగిన సూరిగ్రామణి యగు టంబట్టియు గద్య పాత కావ్యము కాదనుటంబట్టియు, పద్యములుగనే సృష్టి - మానవుడు - మానవజన్మ విరాజిల్లింప జేసినారు. వేంకట సోమసుందరశాస్త్రిగా రీ కవిత్వమొకప్పుడు సంస్కృత భూయిష్టమై శబ్ద కాఠిన్యమై సమాసావృతమై యుండెడిదిగాని రానురాను నిర్దుష్టావలంబి యగు టచే సాధు మార్గమునకు దిగినది. హృదయమందు గలిగిన భావ మును వ్యాకరణాను సంధానముగా నక్షరరూపకముగా గణలక్షణ బద్ధముగా అక్షరముల ద్వారా పత్రమునందు లిఖించువాడే కవి యని నుడువగల రావుసాహేబు గిడుగు వేంకట రామమూర్తి పండితుని వాద మీశాస్త్రి కిన్నాళ్లకిత డొప్పుకొనినట్లు సృష్టి - మాన వుడు - మానవజన్మ రచన సాక్ష్య మీయగలుగుచున్నది.

10) లాతి వర్ణనాంశముల యందు కఠినత వహించినను సాముదాయ కముగా తేలికకంటే తేలికయై మృదుమధుర పద భూయిష్టమై యున్నయది. వీరి కవిత్వము వ్యాకరణమునకు వ్యతిరేకము కాదని ప్రముఖులు లోగడ నిర్వచించియే యున్నారు. వీరికి చిత్ర కవిత్వము నందును, బంధ కవిత్వమునందును వేయేల చతుర్విధ కవిత్వముల యందును నిరుపమానశక్తి యుండియు నీ గ్రంథము నందట్టి పోకలేమియు బొందిప జేయలేదు. సుమారు (1200) పండ్రెండు వందల పద్యములు గలిగిన యీ సృష్టి-మానవుడు-మానవజన్మ వేంకట సోమసుందరశాస్త్రిగారు నాటి పెంచి పెద్దది చేసిన మహావృక్షమనవొప్పి యున్నది. ఈ ఫలముకే జాతి పక్షులకుగాక సమస్త పక్షి సముదాయమునకు నాహారయోగ్యమనందగు

11) మానవలోకమునంగల జాతివైషమ్యముల నిర్మూలించి, మతవైషమ్యములంచెగగోసి నిమ్నోన్నతముల జక్కచేయుటకే యావిర్భవింపబడిన వేదోచితమై శాస్త్రసమ్మతమై సర్వమానవ సులభగ్రాహ్యమై నిర్దుష్టమై నిర్మాలిన్యమై గంగా ప్రవాహమునకెసయగు నీ సర్వోత్తమ కావ్యమగు సృష్టి - మానవుడు - మానవజన్మకును ఏతన్మానవజన్మ నిర్మాతకును భారతీయ ఆంధ్రలోక పండిత కవి లోకము తరపునను నా యాజమాన్యమున విరాజిల్లుచున్న ది అలిండియా విశ్వకర్మనే లిబరల్ ఫెడరేషను పక్షమునను అనేక వందన సహస్రము లర్పించుచున్నాడను.

12) నేటి ప్రభుత్వంవారి పాఠశాలలలో సాముదాయకముగా విద్యాభ్యాసమొనర్చుచున్న విద్యార్థులకు ప్రభుత్వంవారు ఈ గ్రంథమును పరీక్షా గ్రంథముగా నుంచునెడల దేశము అతిశీఘ్ర కాలమున వేదమతముగా నొప్పారు ననుమాట అతిశయోక్తి కానేరదు.

మాతృ గర్భస్థానమునుండి మానవజన్మ వెలువడినది మొదలు సృష్టి-మానవుడు-మానవజన్మ పంచభూతాత్మమగు ప్రపంచమున లయమగు వరకు నేర్చుకొన గలిగిన ఆర్యమత ధర్మములన్నియు నిందు వక్కాణింపబడి యుండుటచే నీ యుత్తమ కావ్యము మనుష్యజాతికి శాశ్వతోపాధ్యాయుడుగా నుండుటంబట్టి ప్రభుత్వం వారికిని విద్యాశాఖాధికారులకును నా యభిప్రాయమును మనవి చేసి యింతతో విరమించుచున్నాను.

—०००—

శ్రీ విశ్వకర్మ పరబ్రహ్మణే నమః

9-1-38 పట్నాల రామలింగశాస్త్రి, బొబ్బిలి.

# సృష్టి - మానవుడు - మానవజన్మ

అను నపూర్వ గ్రంథరాజమును గురించి మహోపాధ్యాయ, పండితసింహ, గీర్వాణ భాషా శిరోమణ్యాద్యనేక బిరుదాంకితులగు బ్రహ్మశ్రీ పట్నాల రామలింగస్వామిశాస్త్రి గారొసంగిన పండితాభిప్రాయం పాఠక మహాశయులారా!

బ్రహ్మశ్రీ చేవూరి వేంకట సోమసుందరస్వామి గారిచే రచియింపబడిన సృష్టి-మానవుడు-మానవజన్మ యను నీగ్రంథరాజము యజుర్వేద తైత్తిరీయోపనిషత్తు మొదలగు గ్రంథ పరిశోధనమునను స్వానుభవసిద్ధ సిద్ధాంతముల నెల్లవారికి ననుభవ నీయములగు సృష్టి-మానవుడు-మానవ జన్మ యందలి రహస్యముల నతిసులభముగా దెలియజేయు చున్నది. ఈయది ఇంద్రుడనుమానించి విశ్వరూపుని వధించిన దచ్చిరములు పక్షులగుట ఇంద్రుని బ్రహ్మహత్య తరుముట తద్దోషమును గంగ మొదలగు వానికి నిచ్చుటయు, నింద్రుడు స్త్రీలను బ్రార్థించి బ్రహ్మహత్యాభాగము నిచ్చుట మొదలుగాగల యతి విచిత్ర పౌరాణిక కథానుబంధి మృదు మధుర వాగ్రచనాచాతురీ తురీపరిశ్యూత లలిత విచిత్ర వితత వసనాయమానమై మానవోపయోగ ధర్మా చరణాంశముల బొందుపరచి వ్యక్తీకరించుచు నలరారుచున్నది.

ఇట్టి మానవోత్పత్త్యాది నవశ్యాచరణీయ ధర్మసౌక్ష్మ్యములను విస్తరించి వ్యక్తీకరించుటచే నీ గ్రంథమునకు సృష్టి-మానవుడు-మానవజన్మ యను నామము సార్థకమగుచు నొప్పగు రీతి మెప్పుల వడయుట యెంతయు నతిశయోక్తి కాదు. విషయ సూచికయందు జూపబడిన పురుష రతి నియమము మొదలు మాయాసృష్టి పర్యంతము నింక తదితర విశేషాంశముల ననుభవాతీత సృష్టి - మానవుడు - మానవజన్మ మర్మములను దెలియ జేయుటయేగాక స్త్రీ గర్భధారణ మొదలు శిశూత్పత్తి పర్యంతము గల పుంసువనాది రక్షణోపాయ కృత్యములను దదనంతర కరణీయములగు జాతకర్మాద్యఖిల సంస్కారముల యందలి విధ్యుక్త విధి విధానములనెల్ల నెల్లవారికి గరతలామలకముగ దెలియునటుల తేట తెలుగు నిటు మాటల ముద్దులు మూటగట్టు పద్యముల దేనియూటల జవుల గొలుపు నటుల రచియింపబడినది. ఇందున పాఠకమహాశయులెల్లరకును మననీయ మాననీయ మానవజననాది విశేషాంశముల దెలియజేయుటచే

దనయ సమాన మానవజన్మ తత్వవిజ్ఞానమును ప్రసాదించుచున్నది. కావున నియ్యది సకల జనులచే గేవల పఠనీయ మగుటయే కాక మాన వీయ ధర్మవిషయక విధి విశేషములను గ్రహింపదగి యనుభవమున నిట్టి ధర్మవిధి విధానముల దెలియ నుపదేశించుటచే స్త్రీ పురుష బాల వృద్ధాదులననేమి యశేష మానవలోకముచే నవశ్య పఠనీయమగుట సర్వ సృష్టి-మానవుడు-మానవజన్మ ధర్మ విజ్ఞానమును దెలియ జేయ నెంతయు సంతసించుచున్నాను.

—०००—

20-5-1911 నందిరాజు చలపతిరావు, యేలూరు.

యేలూరు మంజువాణీ ప్రెస్సు మానేజరుగారు, బ్రహ్మశ్రీ నంది రాజు చలపతిరావు పంతులుగారు శ్రీ రాజయోగి చరిత్రమున గురించి వ్రాయించి పంపించిన యభిప్రాయము.

అయ్యా !

తాము పంపిన శ్రీ రాజయోగి చరిత్రము ముద్రించి సిద్ధముగా నుంచినారము. కవిత్వము మిక్కిలి రసవంతముగా నున్నయది. ఈ కవి కవిత్వమును విడువక భారతము వంటి గ్రంథమును వ్రాయవలయునని మా తలంపు.

—०००—

శ్రీ విశ్వకర్మ పరబ్రహ్మణే నమః

5-9-1939 ములగాడ సూర్యనారాయణశాస్త్రి, బొబ్బిలి.

## సృష్టి - మానవుడు - మానవజన్మ

అను నపూర్వ గ్రంథరాజమును గురించి మహారాజ రాజశ్రీ శ్రీ బొబ్బిలి సంస్థానాధీశ్వర శ్రీ రావుసర్ రామకృష్ణ రంగారాయ మహారాజ స్థాపిత బొబ్బిలి హైస్కూలు పండిత విద్వాన్ బ్రహ్మశ్రీ ములగాడ సూర్యనారాయణశాస్త్రిగా రొసంగిన పండితాభిప్రాయము.

శ్రీః

శ్రీ మత్పర దేవతాయైనమః

ఉ॥ మానవ జాత్య వశ్యమగు - మానవజన్మ రచించియుంట వి।
జ్ఞాన విభాసి సద్యశము - గాంచితి, మాన్యతఁజెందె జన్మ, స।
మ్మానము విశ్వకర్మకుల - మందె, యథార్థ మెఱింగె లోకమున్,
స్థానముఁ జెందితీవ బుధ - సంతతి, చేవురి సోమసుందరా॥

# ఉపోద్ఘాతము

బ్రహ్మశ్రీ చేవూరి సోమసుందరావధానులగారు రచించిన సృష్టి - మానవుడు - మానవజన్మ యను గ్రంథము నామూలాగ్రముగా చదివినాడను. మానవజన్మ మెత్తిన ప్రతి వ్యక్తియు నవశ్యముగా గ్రహించదగిన యంశము లనేకము లిందుగలవు. ఇక్కవివర్యుండు పెక్కు సంస్కృతాంధ్ర గ్రంథములను బరిశీలించి ప్రకృతోప యుక్తములగు విషయముల నేర్చి పండిత పామర జనాహ్లాద జనకముగా బొందు పఱిచెను. ఉపనిషత్తులు మొదలగు సంస్కృత గ్రంథములలోను ఆంధ్ర గ్రంథములలోను నచ్చటచ్చట సందర్భాను కూలముగా మానవ జాత్యావశ్యక విషయములు చెప్పబడి యుండెనేగాని యాను పూర్వికముగా గూర్చి వచింపబడిన గ్రంథము మాత్రము మృగ్యమని చెప్పవలసి యున్నది. అక్కారణమున నేటికాలమున కీగ్రంథరాజము ఆంధ్రభాషా యోషామణికి కవిశిల్పినిర్మితా పూర్వ శోభాజనక నూతనాలంకారమై విరాజిల్లుచు సర్వజనాహ్లాద పాత్రమగు ననుటకు సందియ ముండదు.

ఈ కవితల్లజుండు మల్లికార్జున విలాసము సుందరేశ్వర శతకము మున్నగు పెక్కు గ్రంథములను ప్రౌఢశైలితో రచించినను సర్వజనోపయోగమై యలరారుటంబట్టి స్వల్ప విద్యాగంధముగల సామాన్య మనుజులకుఁ గూడ నన్వయమై గ్రాహ్యమగునట్లు తేటతెల్లమై లక్షణ విరుద్ధముగాని వాడుక భాషతో సరళ కవితాధోరణిని ద్రాక్షపాకమున సీస గీత పద్యములతో నీగ్రంథమును రచించుట విషయగ్రహణ లోలుపులగు జనుల కానందదాయక మగునని నొక్కి వక్కాణింపనగును. (ఉదాహరణముగా) 125-128-324-428-565-719 ఇట్లే సులభశైలి నీగ్రంథమంతయు నొప్పారుచున్నది.

కవితాచమత్కృతి వెలయించుచు నచ్చటచ్చట వర్ణనాంశములను మృదుమధుర ధోరణితో 155-282-283-685-1054 మొదలగు పద్యములలో హృదయంగమముగా ప్రకటించి చూపెను.

ఇక్క విపర్యుండు స్మార్తము నభ్యసించి వైదిక కర్మలయం దారి తేరిన పండితుండగుటంబట్టి మానవ జాత్యావశ్యకములగు షోడశకర్మలను అగమోక్త ప్రకారంబున నెప్పుడే విధముగా జరుపవలెనో యిందుఁ జక్కగాఁ బొందుపఱచెను, ఈ గ్రంథమును జదివినచో విధ్యుక్తకర్మల నెట్లాచరింపవలెనో ఆచరించుటవలన ఫలమేమో మంత్రార్థమేమో స్పష్టముగా గుర్తించి కర్మకలాపమును శ్రద్ధాభక్తులతో నెఱవేర్పగలశక్తి చదువరులకు గల్గక మానదని ఉ 555-559-568-640-643-672-673 మొదలగు పద్యముల నుండి వ్యక్తము కాకపోదు. వివాహమననేమో యందాచరింపవలసిన విధులేవో ఏలనాకర్మలను జేయవలెనో వధూవరులు గుర్తింపవలసిన యంశములెట్టివో యిందు జక్కగా 621-627 మొదలగు పద్యములయందుఁ బ్రకటింపబడియుండెను.

మఱియు నిందు సంస్కృతమునందుగల మంత్రరహస్యములను తత్వములను వేదాంతవిషయములు మున్నగువాని నాయా సందర్భముల యందు ప్రాకృతానుసరణముగా 541-542-839-1002 ఇట్లు పొందుపఱచెను. సంస్కృత భాషయందుగల పారిభాషిక పదములన్నిటిని సీస గీత పద్యములలో 763-863-1002 మున్నగువానియందు నిమిడ్చివ్రాసిన ఈ కవి సామర్థ్యము పండిత జనైకవేద్యమై యుండును.

ఈ గ్రంథమున తఱచుగా సముచ్చయము వాడబడియున్నది. కొన్ని యెడల ద్రుతంబుమీది నకారంబును గానంబడియెడి అను చిన్నయసూరి వ్యాకరణసూత్రమున కిందలి పద్యములు తఱచు నుదాహరణములు కావచ్చును. కేవల మానవజాతిని గూర్చి చెప్పినను నిందలి సమస్త విషయములు సామాన్యముగాఁ బురుష బోధకములై కన్పట్టుచున్నవి. స్త్రీ పురుష వ్యక్తిభేదమును బట్టి సందర్భానుకూలముగా స్త్రీ వ్యక్తిగత విశేషవిషయములను గూడ నచ్చటచ్చట ప్రకటించుట గ్రంథ ప్రాశస్త్యమున కవసరమని చదువరులకు దోచకపోదు. చిట్టినాన్న బుచ్చి తండ్రి కన్నబాబు ఇత్యాది సంబోధనములు ప్రాకృత లోకమున కంత రుచింపకపోయినను కవికింగల శిశు వాత్సల్యమును ప్రకటింపకపోవు.

ఇందు శిశువర్ణనము మాతాపితలకు చంటిబిడ్డల యందుగల అనిర్వాచ్యమగు ప్రేమానుబంధము బాలకుల చేష్టలు 475-478-481-488 మున్నగు వానియందు స్వానుభవమున స్వభావోక్తితో నీకవి వివరించెను. ఆయా సందర్భములయందు జనులకు మోక్ష ప్రదాయకములగు నక్షర తత్వములు మంత్రరహస్యములు గాయత్రీ మంత్రార్థము మున్నగు వానిని తేటతెల్లముగా ప్రకటించెను.

మొత్తముపైని ఈ గ్రంథ మంతయుఁ జదివినచో మానవ జాత్యా వశ్యక సమస్త విషయములను తెలిసికొనుటయేగాక పురుషార్థ సంగ్రహ ణమునకును సందియముండదని చదువరులు గ్రహింపకపోరు. బహు గ్రంథ పరిశోధనఁజేసి సర్వజనావశ్యక విషయములనేర్చి గూర్చి సృష్టి - మానవుడు - మానవజన్మ యను నీ గ్రంథరాజము రచించి లోకోపకృ తియు సారస్వత సేవయు నొనర్చిన యిక్కవివర్యున కాయు రారోగ్య భాగ్యంబు లొసంగుచు సర్వోత్కర్షతగా నీ గ్రంథము విరాజిల్లంజేయు గావుతయని సర్వేశ్వరుని బ్రార్థించుచు విరమించుచున్నాడను.

సీ॥ జ్ఞానభూయిష్టమై - జగతిలోఁదనరుటన్ - జన్మక్రమజ్ఞత - జనులకఅయ।
విధిగాన నిఖిలంబు - వివరించి బోధించు - లలితోక్తులన్ ముద్దు - లొలుకుచుండి।
పండిత పామర - బహుమానపాత్రమై - శాస్త్రార్థ వివరణన్ - జాలనొప్పి।
తేటతెల్లంబుగా - బాట నిరూపించి - యిహపరంబులలెంటి - రహిని గూర్చి॥

గీ॥ క్రాలె (సృష్టి-మానవుడు-మానవజన్మమనే) గ్రంథమిపుడు।
సర్వమానవాహ్లాదమై యుర్వియందు।
చారుకృతికర్తసద్యశః చంద్రికాళి।
దిశల వెలయించు చుండదే తేజమంది॥

—০০০—

శ్రీ విశ్వకర్మ పరబ్రహ్మణే నమః

7-2-1938 బీ. వెంకట్రావు, తాళ్లబురిడి.

# సృష్టి - మానవుడు - మానవజన్మ

యను నపూర్వ గ్రంథరాజమును గురించి పార్వతీపురం తాలూకా తాళ్లబురిడె గ్రామం బోర్డు స్కూలు మాస్టరుగారగు మ॥ రా॥ రా॥ బీ. వెంకట్రావు పంతులు గారొసంగిన పండితాభిప్రాయము.

బ్రహ్మశ్రీ ప్రౌఢసరస్వతి బిరుదాంకితులగు చేపూరి వేంకట సోమ సుందరశాస్త్రిగారికి,

అర్యా!

సృష్టి - మానవుడు - మానవజన్మ యను పొత్తమును గురించిన తమ ప్రకటన పత్రికను చూచితిని. నామకరణమును బట్టియే సదరు పొత్తముయొక్క ప్రాముఖ్యము తెలియవచ్చుటయే కాక తాము సాహాయ్యముగా గైకొంటిమనిన గ్రంధరాజముల బట్టి కూడా దీని ప్రాముఖ్యము హెచ్చినది. ఇక్కాలమున యిట్టి గ్రంధములు పామరజనులకు గూడ సుబోధక మగునట్లు నిర్దుష్ట గ్రామ్యభాషలో వ్రాసియుందురనియే తలచెదను. తెలిసినవారికంటె, తెలియనివారి సంఖ్యయే హెచ్చుగా యున్నదని తమరెరుగనిది కాదు. ఇక పొత్తము వెల యెంత తగ్గించిన అంత విరివిగ అమ్ముడుపోగలవు అదియును గమనించ కోరెదెను. గ్రంధము సిద్ధముగ నున్న నాకొక ప్రతిని పంపగోరెదను.

—○○○—

శ్రీ విశ్వకర్మ పరబ్రహ్మణే నమః

25-5-1939 పొడుగు అప్పలదాసుగారు, పకీరుకిట్టలి.

## సృష్టి - మానవుడు - మానవజన్మ

యను నపూర్వ గ్రంధరాజమును గురించి విజయనగరం తాలూకా పకీరుకిట్టలి గ్రామవాస్తవ్యుడు సంగీత సాహిత్యాభినయతంత్రీవాద్యాది విద్యానిపుణుడు, పండిత సత్యభామా బిరుదాంకితులు బ్రహ్మశ్రీ పొడుగు అప్పలదాసుగారిచే నీయబడిన పండితాభిప్రాయము.

శ్రీ బొబ్బిలి తాలూకా పెదపెంకిగ్రామ వాస్తవ్యులగు బ్ర॥ ప్రౌఢ సరస్వతి చేపూరి వేంకట సోమసుందరస్వామి గారిచే రచియింపబడిన సృష్టి - మానవుడు - మానవజన్మ యను అపూర్వ గ్రంధరాజమునన్ గల విషయములను జక్కగావిని బ్రహ్మానందమును బొందితిని. అందు గల హంశములు ప్రపంచోత్పత్తి వివరణము, ప్రణవ పంచాక్షరీ మహిమము, గాయత్రీ మహిమాను వర్ణనము శిశుత్వ బాల్యత్వ యౌవనత్వ వృద్ధత్వాదిక వర్ణనములును దేహావయవాదిక నిరూపణంబును మాయా సృష్టి మొదలగు అంశములు విని ఆనందించడమైనది. ఇందలి భాగములు అనేక మహద్గ్రంధముల నుండి క్రోడీకరింపబడిన వగుటచే యీ గ్రంధము సర్వమానవోపయోగమగు ననుట కెంతమాత్రము సందేహము లేదని నా యభిప్రాయము. ఈ పుస్తకము యెంత చదివినను మనసుకు తనివి దీరక యున్నది.

శ్రీ విశ్వకర్మ పరబ్రహ్మణే నమః

1939 భాగవతుల నృసింహశర్మగారు,

బరహంపురం శ్రీ రామా ప్రెస్ మానేజర్లును తులసీరామాయణాది మహాగ్రంథకర్తలున్ను వేగుచుక్క పత్రికా ప్రచారకులును, పండిత కవి శ్రేష్ఠులును నగు బ్రహ్మశ్రీ భాగవతుల నృసింహశర్మగారు బాలకవి చేపూరి లక్ష్మీనారాయణాచార్య విరచిత కాలగర్వభంగమను యక్షగాన ప్రబంధాదిని 1939 వ సంవత్సరమున ప్రచురించిన పండితాభిప్రాయం.

రానున్నది। త్వరలో రానున్నది॥

## సృష్టి - మానవుడు - మానవజన్మ

గ్రంథరాజము సర్వజన కల్పభూజము

గ్రంథకర్త :

ప్రౌఢసరస్వతి చేపూరి వేంకట సోమసుందరశాస్త్రి,

పెదపెంకి గ్రామం, బొబ్బిలి తాలూకా

వివిధ గ్రంథములఁ బరిశోధించి, విజ్ఞాన కలశాంబునిధి మథించి సంగ్రహించిన సారామృత మీ సృష్టి - మానవుడు - మానవజన్మ గ్రంథ రాజము, వైద్యగ్రంథముల, వేదాంత గ్రంథముల సర్వజన సమ్మత మతగ్రంథముల నిమిడియున్న సృష్టి-మానవుడు-మానవజన్మ రహస్య ములఁ గ్రోడీకరించి స్త్రీ పురుష నైసర్గిక ప్రవర్తన పరివర్తనముల, మృదు మధుర కవితాచాతురీ ధురీణత శోభిల్ల 1200 పద్యములతో, పండిత పామర జనాహ్లాదకరముగ గ్రంథకర్త గ్రంథము విరచించెననుట కెంత మాత్రము సందేహింపఁ బనిలేదు. ఏతద్గ్రంథరాజ మతి శీఘ్రముగ వెలువడి యాంధ్రజన మానసముల విస్మయ సాగరమున నోలలాడింపఁ గలదు వేచి యుండుడు.

మచ్చునకొక పద్యము

కే ళీ వి నో ద ము

ఉ॥ కన్నుల తేటలన్ స్మిత వి। కాసముఖంబులఁ బంచకృత సం।
పన్నతఁ బ్రీతియు క్కలర। వ స్వనభాషల నూత్ననూత్న సం।
ఛన్న విసర్జన త్రపల। సౌహృద భావము లుప్పతిల్లనె।
న్నెన్నె విలాస సంపదల। నెంతయుఁ గాముని రాజ్య మేలుచున్॥

బాలకవి ఆచార్యకృత కాలగర్వభంగ గ్రంథమున కిచ్చిన పండితాభిప్రాయమున వ్రాసినది.

ఈ గ్రంధకర్తగారి జనకులు ప్రౌఢసరస్వతి బిరుదాంకితులు బ్రహ్మశ్రీ చేపూరి వేంకట సోమసుందర శాస్త్రులవారి మహోత్కృష్ట గ్రంధరాజంబొండు వెలువడుచున్నదని యాంధ్ర పాఠక వర్గమున కెఱుంగఁ జేయుటకు మిక్కిలి సంతసించుచు, వీరిరువురు నాంధ్రుల ప్రోత్సాహము బడయుదురుగాక యని యభిలషించుచున్నాను.

—○○○—

శ్రీ విశ్వకర్మ పరబ్రహ్మణే నమః

8-12-1939 పాందూరు కృష్ణమూర్తిశాస్త్రి, చిలుకలపల్లి.

## సృష్టి - మానవుడు - మానవజన్మ

అను గ్రంధరాజమును గురించి పాలకొండ తాలూకా చిలుకలిపల్లి గ్రామ నివాసులును బాలకవి సింహదైవజ్ఞవర్య పాందూరు కృష్ణమూర్తి శాస్త్రి భాగవతార్‌గారు పండితాభిప్రాయము.

ఉ॥ మానవజన్మ పేర నస - మాన కవిత్వ నిరూఢి గ్రంధమున్
మానుగ జెప్పితౌ వి బుధ - మాన్య; భవత్కవితావధూటి భూ
జానులు భూజనుల్ కవులు - సంతస మార బఠించి మెచ్చ నా
భాను సుధాంశు తార మిల - బర్వుత చేపూరి సోమసుందరా॥ 1

చ॥ కవివరులెన్నొ భంగులుగ - గ్రంధములన్ రచియింతు రవ్వి స
త్కవికుల మౌనసన్ విమల - గాధలనొప్పి ప్రపంచ కామినీ
తిలకముతై దగన్ గవిను - తిం గనునట్టులు గాక వ్యర్థమై
బొలుపరునట్టి గ్రంధములు - భూజనపాళికి మేలొసంగునే॥ 2

చ॥ సరసకవిత్వ సంపదయు - సార మనీషయు సర్వసజ్జనా
దర రచనా చమత్కృతి వి - ధంబు ప్రశస్త సమస్త కర్మలన్
నరభవు లాచరింపదగు - నైపుణి దెల్పెడు మార్గమెల్లనే
నరసితి నాత్మమోదమును - నందితి సత్కవి మిత్రరత్నమా॥ 3

క॥ చేపూరి వంశవార్నిధి। జైవాతృకుఁ దనఁగఁ దనరి - సరసను కవి సం।
భావన ప్రొద్దులు పుచ్చెద। వౌ వేంకట సోమసుంద - రాఖ్య
బుధవరా॥ 4

ఆర్యా!

గీ॥ ఇచ్ఛ జనియింప (దాసృజి - యించె నిఖిల।
విశ్వవిశ్వంభరను విరా - డ్విశ్వ కర్మ।
సర్వ మానవకర్మలు - సాంఖ్యమెఱుక।
సేయు గ్రంథము నేటికి - చిత్రగతిని।
నీవు రచియించి భరత భూ - దేవి సేవ॥
సలిపితివి దీని పద్ధతిన్ - సంచరించి।
మర్త్యులెల్లరు సత్కర్మ - మార్గ మరసి।
భద్రమొన గూర్త్రగాక స ద్భక్తిమీర।
భవ్యమై తేజరిలు భవ - త్కావ్యరమకు

—०ం०—

శ్రీ విశ్వకర్మ పరబ్రహ్మణే నమః

9-11-1940 మారోజు వీరాచార్యులు, బొబ్బిలి.

# సృష్టి - మానవుడు - మానవజన్మ

యను గ్రంథరాజమును గురించి శ్రీ బొబ్బిలిలో మెయిన్‌రోడ్డువద్ద బొబ్బిలి బంధువులు చదివించిన సందర్భములో 9-11-1940 తారీఖున రాత్రి గ్రంథపఠన పూర్తి సమయమున తత్సంస్థానస్థిత, విద్వాన్ మహ రోజు వీరాచార్యశాస్త్రి గారొసంగిన పండితాభిప్రాయము, పంచరత్నములు.

పెదపెంకి గ్రామ వాస్తవ్యులగు బ్రహ్మశ్రీ ప్రౌఢసరస్వతి చేపూరి వేంకట సోమసుందరశాస్త్రి గారిచే రచియింపబడిన సృష్టి-మానవుడు-మానవజన్మ యను గ్రంథరాజ మత్యంత మృదుమధుర లలితపద భూయిష్టంబును, పాఠకజనానందకరంబును, అగు సృష్టి-మానవుడు-మానవ జన్మ యనెడు గ్రంథరాజము, అనేక గ్రంథముల నుండి క్రోడీకరించి తత్తద్రసానుకూలముగా వర్ణింపబడి యున్నది. ఈ విద్వత్శేఖరుడు స్మార్తమునందు ఆరితేరిన సవ్యసాచి. ఆంధ్ర గీర్వాణముల యందలి యసమాన ప్రజ్ఞానిధి గావుననే అచ్చటచ్చట చౌలోపనయన వివాహ విధులయందుగల మంత్రములను చక్కగా అర్థవైపరీత్యము రాకుండా, ముక్తామణులు కూర్చినటుల ప్రాచీన ఋషుల అభిప్రాయములకు నొక వన్నె వెట్టి నటుల యాంధ్రీకరించెను. చరక సుశ్రుతాది గ్రంథరత్నములనుండి కొన్నిటిని గ్రహించి గర్భధారణ శిశుపోషణాదులను గూర్చి

యెంతో ముచ్చటించెను. భాషోత్పత్తికి మూలమగు మాహేశ్వర సూత్రములను స్వరవ్యంజనముల విభజించి వాని స్థానముల నేర్పరచెను. మతత్రయ సిద్ధాంతకర్తలగు శంకర రామానుజ మధ్వాచార్యుల యభిప్రాయముల ననుసరించుచు విపులముగా శాస్త్రవారాశిని తఱచి తఱచి విజ్ఞానామృతమును విబుధవరులకు అందిచ్చెను. ఈ గ్రంధరత్నమును పరిశీలించిన కొలంది పండితాగ్రేసరు లమూల్యమనియు ననల్పకాంతి సముపేతంబనియు కవిరాజన్య శిరోలాలనీయ మనియు తప్పక నూహించెదరు ఈయన కవిత్వము తిక్కన సోమయాజిని స్మరింపజేయును. ప్రాసవిశ్రమాదుల నతికినటులగాని తోవాసములుగాని, అనర్ధకములగు శబ్దములుగాని, ఉపయోగించక ధారాళమైన ద్రాక్షాకదళీపాకముల శయ్యా! విలక్షణ లక్షితంబై యలరారుచుండును, ఆంధ్రసారస్వతమున ప్రధమగణ్యుడేగాక ప్రౌఢసరస్వతీ బిరుదమును వహించెను. ఈయన తరుచుగా గీత సీసములనే ఉపయోగించెను. కవిభావము సంపూర్ణముగా పద్యములయందునే నిమిడి భావరస స్ఫూర్తి గలిగియుండును.

ప్రౌఢసరస్వతి బ్ర॥శ్రీ చేపూరి వేంకట సోమసుందరశాస్త్రి గారికి సమర్పించిన సన్మాన పద్యపంచరత్నములు.

శ్లో॥ శ్రీ చేపూరి వంశాబ్దీందు, సోమసుందరశాస్త్రి ణా
కృతో (సృష్టి-మానవుడు-మానవజన్మ)మానవజన్మాఖ్య,
గ్రంధో విజయ తేతరాం॥ 1

చ॥ కవితఁ జతుర్విధంబులగు। గద్యము పద్యము గర్భ బంధముల్।
నవసలిల ప్రవాహముగ। నవ్యవచోరసగుంభితంబుగా।
ప్రవిమలవారి జోదరవి। భాసిత మాధ్వి ఝరీ ధురీణతన్।
గవితవచించు భాగ్యమును। గాంచుట పూర్వపు పుణ్యమేగదా॥ 2

ఉ॥ గూఢముగాక భావరస, గుంభితమై హృదయంగమంబునై।
లీఢ పురాణసూక్తి శ్రుతి, రీతి చమత్కృతి భాష్యకృద్వచో।
ద్గాఢముగాగి దెన్నునను; గబ్బము లల్లిన శక్తా నీకియౌ।
ప్రౌఢసరస్వతీ బిరుద, పట్టము నందిన సోమసుందరా॥ 3

ఉ॥ ముందుగ మీ కవిత్వమున, ముద్దగు సుద్దులు గాంచియున్నచో।
జెందును మోదసంపదలు, చేయును సత్కృతి కుండలేంద్రుడే।
సందియమేల మీ ఘణితి, సొష్టవమట్టిదెగాన కాకవుల్।
వందలు వేలు వేగతుల, బల్కిన మీ సిగపూలు రాలునే॥ 4

ఉ॥ మానవజన్మమందుగల, మర్మములన్నియు శాస్త్ర పద్ధతిన్।
బూని వచించియుండుటను, పూజ్యము జన్మము సార్థకంబగున్।
గానము యిట్టి గ్రంథముజ, గానను, గాన, ననూనవైఖరిన్।
(సృష్టి - మానవుడు - మానవజన్మ) మానవజన్మకావ్యము గ్ర,
మంబగురీతి బ్రసిద్ధి జెందుతన్॥ 5

—०००—

శ్రీ విశ్వకర్మ పరబ్రహ్మణే నమః

4-3-1947 వఝల చినసీతారామస్వామిశాస్త్రి, పాత్రేరు.

# సృష్టి - మానవుడు - మానవజన్మ

గ్రంథరాజమును గురించి పండితాభిప్రాయము బొబ్బిలితాలూకా పాత్రేరు వాస్తవ్యులు శ్రీ శ్రీ విజయనగరం కాలేజీ పండితోత్తములు బ్ర॥శ్రీ వఝల చినసీతారామస్వామి శాస్త్రులవారు దయ చేయించిన పండితాభిప్రాయము లెటరుతో

వి॥బ్ర॥శ్రీ ప్రౌఢసరస్వతీ, స్మార్తసింహ బిరుదభూషితులగు చేవూరి వేంకట సోమసుందరశాస్త్రిగారి సముఖానకు విధేయుడు వఝల చినసీతా రామస్వామిశాస్త్రి వందన పురస్సరముగా విశదీకరించు విషయములు.

మహాశయా మీరు దయతో వ్రాసిన జాబందినది. కార్యాంతర నిమగ్నుడనగుటచే నించుక జాలమైనందులకు క్షమింతురుగాక. తమ సెలవు చొప్పున నా యభిప్రాయము నిందుతో నంపించుకొన్నాడను చిత్తగింపుడు

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

విధేయుడు,
వఝల చినసీతారామస్వామిశాస్త్రి
పాత్రేరు మకాం.

పంపించిన అభిప్రాయము

వి॥ బ్ర॥ శ్రీ ప్రౌఢసరస్వతీ, స్మార్తసింహ బిరుద భూషితులగు చేవూరి వేంకట సోమసుందరశాస్త్రిగారు స్వరచితమగు (సృష్టి-మానవుడు మానవజన్మ) మనెడి గ్రంథరాజమును స్థాలీపులాకన్యాయముగా చదివి

నాకు శ్రోత్రపర్వము గావించిరి. విశ్వబ్రహ్మ పండిత ప్రకాండులును, బహువైదిక గ్రంథపరిచయములు నగు వీరి ఈ పరిశ్రమము మిక్కిలి ప్రశంసార్హము. ఇందలి కవిత మృదుమధుర రీతిని వెలయుచున్నది. వైదిక సంప్రదాయ భూయిష్టమగునే తద్గ్రంథరాజము వైదిక మతాభిమానులకెల్ల నాదరణ పాత్రమనుటకు సందియము లేదు. ప్రమాదపతితములగు ప్రాధాన్యత, బాల్యత్వము, షష్ఠమము, మున్నగు దొరసులను దొలఁగింపించి దీనిని బ్రచురించి శాస్త్రిగా రాంధ్ర వాగ్దేవత నలంకరించి యాంధ్ర పండితుల కృతజ్ఞతకు బాత్రులగుదురు గాక.

—०ᴑ०—

శ్రీ విరాట్పర బ్రహ్మణే నమః

25-6-1950 శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి, రాజమండ్రి.

సృష్టి - మానవుడు - మానవజన్మమును గురించి మహామహోపాధ్యాయ, కళాప్రపూర్ణ, ఆంధ్రవ్యాస, అభినవ శ్రీనాధ, కవిసార్వభౌమ బిరుదాంకితులగు బ్రహ్మశ్రీ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రులవారు దయ చేయించిన పండితాభిప్రాయము.

శ్రీరస్తు

## సృష్టి - మానవుడు - మానవజన్మ

అను నీ యపూర్వ గ్రంథము బొబ్బిలి తాలూకా పెదపెంకిగ్రామ వాస్తవ్యులును ప్రౌఢసరస్వతి, స్మార్తసింహ, నూత్నమస్కరి ప్రముఖ మహాబిరుద విరాజమానులును విశ్వబ్రాహ్మణ వంశభూషితులును అగు చేపూరి వేంకట సోమసుందర శాస్త్రిగారిచే యజుర్వేదము తైత్తిరీయోపనిషత్తులు స్మృతిసార సంగ్రహము సంధ్యాభాష్యము విచారసాగరము వేదాంతవచనము సుశ్రుత శారీరము మూలస్తంభము నాగరఖండము విశ్వకర్మోపనిషత్తు భగవద్గీతా శివగీతా విశ్వకర్మ పురాణము భాగవతము హాలాస్యఖండము అథర్వశిరోపనిషత్తు సోమనాథ భాష్యము మున్నగు ననేక గ్రంథము లవలోకించి తత్తద్గ్రంథముల సారాంశములను గొని తత్త్వమెఱుంగంగోరు మానవుల కత్యంతోప యుక్తంబుగా మృదుమధుర శైలిని 1200 పద్యములుగా రచింపబడినది. ఇందు ప్రపంచోత్పత్తి సప్తధాతూత్పత్తి స్త్రీలకు సంతానప్రాప్తి లక్షణంబులును సీమంతోన్నయనాది

# XVII

వ్రతసంబంధములును శిశువులకు జాతకర్మ నామకరణ చౌలాదులును అక్షరతత్వ నిరూపణంబును ఉపనయనము గాయత్రీ ప్రభావము స్నాతకవ్రతాదులు చతుర్వింశతితత్వ నిరూపణంబును బాల్య యౌవన కౌమారాదులును మున్నగు 360 విషయములు గలవు. మానవజన్మ మెత్తిన ఎల్లవారికి ముఖ్యముగా కావలిసిన గ్రంధరాజము.

శైలిని తెలియుటకు నిందలి కొన్ని పద్యములు

గీ॥ మనసు నిలిచిన నిలుచును - మారుతంబు
మారుతము నిల్వ నింద్రియ - వారమాగు
నింద్రియాదులు నిలిచిన - నేక దృష్టి
ధ్యాన మొనరింపవచ్చును - దప్పకుండ॥

మణి పూరకము

సీ॥ మణిపూరకము నాభి - మధ్యంబునను బది
దళముల దగి యగ్ని - తత్వమగుచు,
నధిదైవతము విష్ణు - వాదిలక్ష్మియె శక్తి
యును, డ.ఢ.ణ.త.థ.ద ధ.న.ప.ఫ.లును,
ఘన చక్షురింద్రియం - బును, గుండలాకృతి,
రత్నప్రభయు శికా రంబు బీజ
మార్వేల హంసల కాధారమై శివ
లింగస్వరూపంబు లీల, దనరి.॥

గీ॥ యా ప్రసాద స్థలంబుగా - నలరి, దేహ
మధ్యమున దనరారుచు - మాననీయ
మైన రతనాల ప్రోవునా - నలరునయ్య;
సుగుణగణధుర్య; యోముని - సువ్రతార్య.॥



—೦೦೦—

సృష్టి-మానవుడు-మానవజన్మ అను జ్ఞానదీప గ్రంథర

## సాహయ్య గ్రంధనామములు

1] కృష్ణ యజుర్వేదము
2] తైత్తిరీయోపనిషత్తు
3] అధర్వశిరోపనిషత్తు
4] కైవల్యోపనిషత్తు
5] గర్భోపనిషత్తు
6] సంధ్యా భాష్యము
7] మనుస్మృతులు
8] పరాశరస్మృతి
9] స్మృతి ముక్తాఫలము
10] స్మృతిసార సంగ్రహము
11] యాజుషప్రయోగ చింతామణి
12] ప్రయోగ చంద్రికా
13] స్మార్తానుక్రమణికా
14] బొప్పన భట్టీయము
15] సింగా భట్టీయము
16] మహాసంకల్పము
17] మంత్రపుష్పము
18] అపరప్రయోగ చంద్రికా
19] యల్లాజీయము
20] శివచంద్రికా
21] కాలామృతము
22] ముహూర్త దర్పణము
23] ముహూర్తాదర్శము
24] సుశృత శారీరము
25] బాహాటము
26] వేదాంతవచనము
27] హాలాస్యఖండము
28] నాగరఖండము

29] బ్రహ్మోత్తరఖండము
30] ఆంధ్రభాగవతము
31] భగవద్గీతా
32] శివగీతా
33] మనీషా పంచకము
34] సాముద్రిక శాస్త్రము
35] అలంకార శాస్త్రము
36] కొక్కోకము
37] పాణినీయసూత్రము
38] షట్చక్రనిర్ణయము
39] షరి అతుల్ ఇస్లాము
40] బైబిలు
41] గర్భశాస్త్రము
42] విశ్వకర్మపురాణము
43] విచార సాగరము
44] సాముద్రిక శాస్త్రము
45] గర్భశాస్త్రము
46] శివతత్వ సుధానిధి
47] లోకప్రవృత్తి
48] స్వానుభవము
49] రతిమంజరి

ఈ నలబది తొమ్మిది గ్రంథములలోని ముఖ్యాంశములు నేర్చి ఈ సృష్టి - మానవుడు - మానవజన్మ రచియింపబడినది.



# సృష్టి - మానవుడు - మానవజన్మ

## ✳ విషయసూచిక ✳

నెం. ప్రథమోల్లాసము పేజీ నెం.

| నెం. | విషయసూచిక | పేజీ నెం. |
|---|---|---|
| 28 | స్త్రీలు ఋతుగ్రహణంబున గర్భితలగుట | 33 |
| 29 | మానవరతి స్వాతంత్ర్యము | 34 |
| 30 | చాతుర్విధ సృష్టి | 35 |
| 31 | మానవోత్పత్తి | 36 |
| 32 | అర్చిరాది మార్గము | 37 |
| 33 | ధూమాది మార్గము | 38 |
| 34 | పునరావృత్తివి రూపణము | 38 |
| 35 | గుణానుకూల భుక్తి | 39 |
| 36 | భోజన నియమము | 40 |
| 37 | సప్తధాతూత్పత్తి | 41 |
| 38 | వీర్యప్రాధాన్యత | 43 |
| | **ద్వితీయోల్లాసము** | |
| 39 | దాంపత్యధర్మము | 46 |
| 40 | దుస్సంతాన సూచన | 47 |
| 41 | జరాయు ప్రాధాన్యత | 49 |
| 42 | శుక్లశోణిత జీవనిర్ధారణము | 49 |
| 43 | స్త్రీ పుంనపుంసక లింగోత్పత్తి | 50 |
| 44 | యమళ జనన కారణము | 50 |
| 45 | ఋతు దినోత్పన్న స్త్రీ పురుష గుణధర్మములు | 50 |
| 46 | స్త్రీ వాంఛాను రూపసంతానప్రాప్తి | 52 |
| 47 | ప్రథమదిన శుక్లశోణితనామము | 53 |
| 48 | సప్తమదిన శుక్లశోణితనామము | 53 |
| 49 | పక్షదిన శుక్లశోణితనామము | 53 |
| 50 | ప్రథమ ద్వితీయమాస శీర్షోత్పత్తి | 54 |
| 51 | గర్భిణీరక్ష | 54 |
| 52 | తృతీయమాస కరచరణాద్యుత్పత్తి - పుంసువనము | 55 |
| 53 | చతుర్థమాస స్త్రీ పుంనపుంసక లింగోత్పత్తి | 56 |
| 54 | గర్భ వ్యంగతాదులు | 56 |
| 55 | గర్భచిహ్నాలు | 57 |
| 56 | అంగప్రత్యంగోత్పత్తి | 57 |
| 57 | పంచమమాస శిశుస్థితి | 57 |
| 58 | షష్ఠమమాస సీమంతము - మసీంతము | 58 |

| నెం. | విషయసూచిక | పేజీ నెం. |
|---|---|---|
| 59 | శిశుజనకుని నియమములు | 59 |
| 60 | సప్తమమాస సంపూర్ణ జీవత్వం - గర్భస్థితి | 59 |
| 61 | శిశువు జ్ఞానోత్పత్తిచే గర్భదుఃఖముతోడ | 59 |
| 62 | పరాత్పరుని ధ్యానించుట | 60 |
| 63 | అష్టమమాస ఓజోత్పత్తి | 61 |
| 64 | నవమమాస శిశుస్థితి | 61 |
| 65 | తన్మాతృ గర్భవేదన | 62 |
| 66 | సుఖప్రసవ సాధనము | 62 |
| 67 | శిశు జననము - మాయావ్యాప్తిచే శిశురోదనము | 63 |
| 68 | విశ్వజ్ఞుండు మాయావృత్తాంతముందెలుపుట | 64 |
| 69 | మాయా జననము | 65 |
| 70 | మాయా సౌందర్యాభి వర్ణనము | 66 |
| 71 | మాయమార వేదనచే బ్రహ్మాదుల కడకరుగుట | 67 |
| 72 | మాయ బ్రహ్మాదులచే నిరాకరింపబడి తండ్రికడకు వచ్చిన, తండ్రియాజ్ఞచే తపమాచరించుట | 70 |
| 73 | బ్రహ్మాదులు పరాత్పరుని ధ్యానించుట | 72 |
| 74 | పరాత్పరు ననుమతిని మాయ ద్రవరూపమున స్త్రీల యోనులంబ్రవేశించుట | 73 |
| 75 | మాయావ్యాప్తిచే శిశువుల కజ్ఞానము వ్యాపించుట | 73 |
| 76 | జాతకర్మ | 75 |
| 77 | నామకరణము - బాలసారె | 76 |
| 78 | శిశురక్షణ | 77 |
| 79 | శిశుప్రవృత్తి | 77 |
| 80 | షష్ఠమమాస అన్నప్రాశనము | 79 |
| 81 | తృతీయాబ్ద చౌళము | 82 |
| 82 | పంచమాబ్ద అక్షరాభ్యాసము | 83 |
| 83 | ప్రణవ మహిమము | 84 |
| | **తృతీయోల్లాసము** | |
| 84 | శైవపంచాక్షరీ మహిమము | 89 |
| 85 | అక్షరతత్వమగు అచ్చుహల్లులు నిరూపించుట | 92 |
| 86 | అక్షరతత్వమే అన్నిమంత్రములగుట | 94 |
| 87 | అక్షరతత్వమే జాతి, భాషా, మతశబ్దాదులగుట | 96 |
| 88 | మానవుల కక్షరతత్వమంతయు పట్టుబడుట | 97 |

| నెం. | విషయసూచిక | పేజీ నెం. |
|---|---|---|
| 89 | బాల్యము | 98 |
| 90 | అష్టమాబ్ద ఉపనయనము | 99 |
| 91 | అంకురారోపణము | 100 |
| 92 | గాయత్రీ మహిమాను వర్ణనము | 103 |
| 93 | ఉపాకర్మ | 105 |
| 94 | వ్రతచతుష్టయము | 106 |
| 95 | స్నాతకము | 106 |
| 96 | కన్యాదుర్లక్షణములు | 109 |
| 97 | కన్యా సులక్షణములు | 109 |
| 98 | వరలక్షణములు | 110 |
| 99 | వివాహ ప్రారంభము | 111 |
| 100 | ప్రధాన ప్రవేశ హోమములు | 114 |
| 101 | స్థాలీపాకము | 115 |
| 102 | ఔపాసనము | 115 |
| 103 | ప్రాతరౌపాసనము | 115 |
| 104 | శేష హోమము | 116 |
| 105 | సమావేశ గర్భాధానములు | 118 |
| 106 | యౌవనము | 121 |
| 107 | ప్రపంచోత్పత్త్యాదికము | 124 |
| 108 | త్రిగుణోత్పత్తి | 125 |
| 109 | పితృమాతృ జన్యములు | 126 |
| 110 | షణ్ణవతి తత్వనిరూపణము | 127 |
| | **చతుర్థోల్లాసము** | |
| 111 | ప్రత్యేక పంచభూత తత్వములు | 135 |
| 112 | దశేంద్రియములు - వాటి విషయములు | 136 |
| 113 | జ్ఞాన కర్మేంద్రియాధ్యాత్మికాదులు | 138 |
| 114 | ప్రాణాదిదశవాయువులు | 150 |
| 115 | ఆధారాది షట్చక్ర విధానము | 144 |
| 116 | రాగాద్యష్టకము | 148 |
| 117 | చతురంతః కరణములు | 150 |
| 118 | షడూర్ములు | 154 |
| 119 | సప్తధాతువులు | 155 |
| 120 | నాడీదశకము | 157 |

## శ్రీ విఘ్నేశ్వర ప్రార్థన

శ్లో॥ శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజం
ప్రసన్న వదనం ధ్యాయే త్సర్వ విఘ్నోపశాంతయే॥

# సృష్టి - మానవుడు - మానవజన్మ

ప్రథమోల్లాసము

## ఇష్టదేవతా ప్రార్థనము

ఉ॥ శ్రీ విలసిల్ల లోకముల
శ్రీహరు నచ్యుతు భారతీవిభున్
దేవపతిన్ దివాకరుని
దిక్పతివర్గము బంచభూతముల్
గేవలమున్ సృజించియును
గీర్తిత నిర్గుణుడై వెలుంగు నా
దేవుని విశ్వకర్మను మ
దిన్ భజియించెద నిష్టసిద్ధికిన్॥

మ॥ ఉరుసృష్టిప్రవణైక విశ్వకరు స
ద్యోజాత వక్త్రాంబుజ
స్ఫురితుండౌ మనుసంభవుండు ధవళా
భుండున్ ఋగామ్నాయుడున్
స్థిరసత్వాఖ్య గుణప్రధానుడు దమో
దీప్తా గజానాథు డీ
శ్వరు డైశ్వర్య చిరాయు రున్నతుల నా
స్తంగూర్చి కాపాడుతన్॥

ఉ॥ చేతులు మోడ్చి మ్రొక్కెద ని
జేశు శరీరములో సగంబు దా
బ్రీతిగ నాక్రమించిన గి
రీంద్రతనూజకు, భక్త చిత్త సం
జాత భయాపహర్త్రికి వి
శాల విలోకనచే జగంబులో
బాతక సంచయంబు నెడ
బాయగ జేసెడు మాతకెప్పుడునే ॥

మ॥ జగదుత్పత్తిక వామదేవముఖ సం
జాతోద్భవ శ్రీ మయాం
శగుడున్ దామసుడున్ రజోగుణలస
న్మానాధుడున్ బిన్నగా
రిగ ముండంబుదనీలగాత్రుడు యజు
ర్వేదేశుడున్ శంఖ చ
క్ర గదా ఖడ్గ ధరుండు విష్ణువు మమున్
గాపాడు నశ్రాంతమున్॥

శా॥ సారంగంబులు బాట బాడ వినుచున్
సారెన్మది న్పొంగుచున్
బారావారములో జనించి కరమొ
ప్పన్ విష్ణు వక్షస్థలా
గారంబిందు వసించి భక్తజన సం
కల్పంబు వెల్లప్డు చే
కూరంజేసెడు లక్ష్మి సంపదల మా
కుం జేర్పగా గొల్చెదన్॥

చ॥ గురుతర సృష్టి కోవిదు న
ఘోర ముఖప్రభవుండు ద్రష్ట యా
పరము సుతుండు సత్వగుణ
భారతిభర్త రజోగుణుండు భా
సురుడును సామవేది పరి
శోభిత సృష్టి విధాయి సత్కృపా
భరితు డనారతంబు నన
పాయ చిరాయువొసంగి ప్రోవుతన్॥

ఉ॥ పాణియుగంబు మోడ్చెద న
పార కృపా కలి తామవేక్షణ
శ్రేణికి బుస్తకాంచిత కు
శేశయ సన్నిభ పాణికిన్ ధర
శ్రోణికి జంపక ప్రసవ
సుందర ఘోణికి గోకిలస్వన
ధ్వాణికి ధాతరాణికిని
వాణికి వారిదనీల వేణికిన్॥

చ॥ సురుచిర వామదేవ ముఖ
సూతుడు శిల్పి తదంశజుండు ని
ర్జరవిభు డంబుదాభుడును
రాజసముఖ్యు డథర్వవేది స
చ్చరిత శచీ విభుం డసుర
సైన్య విమర్దనుడైన వాసవుం
డరి దగు భోగ భాగ్యము ల
నంత మొసంగుచు మమ్ము బ్రోవుతన్॥ 8

చ॥ ఘనుడు పులోమ సచ్చరితు
గర్భసుధార్ణవ లక్ష్మినాగ సం
జననమునొంది పత్రి సహ
చారిణియై సురలోక భోగ భా
జనయయి సాధ్వియై విభుని
సంతతము న్భజయింంచు నాశచిన్
మనమున గొల్తు సంపదలు
మాకు మొసంగు మటంచు భక్తితోన్॥ 9

మ॥ పరమేశాన ముఖాంబుజ ప్రభవ వి
శ్వజ్ఞాంశ సంభూతు డా
త్త రజ స్సత్వతమో గుణప్రథితు డు
ద్యద్దీప్తకాయుండు సుం
దర సంజ్ఞాపతి కర్మసాక్షి ప్రణవా
మ్నాయ ప్రభుండైన భా
స్కరు డారోగ్య చిరాయు రున్నతులవే
డ్కంగాంచి మాకీవుతన్॥ 10

చ॥ కలలము జంతురూపములు
గాగ నొనర్చెడు త్వష్టృ పుత్రియా
జలజహితాగ్ర జాయయును
ఛాయను భానుని గూర్చి దస్రులన్
తెలయగగాంచి మిక్కలి ప
విత్ర చరిత్రయునైన సంజ్ఞకే
నల కృపగాంచి మాగలుగు
వాంఛ లొసంగగ భక్తివేడెదన్॥ 11

చ॥ తొలుత నిరంతరాయములు
దోపగ సర్వసుపర్వులన్ మునీం
ద్రులు గరుడుల్ ఫణీంద్రులును
రుద్రులు గిన్నర యక్ష సాధ్య దై
త్యులు గడుభక్తితో ఫలత
తున్ ఘృత పాయస భక్ష్య భోజ్యకం
బుల బరితృప్తి సేయుదు రొ
ప్రోవుత నట్టిడు మమ్ము నత్కృపన్॥ 12

చ॥ హరిశఖి, నగ్నిగోత్రభిదు
లర్కజు, నంతక వహ్నిశక్రు జా
శరు, దనుజార్క జాగ్ని గిరి
శాసనులప్పతి, నాజవేణ్ణిశా
చరశమనాగ్ని వాసవులు
స్వర్ణను, వాయుజలేశదైత్య భా
స్కరజ శిఖీంద్రులాధనదు,
శర్వసుహృత్పవ నాప్పతిక్షపా
చరయమవహ్ని జిష్ణులొగి
శంకరు, గూడియు, మమ్ము బ్రోవుతన్॥ 13

క॥ రవిశశి భూసుత బుధగురు
కవి శని రాహుధ్వజములు గాదనెరెడునా
దివిష ద్వంద్యులునైతగు
నవగ్రహముల మదినెంతు నమ్మిక తోడన్॥ 14

క॥ కూరిమి పెదపెంకి పురా
గారుల సంద్భక్తవరుల గాపాడెడిస
చ్చారిత్రుల గొలిచెద శ్రీ
నారాయణ మల్లికార్జు న స్వాములనేన్॥ 15

## గురుస్తవము

సీ॥ ఆదిని నక్షరాభ్యాసంబు లక్ష్మి నా
రాయణాచార్యుండు న మరజెప్పె
నౌడూరు శ్రీజగ న్నాథ శాస్త్రులవారు
శబ్దము లాంధ్ర భూ షణము జెప్పె

మహిత క్రాతేట్బన్న మల్లు శాస్త్రులవారు
కావ్యపాఠంబులు ఘనత జెప్పె
ప్రేమతో చింతాడ రామలింగాచార్యు
లాత్మవిజ్ఞానము ద్రాళి జెప్పె
ఘనతర షోడశ కర్మలు ధర్మశా
స్త్రములు వ్యాకరణశా స్త్రమును లక్ష
ణ గ్రంథములు నిత ర గ్రంథము నిఘం
టువులు జ్యోతిషము చా టువులు మొదలు॥

గీ॥ నెన్నియో చెప్పె గురువును కన్నతండ్రి
యైన శ్రీ లక్ష్మినారాయ ణార్యులు గృప
నందుచే రే బవళ్లును నమిత భక్తి
ని గురువులకు జోతలు నేనొనర్తు॥ 16

## కవిస్తుతి

గీ॥ వాల్మీకిని గాళిదాసును బాణు నన్న
పార్యు దిక్కన నెఱ్ఱపనును రామ
రాజభూషణు రుద్రుని రాట్కవులను
నామదినినిల్పి భక్తిచే నతులొనర్తు॥ 17

గీ॥ వేంకటాచార్యు జాషువన్ వేంకటకవి
సోమనాధుని గవిసార్వ భౌము తమ్మ
నార్యునాంధ్ర వాచస్పతి నాత్మనెంచి
జోతలొనరించు చుండెద ప్రీతితోడ॥ 18

గీ॥ తెలిసియును జూడజాలని ఖలులు గొంద
రజ్ఞతను గొంద రొప్పుల నరయ లేక
దప్పులనుచు నాక్షేపింప దలచునట్టి
కవులు కవులే తలంప కా కవులుగాక॥ 19

గీ॥ అట్టి కవులను నిరసించి దిట్టలైన
సత్కవులనెంచి మానవ జన్మ మేను
వ్రాయబూనితి నీకృతి వసుధయందు
సర్వజన మాన్యమై యొప్ప సంతసమున॥ 20

# పితృమాతృ వందనములు

సీ॥ వేద శాస్త్ర పురాణ విద్యలు షోడశ
కర్మలు నేర్చిన మర్మవిదుడు
పరదార ధనకాంక్ష బాల్యంబు మొదలుగా
బరిహరించిన యట్టి భవ్యగుణుడు
సత్యశౌచంబులు శాంతి దాంతులు గల్గి
పొగడిక నొందిన పుణ్యశాలి
జపమును తపము ని ష్ఠా గరిష్ఠతయును
గవితామహత్వంబు గలుగు ఘనుడు

గీ॥ మహిత మునిసువ్రత సగోత్ర మండనుండు
సాధ్వియైన లక్ష్మీనర సమ్మ విభుడు
రహిని జేపూరి లక్ష్మినా రాయణుండు
మజ్జనకుడును గురుడౌడ మహితభక్తి
దత్పదంబులకెపుడు వందన మొనర్తు॥ 2

క॥ నిరతము పతి సంసేవా
పరతయు ధర్మాచరణయు బరతత్వ సుభా
సురయగు చేపూరి లక్ష్మి
నరసమ్మను మజ్జననిని నమ్మి భజింతున్॥ 2

# కావ్యకర్తృ ప్రశంస

సీ॥ ఆర్యులారా! మీకు నందరకును నొక్క
విజ్ఞాపనము విన్న వింతు వినుడు
పెదపెంకియను పెద్ద పేరుచే బొబ్బిలి
తాలూక నొక యూరు దనరుచుండు
నందు విశ్వబ్రాహ్మ ణాన్వయులును బ్రణ
వామ్నాయ శాఖియు లమలయశులు
మణిభద్ర సూత్రులు ముని సువ్రత సగోత్రు
లమల చేపూర్యన్వ య ప్రసూతు

గీ॥ లార్యమతు లందు శ్రీవేంక యార్య వీర
మాంబల సుతుండు లక్ష్మినా రాయణార్యు
డాతనికి లక్ష్మినరసమ్మ కగ్రసుతుడు
నైన వేంకట సోమసుం ద్రాఖ్యుడేను॥

గీ॥ శాస్త్రియని పండితుండని సత్కవియని
స్వామి ప్రౌఢసరస్వతి స్మార్తసింహ
మనుచు సిద్ధాంతి గురువుగా రని యనుచును
నిలప జాతీయ విజాతీయ లెల్లరునొగి॥ 24

గీ॥ నెవరెవరి కెట్లు బిలుచుట కిష్టమగునొ
పాటిగా బిల్చుచుందు, రీ యూట బొమ్మ
యైన న న్నాళ్ల నగరంబు లందరిప్రజ
నూత్నమస్కరి నగుచుంటి నొప్పుగాను॥ 25

## కవిపరివృత్తి

సీ॥ స్నాన సంధ్యాద్యను ష్ఠానములే దేవతా
ర్చన మనుదినమును సలుపువాడు
పరదార ధనకాంక్ష బాల్యంబు మొదలుగా
తలువక తెలివిగా మెలగువాడు
చుట్ట బీడీ సిగ రెట్టు గంజాయిల
పొగ బిల్చుటెన్నడె ఱుగనివాడు
పదియంచ భక్ష్యముల్ గుడుచు టెరుంగడు
యాహారనియంబు నభ్యసించె
మాట నిల్కడ తప్పి మసలు టెఱుంగడు
సజ్జన మైత్రిని సలుపువాడు
అన్ని పదార్థము లైక్యత నొనగూర్చి
జీవాత్మకర్పణ చేయువాడు
గురువు సెప్పిన యట్టి గురుమంత్రరాజంబు
న జప సమ్మేళన మాచరించు
సతతంబు నూత్నమ న్కరి వృత్తి నడుపుచు
కాల విక్షేపంబు గడుపుచుండు॥

గీ॥ ఇట్టి నడువడియుంటచే నెల్లజనులు
చాల గౌరవమున గాంచి సంతసింపు
చుండ జేపూరి వేంకట సోమసుంద
రాఖ్యకవి జగమందున నలరుచుండె॥ 26

## కవిబిరుదములు

ఉ॥ గూఢపదాధిరాజు రస
గుంభిత వాక్చతురోపమాన భా
గ్గాఢ కళాప్రదర్శన వి
కాస ముఖాంబుజ పండితోత్తమా
రూఢ తెనాలి సప్తదశ
రోహ సభాభవనాంతరంబునన్
ప్రౌఢ సరస్వతి బిరుద
పట్టమొసంగిరి నాకు బండితుల్॥ 27

గీ॥ విజయనగర పురంబున వెలయుచున్న
శిల్పసామ్రాట్టునందున శిష్టతెల్ల
స్మార్తసింహం బటంచు ప్రశస్తమైన
బిరుదమొసగిరి నాస్మార్త విధముగాంచి॥ 28

## కవి బహూవహానములు

సీ॥ ప్రప్రథమంబున బలిజిపేటందున
సింహకుండలములు చెవులనిడ్రిరి
పిమ్మట బొబ్బిలిన్ పెద్ద సింహలలాట
వలయద్వయంబుచే తులదొడిగిరి
ఆపైని బొబ్బిలి యందున మకరకుం
డలముల జత కర్ణములను నునిచి
రందుపై బాడంగి యగ్రహారంబున
మకర కుండలములు మలపినారు
బెజవాడ యందున వేడ్క బంగరు గంట
గొలుసు నా చేతను గూర్చినారు
బొబ్బిలిన్ బంగారు మురుగులజతనాడు
కరములయందు న మరచినారు॥

గీ॥ బొబ్బిలందున నా బలం పురము నందు
జగతి బెజవాడ పురమున స్వస్థలమున
శాలువు లొసంగియుండిరి సత్పురుషులు
వారికి కృతజ్ఞతా నతుల్ భరపువాడ॥ 29

## కవి విరచిత గ్రంధనామములు

గీ॥ అట్టి నేను సద్గురుల క టాక్షవీక్ష
ణామృతాసార లబ్ధిచే నలరికొన్ని
చిన్న చిన్న పొత్తముల ర చించినాడ
వాటి నామంబు లెల్లను దేటపఱతు॥ 30

సీ॥ ఘనమైన శ్రీ మల్లి కార్జున శతకంబు
సరసమౌ లఘుహరి శ్చంద్ర చరిత
మానందదము నిశ్చ యానంద బోధము
శుద్ధమైన సుదర్శ నోద్ధరణము
సొంపైన మల్లికా ర్జున విలాసంబును
స్వచ్ఛమైతగు నీతి సంగ్రహంబు
నీద్యమానము సుంద రేశ్వర శతకము
నుత్కృష్టమౌ రాజ యోగి చరిత
ప్రచురమౌ సత్యనా రాయణ వ్రతకథ
యతులమైతగు జ్యోతి షామృతంబు
సారమౌ చేపూరి వారి వంశంబును
నా ముహూర్తాదర్శ మనెడునదియు
కవిధర్మములను జ క్కగ జెప్పినట్లు ము
క్తిని గొన్న రక్తలో చనుని చరిత
యామద్వితయ కల్పి తాద్భుత సుగణాధి
ప కథా విధానమన్ బ్రఖ్యచరిత
భువిని చాతుర్థికో ద్బోధ మన్గార్థకో
త్కర్షజెప్పెడు పద్య కావ్యమొండు
గ్రామ రాజంబునా గను గ్రామసజ్జన
వర్ణనంబై తగు వచనకావ్య
మామధురావాసు డౌ సోమసుందర
లీలాభివర్ణన బాల వృత్త
మమల మౌసద్భక్తి యతులవి జ్ఞానంబు
గలుగు స్తోత్రంబులు గద్యములును
మానవ జన్మనా మహితమై యొప్పెడు
నీ గ్రంథరాజంబు నింపుమీర
మృదుమధురోక్తులు వెదచల్లు నట్టుగా
గల్పించితి, మహోప కారపరత॥

గీ॥ ననుచు జేపూరి వంశ సు ధాబ్ధి పూర్ణ
సోము వేంకట శ్రీ సోమ సుందరకవి
నెన్నుచుందురు పండితు లింపుమీర
పార్వతీనాధు సత్కృపా పాత్రుడగుట॥ 31

## కృతి సమర్పణము

గీ॥ గుణము లెవ్వియు లేకనే గుణియగుచును
దేహ మెద్దియు లేకయే దేహియగుచు
కలయవియు చేయకయె యాది కర్తయగుచు
సర్వమును దానయగుచును సాక్షియగుచు॥ 32

సీ॥ కనులు లేకయె యన్ని గాంచుచుండెడివాడు
వినికిరి లేకయే వీనుల వినెడువాడు
చర్మయు లేకయే స్పర్శలు గలవాడు
జిహ్వ లేకయే రుచిం గ్రసించువాడు
నాసిక లేకయే వాసన గొనువాడు
కాళ్లు లేకయె నడల్ గలుగువాడు
నోరు లేకయె యన్ని నుడువులు గలవాడు
చేయిలేకయె పనుల్ సేయువాడు

గీ॥ గుహ్యమునులేక విడిచెడి గుణమువాడు
శిశ్నమునులేక రతులను జేయువాడు
అన్నికలవాడు నెవ్విలే నట్టివాడు
విశ్వనిర్మాత యంచును వెలయువాడు॥ 33

గీ॥ మనసుచే నిట్టివాడని యనుకొనుటకు
వాక్కుచే నిట్టివాడని పలుకుటకును
వశము గానట్టివాడు యె వ్వాడొవాని
కంకితమొనర్తు నీ గ్రంధ మార్యులారా॥ 34

## మానవ శబ్ద నిర్వచనము

గీ॥ కశ్యప బ్రహ్మపుత్రుండు ఘనుడునైన
త్వష్టృజామాత సాధ్వియౌ సంజ్ఞవిభుడు
ఆమెచే సృజింపంబడి నట్టి ఛాయ
యందు వైవస్వతమనువు నర్కుడుగనె॥ 35

గీ॥ అట్టి మనువువలన బుట్టి నట్టివారు
వర మనో రపత్యం మాన వాయనుగతి
మానవులనంగవెలసి యి మ్మహినినెల్ల
రొప్పుకొనుటను మనము స హోదరులమె॥ 36

గీ॥ మానవాచరణీయ ధ ర్మముల నెల్ల
నిందు నొకచోట జేర్చి ర చించి ప్రేమ
మీర మానవజన్మయన్ బేరునిడితి
గాన నెల్లరు మానవుల్ గాంచసగును॥ 37

గీ॥ మానవులు నాల్గులక్ష లి మ్మహిని వారి
తనువులెట్లుదయించెనో తత్క్రమంబు
చిన్న పొత్తముగాగ ర చించినాడ
శంకరుని సత్కృపా విశే షంబుగరిమ॥ 38

గీ॥ పెక్కు గ్రంథము లారసి నిక్కవమగు
దేహమర్మంబు జనులకు దేటపడగ
మృదు మధుర గీత సీసముల్ పదిలముగను
గురుని వాక్యానుసారినై కూర్చినాడ॥ 39

## గురువాక్యము

శా॥ శ్రీ చిద్రూప కళాతిగుం డ చలుడున్
జింతాడ సద్వంశ్యుడున్
బ్రాచీనాగమ మార్గవర్తియును స
ర్వజ్ఞుండు నాఢ్యుండు స
ద్వాచాలుండును వైశ్వకర్మణుడు న
ద్వైతుండు శ్రీరామలిం
గాచార్యుండు మదీయ దేశికుడు స
త్యంబొప్ప నాకిట్లనెన్॥ 40

గీ॥ ఎన్ని చదువులు సదివిన నే మిఫలము
జ్ఞాన మార్గము నొందిన గాని జన్మ
పావనము లేదు, వత్స; స ద్భక్తి మీర
జ్ఞాన మవలంబన మొనర్ప గలుగు ముక్తి 41

ఆ॥గీ॥ జ్ఞానమనగదెలివి గలిగి, దేహేంద్రియ
గుణము లరసి, లోన గుప్తమైన
యాత్మతత్వ మరయు టందురు ముందుగా
దేహ మర్మవిధులె తెలియనగును॥ 42

గీ॥ ఈ శరీరము క్షేత్రమం చెన్నబడియె
నట్టి దేహధర్మంబుల నరయవలయు
ననుచు నర్జునుతో గృష్ణు డనియెగీత
ననుచు మాదేశికుడు నాకు నానతిచ్చె॥ 43

## దేహ ప్రాధాన్యత

ఆ॥గీ॥ ఆత్మయనెడునట్టి దంతట ములుగ్రుచ్చ
సందులేక యుండె జగతియందు
నదియ దేహములను నాశ్రయించుటచేత
చేతనంబు లయ్యె జీవులెల్ల॥ 44

ఆ॥గీ॥ అంతరిక్షమందు నర్కుడుండియు నీళ్ల
పాత్రలందు నెటుల ప్రతిఫలించు
నట్టు లాత్మ లోక మంతట నిండియు
దేహములను లీల దేజరిల్లు॥ 45

గీ॥ యువతియని పురుషుడనియు ని మ్మోన్నతావ
యవములంబట్టి, శ్మశ్రుస్త నాదిభేద
ములను బట్టియు నేర్పడీ యిలను దనరె
గాని దేహంబులెల్ల నొ క్కగతి నొప్పు॥ 46

ఆ॥గీ॥ అట్టి తనువు లాత్మ కాధారమగుటను
తనువులందు గలుగు ధర్మములను
దెలియవలయుననుచు దెలిపెను గురువర్యు
డందుచేత నద్ది యాత్మనిలిపి॥ 47

క॥ ఈ మానవ జన్మంబును
నే మానుగ జెప్పబూని తెట్టుల ననగా
భూమిని బూజ్యతమంబై
శ్రీ మహితము దారువనము సెలగున్ ఘనమై॥ 48

## గ్రంధారంభము

గీ॥ మహిత సద్గంధహోమ ధూ మంబు సకల
జంతు సౌజన్యతయు మునీ శ్వర నివాస
యోగ్యమును సంతత వసంత భాగ్యమైన
యవ్వనం బౌర తపమున కాస్పదంబు॥ 49

గీ॥ చిలుకలే చెప్పు వేదంబు శిష్యులకును
సామగానంబు సేయును షట్పదములు
మిత్రభావంబు సూపును మృగములచట
యెంతయభ్యాసమో చూడ వింతకాదె॥ 50

గీ॥ అట్టి వనమున దేవసే నార్యుడాది
సకల దేవమునుల్ దపో త్సుకత జేరి
సంతతాద్వైతభావ ని శ్చలత కలిగి
యుండిరెంతయు నందరు నొక్క జోట॥ 51

క॥ కొందరు హవిః పదార్థము
కొందరు ఫల మూలములను గొందరు జలమున్
గొందరు పరానిలములు
గొంద రనాహారులగుచు గూర్తురుతపమున్॥ 52

సీ॥ కామంబు గ్రోధంబు గడకు ద్రోచియు, లోభ
మోహముల్ రెంటిని మొత్తివైచి,
మదమచ్చరంబులు సదమదంబును జేసి,
గుణములు మూడింటి నణచివైచి,
పంచేంద్రియంబుల మించకుండగజేసి-
దురహంకృతిని వేగ దఱిమివైచి,
చిత్తచాంచల్యంబు మొత్తియు, బుద్ధిచే
నాత్మయోగము బోధ్య మనుచునెంచి॥

గీ॥ మనసు నిర్మలముగజేసి మారుతంబు
గదలనీయక నారుచ క్రములమించి,
యొగి సహస్రారమున దృష్టి నుంచి, యోగ
సిద్ధిగోరుచు నుండుదు రిద్ధచరిత॥ 53

గీ॥ అందు నొక్కొక్క సమయము నందు సాంఖ్య
తారకాదికమును శిష్య తతికి బోధ
పఱచుచును గాలవిక్షేప పరత నుండు
నంతలో గొన్నిదినముల కెంతొవింత॥ 54

## దారువనమునకు విశ్వజ్ఞ పరౌనివచ్చుట

సీ॥ పెల్లుగా వ్రేలాడు పల్లజడల్ మేలి
కాంతి సంధ్యారాగ గరిమమెఱయ,
నాపాదమస్తకం బలదిన భస్మంబు
చంద్రికాదీధితి సాంద్రమొప్ప,
స్ఫుటముగా దాల్చిన స్ఫటికంపుమాలికల్
దారకాగణము చం ద మునదనర,
బై గప్పుకొనినట్టు వ్యాఘ్రాజిన ప్రభ
లవతమస ద్యుతి ననుకరింప॥

గీ॥ దారువననభ మందు ను దయమునొందె
సాంద్రతేజుండు విశ్వజ్ఞ చంద్రముండు
నతని గనిలేచి యెదురుగా నరిగి మునులు
మిగులగా భక్తియుక్తి స మేతులగుచు॥ 55

గీ॥ చేతులనుమోడ్చి నొసళుల జేర్చికొనుచు
నభినుతుల్ జెసి యర్ఘ్యపా ద్యాదివిధులు
సలుపవారికి గౌరవా దులను నెఱప
నంత నాతని దోతెంచి రందఱు నొగి॥ 56

గీ॥ ఉన్నతాసనమున గూరు చుండబెట్టి
సేమ మారసి యెల్లరు నీమమొప్ప
నున్నయెడ జడదారుల మిన్నయగుచు
నొప్పు మునిసుమిత్రాభిఖ్యు డొప్పుగాను॥ 57

గీ॥ వినయమొప్పార నెల్లర యనుమతి గొని
దేవ; విశ్వజ్ఞ; సర్వముం దెలిసినట్టి
వాడవౌటను నీదగు వాక్సుధార
సమ్ముచే మమ్ము దనుపుము సమ్మదమున॥ 58

సీ॥ పంచవేదంబుల బఱగిన ధర్మముల్
హృదయంగమంబుగా నెఱిగినావు,
సర్వోపనిషదర్థ సారంబు గ్రహియించి
యాత్మావలోకనం బరసినావు,
ధర్మశాస్త్రములెల్ల దఱచి వచించి లో
కులకు సన్మార్గము నిలిపినావు,
గాటమైన పురాణ గాథ లెన్నియొచెప్పి
పామరాళికి బోధ పఱచినావు॥

గీ॥ సకల ధర్మంబు లరసిన జ్ఞానివౌట
నవని విశ్వజ్ఞు డనుపేర నలరినావు,
సృష్టికర్త తనూజుడై వెలగితీవు
నిన్నుగొనియాడ దరమౌనె నిర్మలాత్మ॥

గీ॥ నిర్మలజ్ఞాన మహిమచే నెగడినావు
తపము సత్యంబు చేతను దనరినావు
సర్వ భూతములందున సముడవీవు
సార సద్గుణవర్తి వి శ్వజ్ఞ మూర్తి॥ 59

## మునిసువ్రతుండు ప్రపంచోత్పత్తి వినంగోరుట

గీ॥ భవ్యగుణుడైన యాపరా త్పరుడు సౌఖ్య
కరుడు లోకముల్ సృజియించె గరుణతోడ
నందు భూలోకమనునది యందఱకును
నుండ గల్పించెనని విందు మోమహాత్మ॥ 60

క॥ పదునాలుగు భువనములని
విదితంబుగ జెప్పుచుంద్రు విబుధులు సత్కో
విద; భూలోకస్థితి స
మ్మదమున దెలియంగ జెప్పి మమ్ము దనుపుమా॥ 61

క॥ అని ప్రార్థన మొనరించిన
మునిసువ్రత మౌనిగాంచి ముదమొప్పగ ని
ట్లను, నా విశ్వజ్ఞమహా
ముని యెల్లరువినగ సృష్టి మూలము గృపతోన్॥ 62

## విశ్వాణ్డంబు ప్రపంచోత్పత్తిం దెలుపుట

ఆ॥గీ॥ పుడమిమొదలు నైదు భూతంబులును సూర్య
చంద్రములును జంతు సమితి యెదు
మూర్తులెవ్వి యాది బుట్టకమును పర
బ్రహ్మ మొండుకలదు భవ్యచరిత॥ 63

సీ॥ నామ రూపక్రియ లేమియు లేనట్టి
దౌటచే నవ్యక్త మనగ ననియు,
ఆదియందు నవిద్య యనుదానిచే నన్ని
గల్పించుటను విశ్వ కర్తయడియు,
హర హరి విధి శక్ర తరణులచే గొల్వ
బడుటచేతను పర బ్రహ్మ మదియు,
బహిరంతరంబుల బరిపూర్ణమై నిండి
పొలుచుటచే ఐరి పూర్ణ మదియు॥

గీ॥ దానికి సమాన మెద్దియు లేనిచౌట
నద్వితీయంబనంగను నలరు నదియ,
మనమునకు వాక్కునకు నిట్టి దనుచు దలచ
బలుక శక్యముగానట్టి పరమ మదియ॥ 64

సీ॥ పుడమియన్నను నది పుడమియుగాదు, జ
లంబనుకొన్న జ లంబుగాదు
అగ్నియే యనుకొన్న నగ్నియుగా, దని
లంబనుటకు నని లంబుగాదు,
ఆకసమన్నగా దాకస, మదియు సూ
ర్యుండనుకొన్న సూ ర్యుండుగాడు,
చంద్రుడేమోయన్న జంద్రుండుగాడు జీ
వుండనుకొన్న జీ వుండుగాడు॥

గీ॥ చీకటియుగాదు, వెలుగని చెప్పరాదు,
కదలుటయులేదు, యంతటన్ గానబడెడు
నట్టి పరమాత్మయందున మొట్టమొదట
తత్వము మహత్తనంగ గ్రొ త్తది జనించె॥ 65

సీ॥ అట్టి మహత్తత్వ మను నవిద్యయె తొల్త
తలలు మోములును నే త్రములు సెవులు

గాళ్లు సేతులు నోళ్లు గలయట్టు లెల్లెడ
బరిణమించుట, మాట వలుకుటయును,
చూచుట వినుటయు జుల్కగా నడచుట
పనులు సేయుట యను పంచకంబు
మొదలుగా గలయవి యుదయింపకున్నను
హృదయంబనగ నొక్క టుదయ మయ్యె॥

గీ॥ అట్టి డెందాన నేను నే ననెడు నట్టి
దౌ యహంకారమొండు ద నంత బొడమి
కనగ దానున్న జగమున్న దనెడు పలుకు
నిక్కవము చేయుగతి గమ నింపదొడగె॥ 66

## పంచభూతాద్యుత్పత్తి

గీ॥ ఆ యహంకారమే మన సయ్యె, నట్టి
మనమునం దలపోసిన మాత్ర నాక
సంబనెడు భూతమొక్కటి జనన మయ్యె
శబ్ద మోంకారమటు లందు సంభవించె॥ 67

గీ॥ ఆకసము రూపమునులేని దయ్యె శబ్ద
మనెడు గుణముంట వాయువుం గనియె, నట్టి
గాలి స్పర్శగుణంబును గాంచి, తండ్రి
శబ్దగుణమును దానొగి సంగ్రహించె॥ 68

గీ॥ గాలియందున నగ్ని త క్షణము బుట్టి
రూప గుణమూని పితృలకు రూఢినున్న
స్పర్శశబ్దంబు లొక్కట సంగ్రహించి
వెలుగు చుండెను, తేజంబు వెలయుచుండ॥ 69

గీ॥ అగ్నియందున నుదకంబు నవతరించి
ద్రవము గుణముగగాంచియు దండ్రి తాత
తాతతండ్రుల గుణములై తనరు రూపు
స్పర్శ శబ్దంబు లొక్కట సంగ్రహించె॥ 70

గీ॥ ఉదకమందున భూమియు నుద్భవించి
గంధగుణమూని పూర్వుల గలుగు రసము
రూపమును స్పర్శమును ధ్వని రూఢి బూనె
యన్ని యన్నిటికిని ముఖ్య మైతనర్చె॥ 71

గీ॥ ఆకసము గాలి యగ్ని నీ రవని యనెడు
పంచభూతంబు లిట్టుల ప్రభవమొంది
శబ్దమాది గుణంబుల సంగ్రహించి
యుండు టనుగాంచి మతియొక్క యూహచేసె॥ 72

గీ॥ ఒండు రెండు మూ ర్నాలుగై దొప్పు విషయ
ములు గలిగిన నభంబాది భూతవితతి
యందు సహకారులుగ నాలు గలవరించి
పుడమిని ప్రధానమగు భూత ముగనొనర్చి॥ 73

## ఓషధాద్యుత్పత్తి

ఆ॥గీ॥ అట్టి భూమి యందు నఖిలౌషధీ చయం
బందు ప్రాణికోటు లన్నియొకట
బుట్టుగాక యనుచు బుద్ధిని దలచిన
బుట్ట దొడగె నన్ని పుడమియందు॥ 74

గీ॥ యవలు, గోధుమల్ తిలలుయు లవలు పెసలు
మొదలు యోషధీసముదయ మ్మును ధరిత్రి
మొలువగా వీనియాధార ముగను నండ
జములు నుద్భిజ్జములు స్వేద జములు బిండ
జములనెడు నాల్గు విధముల సముదయములు॥ 75

గీ॥ బుట్టుగాక యటంచును దిట్టముగను
దలవనెను బదినాల్గు ల క్షలగు జీవ
రాసులెల్లను నిజశరీ రములతోడ
నొక్క పెట్టున బుట్టె, నీ యుర్వియందు॥ 76

గీ॥ క్రమముగా బుట్టు టంగని కాంక్షచేయ
నంత నొక్కొక్కజాతి య నంతముగను
బుట్టసాగెను తమయంత భూమియందు
సృష్టికర్త మనస్సుచే సృష్టిచేయ॥ 77

## సృష్ట్యంతరము

సీ॥ అయ్య; పరాపర మందు పరము, పర
మందు శివము, శివ మందు శక్తి,

అందు నాదము, నాద మందు బిందువు, బిందు
వందున గళ, కళ యందు శ్రీస
దాశివుం డట్టి స దాశివునందు మ
హేశ్వరుం, డట్టి మ హేశునందు
నీశ్వరుండును, నట్టి యీశ్వరునందున
రుద్రుండు పుట్టె, నా రుద్రునందు
విష్ణువు జనియించె, విష్ణువందున బ్రహ్మ
బ్రహ్మయం దాత్మ సం భవమునయ్యె
నాత్మయందున దహ రాకాశము జనించె,
నాకసమున వాయు, వందు నగ్ని,
యగ్నియందున జల, మప్పున భూమియు
భూమియం దోషధుల్ బుట్టె దొడగె॥

గీ॥ నోషధులవల్ల నన్నంబు నుద్భమించె
నన్నమున నరపక్షి మృ గాదులైన
జంగమ స్థావరంబులు జననమగుచు
బుట్టినక్రమాన నైక్యత బొందుచుండె॥ 78

గీ॥ అనుచుజెప్పిన విని కుతూ హలము తోడ
నార్యతిలకా; భవత్కరు ణాదరమున
వినిచిన ప్రపంచ సంభవ మును వినియును
దనివి తీరదు, మఱియొండు వినుచు, మార్య॥ 79

## అండజాది జంతూత్పత్తి

క॥ గురువా; యాలోకంబున
బరమేశ్వరుచే సృజింప బడినట్టి చరా
చర జీవకోటి గల దే
వరుస జనించెనొ వచింప వలయు మహాత్మా॥ 80

క॥ అని మునిసుమతు డడిగిన
ఘన కరుణాలోకనములు గ్రాలగ నిటులన్
వినుచును విశ్వజ్ఞ మహా
ముని యెల్లరు వినగ సృష్టి మూలము గృపతోన్॥ 81

గీ॥ స్థావరములు జంగమములు జగతియందు
నిరు తెఱంగుల ప్రాణులై నెరినె నుబది
నాల్గు లక్షల సంఖ్యచే నలరు నట్టి
వాని సంఖ్యను వివరింతు, వత్స; వినుమ॥ 82

గీ॥ స్థావరంబు లిరువది లక్షలు, పశువులు
బదునొకందగులక్షలు, బక్షులు పది
లక్షలు, క్రిములు ముప్పది లక్షలు, జల
చరములునును తొమ్మిదైన లక్షలు మనుజులు
నాల్గులక్షలు సంఖ్యలు నాగదెలియుము॥ 83

గీ॥ అవి చతుర్విధ తనువులై యలరు, నండ
జములు నుద్భిజ్జములు స్వేద జములు బిండ
జములు ననగను దనరె నీ జగతియందు
బాంచభౌతిక ములనంగ బరగె గుఱ్ఱ॥ 84

గీ॥ అట్టి పాంచభౌతికము లై నట్టి తనువు
లైన యండజోద్భిజ్జ జ రాయుజాదు
లెటుల ప్రభవించి విలసిల్లె నీ క్రమంబు
బరమ కృపతోడ దెలుపుము గురువ; యనిన॥ 85

## అండజములు

గీ॥ అండజములన గ్రుడ్డుల యందు బుట్టు
నట్టి ప్రాణి సమూహంబు నయ్యె, నవ్వి
యెవ్వియన మత్స్యములు బాము లెగురునట్టి
పిట్టలును మొదలగునవి పృథివియందు॥ 86

## స్వేదజములు

గీ॥ స్వేదజంబులనంగను జెమటవలన
బుట్టు ప్రాణులునగు, నవి యెట్టివనిన
దోమలును బేలు నల్లులు నీ మొదలగు
చిన్న జంతువులెల్లను చిట్టికన్న॥ 87

## ఉద్భిజ్జములు

గీ॥ జగతి నుద్భిజ్జములు భూమి పగులజేసి
కొనుచు మొలిచెడి ప్రాణుల కొనరు నెవ్వి
యనిన దీవలు పొదలును నవనిజములు
నైన స్థావరములు నాగ నగును తండ్రి॥ 98

## జరాయుజ వివరణము

గీ॥ ఇక జరాయు జోత్పత్తి నే నెఱుగజేతు
విను-జరాయువనన్ మావి కొనరుచుండు
నట్టి మావి యందున బుట్టు నవి పశువులు
మనుజు లాదిగ జంతువుల్ మాన్యచరిత॥ 89

ఆ॥గీ॥ అర్య; మావి యనెడు నదియెట్టిదో దాని
యందు గో నరాదు లైన జంతు
సముదయం బిదెట్టు జనియించుచుండునో
వివరమెల్ల నాకు వినుచు మార్య॥ 90

ఆ॥గీ॥ వినుమ యాజరాయు వనునది పలుచని
చర్మ సంపుటంబు సారసంపు
ముకుళమటుల గర్భ మున నధోముఖముగా
జనన కోశమందు బెనగియుండు॥ 91

## నిస్సంతాన సూచన

గీ॥ అట్టి కోశంబునందు వీ ర్యద్వయంబు
క్రమముగా జేరకుండెడి సమయమందు
క్రిములు దద్వీర్యభక్షణన్ గీడు మూడు
కారణంబున నిలువదు గర్భమపుడు॥ 92

గీ॥ నాతులందు బద్మిన్యాది జాతులుగను
వెలయుచుంద్రు రహస్యాంగ భేదములను
నవ్వియె షడష్ట దశద్వాద శాంగులముల
నిమ్నతగ నొప్పియుండుటె నిక్కవంబు॥ 93

గీ॥ పురుష లటులె రహస్యాంగ ములను బట్టి
శశక మృగ వృక్ష హయులను సంజ్ఞవార
లౌదురు ష డష్ట దశ ద్వాద శాంగులముల
దీర్ఘకాయము లుంటను ధీ ప్రకాశ॥ 94

గీ॥ అందుచే నిమ్నమగు రహ స్యాంగమున్న
సతికి హ్రస్వాంగయువకుని సంగమమున
జారు వీర్యము మావిలో జేరుట రిది
గాన నందుచేనిలువదు గర్భమపుడు॥ 95

గీ॥ అతిరతిని నన్యరతిని దే హాంతరముల
క్షుద్రరోగాప్తిచే మావి ఛిద్రమగును
గాన నారెండు మావిలో గలియకుండు
కారణంబున నిలువదు గర్భమపుడు॥ 96

గీ॥ వనితలకు వంధ్యాదోష మనగ నిట్టి
కారణంబులచేతను కలుగుచుండు
నదియె యువతులయెడల దొ మ్మిది విధములు
గాగ వ్యాపించుచుండును కన్నతండ్రి॥ 97

గీ॥ చేపలందలి గ్రుడ్డులు సెనయనబడి
నల్లపూసలసేరుల నాగనుండు
గోళ్ల గర్భములందలి గ్రుడ్లసేరు
లట్టులను మావి స్త్రీలయం దంకురించు॥ 98

గీ॥ అజరాయువె మృగ గో న రాదికముల
స్త్రీల గర్భములందున జేరియుండి
ఋతురతులయందు వికసించు కతన నందు
శుక్ల శోణితములు సేరు జోద్యముగను॥ 99

## సప్తధాతూత్పత్తి

గీ॥ పురుషుడును నారి యాకటన్ భుక్తిగొనిన
యట్టి యన్నాదికము జఠ రాగ్ని వలన
బచనమై నీరునై రస భావమొంది
పిదప రక్తముగా మారు నదియ వత్స॥ 100

గీ॥ నల్లవలనను మాంసంబు నాడు లట్టి
మాంసమున నందు మెదడును మఱియుమెదడు
నందు నెమ్ములు నెమ్ముల యందు మూల్గు
లందు వీర్యము జనియించు నయ్య; కుఱ్ఱ॥ 101

గీ॥ అట్టి వీర్యము బురుషుల యందుచెల్ల
నైన దౌట దానిని శుక్ల మందు రదియె
యువతులందున నెఱ్ఱగా, నుద్భవించు
నందుచే దాని శోణిత మందురార్య॥ 102

గీ॥ అవియురెండును రతికాల మందు గాలి
ప్రేరణంబున వెడలియు నారిగర్భ
గోళమందున మావిలో గూడికొనిన
నది జరాయుజ సంజ్ఞయై యలరు వత్స॥ 103

గీ॥ పాంచ భౌతికమైన ప్రపంచమిటుల
సృష్టియయ్యె నటంచును చెప్పితి, నిక
నింతులకు శోణితోత్పత్తి యెటులగలిగె
నద్ది తెలిపెద, వినుమయ్య; ముద్దులయ్య॥ 104

## స్త్రీలకు ఋతుకాలము

గీ॥ అబలలకు బదియుబ్దము లైన పిదప
నట్టిరుధిరంబుమై రహస్యాంగమున స్ర
వించుటను ఋతుకాల మటంచునెంచి
దాని నార్తవ మందురు దైవవిధిని॥ 105

గీ॥ అష్టమాబ్దింబున గౌరి యనియు, నవమ
హాయనమునందు రోహిణి యనియు బదియ
వాబ్దమున గన్య యని యందు రంతపైని
ఋతు మతిగనెంచు చుందురు పృథివియందు॥ 106

## స్త్రీలకు ఋతువు దేహధర్మము

గీ॥ ఆర్తవపుగాలమౌ పది యారు దినము
లందు మూన్నాళ్లు ద్రవవేగ మగుటవలన
బురుష వీర్యము నది వెలి బుచ్చు ననుచు
సతుల వెలిబెట్టుదురు, దోష మతులమనుచు॥ 107

గీ॥ అంతియేకాని దేహము లందు గలుగు
శోణితోద్గమమునకు న శుచియులే ద
టంచు సర్వత్రకల మాన వాళి యనిరి
గాని మన హిందువులు దోష కలితమంద్రు॥ 108

సీ॥ ఆంగ్లేయు లమెరిక లాష్ట్రేలియ జనులు
చీనా జపాన్లు బెల్జియమువారు

రష్యాలు టర్కీలు రబ్బీలు జర్మని
లిటలీలు గ్రైస్తవుల్ హిందువులను
తెలగాలు భట్టులు వెలమవార్ క్షత్రియుల్
గాపులు మొదలు సంఘములవారు
లవని రజస్వలానంత రోద్వాహముల్
నలిపెడి వారౌట జానలయెడ॥

గీ॥ నార్తవపు దోషమని ప్రథ మార్తవమున
నెన్నుకొనుచును శాంత్యాదు లెపుడు చేయ
రద్దియే దేహధర్మ మటంచునెంచి
స్రావమున్నంత వరకును సలుపరు రతి॥ 109

## ఋతుదోషాపాదనమునకు విశ్వరూపాచార్య చరిత్రము

ఆ॥గీ॥ ఆర్యతిలక; దేహమందున జనియించు
ద్రవము యేబదేండ్లు దనుకను ప్రతి
నెల ద్రవించు, దాని కిలదోష మెటుగల్గె
విస్తరింపు దాని విధమనినను॥ 110

క॥ అన్నా; వినుమా; యేనొక
చిన్నది వృత్తాంత మొండు సెప్పెద, దానిన్
విన్నను వేదోక్తంబగు
తెన్నెట్టిదొ నీదుమదికి దెలియును వత్సా॥ 111

గీ॥ ఆదియుగమున నాకము నందు నింద్రు
డొగిసుధర్మను నోలగం బున్నతఱిని
సకలసురలు మునీశ్వరుల్ సందడింప
నచ్చరల మిన్నయగు రంభ యంతలోన॥ 112

గీ॥ సభ్యులెల్లరు మెచ్చెడు జాడవింత
నాట్యమొనరింపుచుండ గంధర్వవరులు
బాడ నత్యంత సంతోష వార్ధి దేలి
మఘవు డదిగనుగొనుచు మై మఱచియుండ॥ 113

గీ॥ నంతలో దేవతాచార్యు డాఢ్యుడైన
యా బృహస్పతి సభకురా నమరవిభుడు
వేశ్యనాట్యంబుచే దేహ విస్మృతుడయి
గురున కభివందనాదులు గూర్పడయ్యె॥ 114

గీ॥ అందుచే గోపసంయుక్తు డైనసురేజ్యు
డచ్చటనుబాసి యింటికి నరుగుదెంచి
కోపమాటమి నొకచోట గూఢముగను
దాగియుండెను; యిందు సు త్రాము డంత॥ 115

గీ॥ సభను చాలించి దేవతా చార్యు డిందు
వచ్చెనో యనుచును స్పృహ వెచ్చికొనియు
నెంతయపరాధ మొనరించి తేననుకొని
గురుని మందిరమునకును సరగ నలిగె॥ 116

గీ॥ ఏగియాచార్యు బిలిచిన నెందు బలుక
కునికి భీతిల్లి కనక గ ర్భునకు దెలుప
సత్య లోకంబునకు నేగి సారసభవు
గాంచి ప్రణమిల్లి నుతియింప గడగెనపుడు॥ 117

గీ॥ సకల లోకంబులంగల్గు స్థావరములు
జంగమంబులు నాసగు సకలజీవ
రాసులసృజింపుచును జిద్వి లాసగరితు
నవ్యయుత వెల్గుచుండు మ హాత్మ; స్రష్ట॥ 118

గీ॥ దేవ; యీక్షణమందు మా దేశికునకు
రాజ్యమదమున నింద్రియ భ్రాంతిచేత
గొప్ప యపరాధమొందు నే గూర్చినాడ
నిప్పుడే తత్పునమ్బబ్బె నేమిచేతు॥ 119

గీ॥ ఆర్య; నా సభలో రంభ యాడుచుండ
నదియు గనుగొను చెంతయో ముదముతోడ
మైమఱచియుండ నింతలో మా గురుండు
వచ్చెనట యేనెఱుంగను వారి దనుప॥ 120

గీ॥ అంత నాతడు గోపము స్వాంతమందు
నూని యింటికినేగ, నే నును తదీయ
గేహమునకేగి పిలిచిన గీష్పతియును
బలుకక నదృశ్యుడయ్యెను పాపమేమొ॥ 121

గీ॥ అనిన జతురాననుం డిట్టు లనియె నింద్ర;
యేమిటీయ పకృతి యిట్టి దేరికిని భ్రా
మ ప్రమాదముచె లభ్య మగును దీని
కింత భీతిల్లనేల సు రేంద్ర నీవు॥ 122

గీ॥ అతడు నీయందు గోపించి యరిగెగాన
నింతలో నీకుగానరా డిందుపైని
మఱియొక గురూత్తముని నీవు మంచి చేసి
నీదు యధ్వర కార్యముల్ నెఱపదగును॥

గీ॥ అంతకన్నను గొప్పవా రవని యందు
నెవరుగల రట్టివారి మీ రెరుగజేయు
డయ్య; మీ యాజ్ఞను శిరంబు నందు నూని
వారి నాచార్యులుగ వేడు వాడ దేవ॥

గీ॥ త్వష్టృ పుత్రుండు పంచవే దప్రవీణు
డన్నమును సోమమును సుధ యశనముగొను
మూడు శిరములు గలవాడు పూజ్యుడైన
విశ్వరూపార్య డాతని వేడుమనిన॥

గీ॥ ఆతడెచ్చోటనుండునో, యట్టివారి
యాశ్రమంబెద్దియో, తమ రానతిండు
మీ యనుజ్ఞను నచటికి బోయి వారి
బ్రార్ధనం బొనరించెద భవ్యచరిత॥

గీ॥ భూమికిని ముఖ్యమాధార భూతమైన
మేరువున కుత్తరంబునన్ మెరయువనము
నంద సోనిష్ఠుదెయుండె నందునేగి
నీదుగురువుగ నాతని నేర్పరచుము

గీ॥ అను ప్రజాపతి వాక్యంబు లాలకించి
చని యచటగాంచె రెండవ శంభుడనగ
పల్లజడలు త్రిపుండ్రంపు ఫాలములును
గలిగి ఖేచర ముద్రచే వెలయుచున్న
విశ్వరూపార్యునకు మ్రొక్కి వినుతి జేసె॥

క॥ వరమ తపోనిష్టుడవును
పరమ జ్ఞానివియు వేద పంచక విధులన్
గురుతెఱిగిన ప్రాజ్ఞుండవు
నిరుపమ యజ్ఞాధికార నిపుణుడ వనఘా॥

గీ॥ ఏను దేవేంద్రుడనువాడ నిపుడు నీదు
చరణ సరసిజములు గొల్వ నరుగుదెంచి
నాద మీ శిష్యవరునిగా నన్నుగాంచి
నాదు ప్రార్థన మన్నింపు న యగుణాఢ్య॥ 130

ఆ॥గీ॥ గురువులేని విద్య కూడదెవ్వరికను
నార్యవాక్యముండె నార్యవినుత
గురువు నన్నువీడి జరిగె నెందేనియో
గురువు నీవటంచు గురుతు గలిగె॥ 131

క॥ గురువే బ్రహ్మయు విష్ణువు
గురువే పరమేశ్వరుండు గురువరుడే యా
పరమాత్మయనుచు బలికెడు
వరవాక్యము నమ్మి యేను వచ్చితి నార్యా॥ 132

గీ॥ అనుచు వినుతించి, పాదము లందు తనదు
బొమిడికపు రత్నదీధితుల్ బొరల జేసి
నిలిచి ప్రాంజలియైయున్న బలవిరోధి
కనియె దయతోడ విశ్వరూ పార్యవరుడు॥ 133

గీ॥ దేవతా సార్వభౌముడౌ నీవువచ్చి
మమ్ము నాచార్యునిగవేడ సమ్మతింప
కునికి ధర్మేతరంబని మనమునందు
నెంచి నీ ప్రార్థనంబు మ న్నించినాడ॥ 134

గీ॥ అనిన విశ్వరూపా చార్యు నవ్విమాన
మందు గూర్చుండబెట్టి మ హాముదమున
నాకముకు దోతెంచియు నవ్యరత్న
పీఠమున నుంచి పూజించె బెద్ద భక్తి॥ 135

గీ॥ ప్రతిదినము నిజాచార్యాను మతిని నధ్వ
రక్రియలు నెరవేర్చుచు రాగ గొంత
కాలమైన పిమ్మట దను జాళికి ని సు
రాళికిని జాల కయ్యంబు లపుడుగలిగె॥ 136

క॥ వారలు వీరలు మిక్కిలి
పోరునెడన్ దానవాళి పొగరెక్కి సుధా
హారుల దరిమి పరాజితు
వై రయమేగునటు మోది రతి బలమొదవన్॥ 137

గీ॥ అంత దేవత లెంతయో చింతజాల
వంతనొందియు నిదియేమి వింత మిగుల
రంతు జేయుచు నసురుల పంతమొదవె
సుంతయైనను మేలురా దెంతకైన॥ 138

గీ॥ అనుచు దలపోసి విశ్వరూ పార్యవర్యు
డాసురులయందు బాకీకు డై హవిస్సు
మంతనంబున నిచ్చెనో మార్తురకును
బలము హెచ్చుయ్యెననుకొని బలవిరోధి॥ 139

## ఇంద్రుడు విశ్వరూపుంజంప నాతని శిరంబులు బక్షులగుట

గీ॥ ఆత్మ యోచించి గురువుపై నాగ్రహించి
వజ్రఘాతంబుచే దలల్ వ్రచ్చి చంప
నంత నతని శిరంబులు నయ్యెగొంజు
పిచ్చుకయు తితువయునను పిట్టలుగను॥ 140

గీ॥ అతని దేహంబులో నున్న యాత్మ దివ్య
తేజమై యెల్లరులు సూడ దీప్యమగుచు
బ్రహ్మలోకంబునకునేగి బ్రహ్మ గలిసె
బ్రహ్మహత్య దేవేంద్రుని బట్టుకొనియె॥ 141

గీ॥ మిగుల చింపిరి తలయును మిట్ట గ్రుడ్లు
పెద్దకోరలునుం బేత బెద్దద్రుడ్డు
కప్పెరయుబూని కడు భయం కారిణియయి
బలరిపునివెంటనంటెను బ్రహ్మహత్య॥ 142

క॥ నడచునెడ నిలుచునెడ సా
పడునెడ మేల్కాంచునెడను బండెడునెడ జూ
చెడునెడ గనుమూసెడునెడ
దడబడకయె బ్రహ్మహత్య ధర్షించువెసన్॥ 143

గీ॥ ఇటుల నొకయేడు బాధయెం తేనిపొంది
యోర్వలేక మహేంద్రుడీ యుర్విజేరి
పతితపావనమగు సత్పవి భావమున్న
గంగదరిజేరి దైన్యత బ్రుంగి పలికె॥

క॥ తిననియ్యదు మననియ్యదు
కననియ్యదు రేబవళ్లు గనలుచునెందున్
జననియ్యదు యొక్కెడ గూ
ర్చొననియ్యదు తాళలేను చూడుముదీనిన్॥

గీ॥ అనుచు మొరలిడు పురుహూతు గనియు గంగ
గనికరంబున బొదగను చనియెనిట్టు
లమరనాయక; యీపాప మంత నేను
బాపజాలను నాలవ పాలు నిమ్ము॥

గీ॥ అనిన నొడబడి యాపాప మపుడు నాల్గు
భాగములు జేసి యొకపాలు పాలుతెట్ట
నదియె నురువుగ బరిణతి సందె, దాని
నంటువారలకును బ్రహ్మ హత్యదొరయు॥

గీ॥ అమ్మ! ని యందు మజ్జన మాడువారు
పాపములుబాయుదు రటంచు వరమొసంగి
భూమి దరిజేరి ప్రార్థించి భూమికొక్క
భాగమిడి పాదపంబుల పజ్జకరిగి॥

గీ॥ తరువులార! నా పాపము దతిగెసగము
గంగయును భూమియర్థభా గంబుగొనిరి
మీరలొకపాలుగొనుడని దారులకిడి
స్త్రీగణంబుల సన్నిధి జేరియంత॥

ఉ॥ అంగనలారా! మీరలు శు
భాంగులు భావభవానుకూల శా
స్త్రాంగ విమర్శనాభిలప
దాత్మమనోహర కాంక్షిత ప్రదా
పాంగ విలోకనా చతుర
భావము గల్గిన వారలంచు ను
ప్పొంగి మదీయ వాంఛితము
బూరణ మానని వచ్చితేననన్॥

క॥ ఎవ్వారు మీరు మమ్మిటు
లివ్విధి ప్రార్థింపనేల నిదిచూడంగా
నవ్వులయి తోచుచుండెను
చివ్వున వచియింపుమయ్య చిత్తములలరన్॥ 151

చ॥ నలిన దళాక్షులార! సుర
నాయకుడైన మహేంద్రుడేను చం
చలమతినై గురూద్వహుని
జంపితి నందున ఘోరపాప మ
గ్గలమయి వేచ వేడినను
గంగయు భూమియు నావనస్పతుల్
దొలగగ జేసి రెంతో దయ
తో నఘమందలి మూడు భాగముల్॥ 152

గీ॥ ఒక్క భాగంబిపుడు నిల్చి యుండెగాన
మీరలు పరిగ్రహించియు మేలు సేయు
డేను మంచి వరంబుల నిచ్చువాడ
నా మనవిని గొనుండు మ న్ననమీరు॥ 153

గీ॥ అనుచు నీక్రియ మాటికి నాడు దేవ
రాజువాక్యంబు లాలించి రాజముఖులు
మానసంబుల జింతించి దీనవదన
లగుచు వినయంబుతోడ ని ట్లని పలికిరి॥ 154

క॥ దేవేంద్రునంతవారలు
గావించిన దుష్కృతంబు గడద్రోయంగా
మావంటివారి తరమా
దేవర; మీ కోర్కె యెటుల దీర్చెదమేమున్॥ 155

గీ॥ అనినయెడ వాసవుండిట్టు లను సుధామ
యూఖముఖులార; మీరటు లొప్పికొంటి
రేని నే సంతసించి యం తేని మేలు
సేసెదను నమ్ముడీ వేరు చేయకుడన॥ 156

ఉ॥ ఏమిటి మేలు సేసెదరు
యెన్నికతో నెఱిగింపుడన్న సు

త్రాముడు వల్కునో యువతు
లార; జగంబున నున్న జంతువుల్
గామునికేళి యొక్క ఋతు
కాలమునందున సల్పి సంతతుల్
వేమరు నొందుచుం డి రిల
వేలును లక్షలు గోటులాదిగన్॥ 157

గీ॥ మీఱ లనృతుమతులౌట మీరు నాదు
పాపమునుగొన ఋతువుగా బరిణమించు
గాన ఋతువున ను రతి సౌ ఖ్యమును గలుగు
ఋతువునందున మిగుల సం తతులుఁగలుఁగు॥ 158

## స్త్రీలు బ్రహ్మహత్యా భాగము నొందుట

గీ॥ నాదు ప్రార్థన మన్నించి సయముతోడ
పాపభాగంబు నొందు డో భామలార;
అనిన నౌగాకయని వార లందరునొగి
సమ్మతించియు పాపభా గమ్ము గొనిరి॥ 159

గీ॥ అదియె ఋతువుగ స్త్రీలయం దంకురింప
మై రహస్యాంగముల ద్రవ మై స్రవింప
వారలెన్నడు నెరుగని వారలౌట
దానిగని వార లబ్బుర మూనియనిరి॥ 160

క॥ అమరాధిప; యీ ఋతుకా
ల మదెంతయో దానిలోప లను హత్యా దో
షమునునది యెన్ని దినములొ,
క్రమమున వచియింపుమయ్య; కడు భయమొదవెన్॥ 161

గీ॥ అతివలారా; ఋతువు పది యారుదినము
లందు మూడుదినంబులు హత్యదోష
మవలి దినములు బదుమూడు నందుదోష
మేమియును లేదటన్న వా రిట్టులనిరి॥ 162

గీ॥ ఒక్క ఋతుకాలమందె సం యోగముండి
సంతతుల నొందుచుండుట సకలజంతు
తతికి స్వాభావికంబైన ధర్మమనిరి
కామినులమైన మేమటు కడపగలమె॥ 163

గీ॥ అరయ జగతిని ద్విగుణ మా హారమును జ
తుర్గుణంబగు బుద్ధి చా తుర్య గరిమ
సాహసము షడ్గుణంబు న ష్టగుణకామ
మతివలకు బురుషులకన్న నధికమంద్రు॥ 164

## కామాతుర స్త్రీలు రతి నియమములు దెలుపుట

గీ॥ ఇంద్ర; గార్హస్త్య ధర్మము లిలనుగలవు
స్నాతలమునయ్యు మిక్కిలి పూతలమయి
నాల్గవ దినంబునందు మా నాధుల దరి
ప్రేమ జేరంగ వారలు నీమమొప్ప॥ 165

గీ॥ మనుతిథుల, వ్రతతిథుల, సంక్ర మణములను, జ
యంతులను, పితృతిథుల, సూ ర్య బుధవాస
రముల, జన్మర్క్షములను, ప ర్వముల, నన్నృతు
కాలముల దోషమనుచును గలియరుమము॥ 166

గీ॥ రోగిణిని, గర్భిణిని, బతిన్ రోయు దాని,
గోపినిని బహిష్ఠను, నన్య గోరుదాని,
నన్యభార్య, నకామిని నప్రశస్త,
దలనెరయుదాని, మలినను దగదు కవయ॥ 167

క॥ యువతులు స్వస్థలబయిన రో
గవతులుగా నున్న వారి గవయు నెడల ద
ద్రవ మొక్కటను యెలె క్రో
ధవరుగతిన్ దేహమెల్ల బర్వును వడిగాన్॥ 168

క॥ అతిమైధునంబుచే రో
గతతియు, ధాతుక్షయంబు; గర్వత,. నైష్క
ర్మ్యత, దారిద్ర్యతయును సం
గతమౌ కావునను నియతి గా గూడదగున్॥ 169

ఆ॥గీ॥ మంచినగలు మిగుల మంచి వస్త్రంబులు,
మంచి బుద్ధి కలిగి మగనియందు
శుద్ధ చిత్తమూని శుచియయి, యారోగ్య
వతియునైన సతిని వలయు గవయ॥ 170

గీ॥ ఇట్టినీమంబు లెన్నియో యిలనుగలవు
అట్టి నీమంబులం గని పెట్టి పురుషు
లెట్టకేలకు మమ్ముల నేలిరేని
కామమాపుట మాతర మా మహేంద్ర॥ 171

క॥ వరమిచ్చెద ననియంటిరి
పురుహూతా; సార్వకాల ముసు రతిసౌఖ్యం
బిరవుగ గలుగు నటుల స
త్కరుణస్ వరమిమ్మటంచు కాంక్షించిరొగిన్॥ 172

క॥ అంతన్ హరియిట్లను నో
కాంతామణులార; విధృత గర్భిణులయ్యున్
సంతా నావస్థాప
ర్యంతము బురుషరతిసౌఖ్య మందగగలుగున్॥ 173

క॥ అని వరమొసంగి ఇంద్రుడు
ననియెన్ సంతసముతోడ స్థలితాఘుండై
యనిమిషులు గొల్వ నాకం
బున భోగము లందుచుండె బుణ్యాత్ముండై॥ 174

## స్త్రీలు బ్రహ్మహత్యా దోషంబున గర్హితలగుట

గీ॥ ఆది మొదలు కాంతలకు బ్రహ్మ హత్య ఋతువు
నందు మూన్నాళ్లు దనుకను నంటియుండు
కారణంబున మిక్కిలి గర్హితలుగ
దూరమున నుంచబడుదురు మేరగాను॥ 175

గీ॥ ఆది దినమున జండాలి యని, ద్వితీయ
దినమునను బ్రహ్మఘాతిని యని తృతీయ
దినమునను దాని చాకెత యని చతుర్ధ
దినమునను బరిశుద్ధురా లనియునండ్రు॥ 176

గీ॥ అతివలకు నార్తవపు దోష మనుచు వేద
ములను శాస్త్రముల బురాణ ముల విధించి
యుంట హిందువులను గొంద రొప్పకొనిరి
ఇదియ ఋతు దోషమంచును నెంతురిలను॥ 177

గీ॥ హరవిలాస శారద యతివలకును
పదియు నాలు గబ్దంబుల పైని బెండ్లి
జేయతీరు మానించుట చేత ను ఋతు
దోషమనునది జగమున ద్రోయబడియె॥ 178

గీ॥ జగతియందున స్థావర జంగమములు
ఋతువునందున సంభోగ మతిశయించి
యనృతుకా లంబులందున నంటు వడక
నియతిగా సంచరించుట నీతిపథము॥ 179

## మానవరతి స్వాతంత్ర్యము

గీ॥ ఇట్టి నిర్ణీత మెల్లెడ నేర్పడియును
జరుగు చుండెను మానవ జాతి యొందు
ఇంద్రువరమంచు నాత్మల నెంచి ప్రసవ
సమయమౌ దనుకను రతి సలుపు చుంద్రు॥ 180

గీ॥ ఎనుబదియు నాల్గులక్షలై యెసగు జీవ
కోటులందున మానవ కోటి తక్క
జంతువుల రీతిగాక య త్యంతకామ
తంతుౡలై చరియింతుౡ స్వ తంత్ర బుద్ధి॥ 181

గీ॥ ఇందుగొందరు గార్హస్థ్యు లెంతొ దీక్ష
నూని యనృతు కాలంబుల మానినులను
నంటకుండుట బ్రహ్మ చ ర్యం బటంచు
నెంచి నిపుణతగా సంచ రింతురిలను॥ 182

గీ॥ ఆర్య! విశ్వజ్ఞ; మీ యుప న్యాసమునను
నాదుసందియ మెడవాసె నయ్యు; ఋకను
పురుషులకు వీర్యమెట్టుల బొడమెనొక్క
ఇట్టి వివరంబు నాకాన తీయుడార్య॥ 183

## విశ్వజ్ఞుండు వీర్యోత్పత్తి క్రమంబుం దెలుపుట

గీ॥ ఔర; ముని సువ్రతాఖ్య నీ వడిగినట్టి
గోప్యమును మమ్ము నెవ్వారు కోరలేదు
నీవడిగినాడ వందుచే నీకు మాత్ౡ
మేనువాక్రుత్తు దాని నీ విపుడు వినుమ॥ 184

## సృష్టి - మానవుడు - మానవజన్మ

గీ॥ జగతిలో జావు పుట్టువుల్ సకలమైన
ప్రాణికోటి స్వభావమై పరగుక తన
చావునకు పుట్టువయె విత్తు చావువిత్తు
పుట్టువకునై యెసంగును పుత్ర; వినుమ॥

గీ॥ అందుచే బూర్వజన్మము ననియు, బ్రస్తు
తంపు జన్మముననని, యుత్త రంపు జన్మ
మనియు మూడు విధంబులు నైన పుట్టు
వులు గలవటంచు బెద్దలు వలుకుచుంద్రు॥

గీ॥ వసుధ నట్టి జన్మలు గర్మ వశత గలుగు
చుంటయును, గర్మచే గష్ట సుఖము లనుభ
వించు చుండుట యెల్లెడ విధిగ నుండు
గావునను నట్టి కర్మచే గలుగు జన్మ॥

## చాతుర్విధ సృష్టి

క॥ నాలుగు విధముల జన్మము
లీ లోకంబునను గల్గు నీ జన్మలలో
మేలగు సుజ్ఞాన స్థితి
యేలీలం గలిగె దాని నెఱిగింతు వెసన్॥

గీ॥ సుప్రసిద్ధ బాహ్యాభ్యంత ర ప్రకాశ
ములని, బాహ్యప్రకాశక ములని, యంత
ర ప్రకాశకములు, నుభ యప్రకాశ
శూన్యములని వచింతురు సూరిజనులు॥

గీ॥ ఆర్య! యెన్నండు నే విన నట్టి సృష్టి
జెప్పితిరి; దాని వివరంబు జెప్పుడయ్య
నా మనంబున మిగుల నా నందమొందు
వాడ నీ వంశ్యుడైనట్టి వాడనగుట॥

గీ॥ అయ్య! దేవతాళియును ద దంశ బుట్టి
నట్టి ఋషి సంతతియును బా హ్యమున నంత
రమున సుజ్ఞానమున్నవా రగుటచే ద్రి
కాలవేదులు ననునట్టి ఘనత గలిగె॥

గీ॥ మానవుల కంతరజ్ఞాన మహిమలేదు
బాహ్యమున జ్ఞానముండుటం బట్టి వెలిని
జ్ఞానులై మాటచే భావ గమ్యులగుచు
నన్ని వ్యాపారములు సేయు చున్నవారు॥ 192

గీ॥ అంతరజ్ఞానముండె, బ శ్వాదులకును
నందుచే మాటలేకయే యన్ని విధము
లైన వ్యాపారములు సేయు నవనియందు
మనము గనుచుంటి మిది దేవ మర్మమయ్య॥ 193

గీ॥ వృక్ష గుల్మలతాదులు వీనమైన
బాహ్యసుజ్ఞానమేని య భ్యంత రంపు
జ్ఞాన మేమియు లేకయే మేనులంది
పుడమి వృద్ధిక్షయాదులు బొందుచుండు॥ 194

గీ॥ ఎనుబదియు నాల్గు లక్షలై యెసగుప్రాణి
వర్గమున కుంట పుట్టుట పరిణమించు
టయును వృద్ధిగనుట, క్షీణ తయును నాశ
నమును బొందుట వృత్తులౌ క్రమముగాను॥ 195

గీ॥ ఇట్టులను లోకమందున నెసగు జంతు
కోటిలోపలి మానవ కోటి ముఖ్య
మైన దౌటను నదియెట్టు లవతరించె
నో; వినుము దాని వివరము నుచ్చరింతు॥ 196

## మానవోత్పత్తి

గీ॥ అక్షరంబైన తత్త్వము నందు బ్రహ్మ,
మందు గర్మయు, నందున యజ్ఞమున్ను,
నందు బర్జన్యు, డాతని యందు నోష
ధాదు, లందన్న మందు భూ తాళి గలిగె॥ 197

క॥ భూతములలోన మానవ
జాతము సుజ్ఞానమైన సంతతియగుటన్
జే తో మోదంబున నా
భూతేశుని గొలుచు చుంద్రు పుణ్యాత్మకులై॥ 198

క॥ కొందరు సగుణోపాసన
కొందరు నిర్గుణ యుపాస్తి గూర్చియు నతతా
నందులయి యిహ-పరంబుల
నందుచు నుండుదురు నిర్మ లాత్మకు లగుచున్॥ 199

## ఇష్టాపూర్తములు

గీ॥ అయ్యా! మునిసువ్రతా; విను మవనియందు
నిష్టమును బూర్తమునునాగ నెసగునట్టి
కర్మ లొనరించువారికి శర్మదమగు
స్వర్గ మోక్షంబులును గల్గు సత్యముగను॥ 200

గీ॥ తపము సత్యంబు నగ్నిహో త్రంబు వేద
పఠనమును వైశ్వదేవంబు భవ్యమైన
యతిథి పూజనమును నిష్ట మనెడు కర్మ
లిందుచేతను స్వర్గంబు జెందుటబ్బు॥ 201

గీ॥ తోటలును చెరువులును సూ తులును బావు
లమరగేహం ప్రతిష్ట ని త్యాన్నదాన
మాచరించుటయే పూర్త మనగ నొప్పు
నట్టి పూర్తంబె భువిని మో క్షప్రదంబు॥ 202

## అర్చిరాది మార్గము

సీ॥ శమ దమాదిక సత్వ సంపన్నుడై యోగ
విద్యాభిరతుడయి వెలయువాడు
దేవయానంబున ద్రోవలో గమనించి
బ్రహ్మలోకమునకు బరగ నరుగు
నెట్టులనిన దేహ మందున వదలియు
నాత్మ ముందుగ నగ్ని ననుగమించి
జ్యోతియు దివలును శుక్ల పక్షంబయి
యుత్తరాయణమున నుద్గమించి॥

గీ॥ వత్సరంబును నాదిత్య వసతి చంద్ర
లోక మవల విద్యుల్లోక మేకమైన
బ్రహ్మలోకముకేగి ది వ్యతను పూని
బ్రహ్మతోగూడి కలియును బ్రహ్మమందు॥ 203

## ధూమాది మార్గము

సీ॥ ఇష్టము బూర్తము లెలమి జేసెడివారు
స్మార్త శ్రౌతాగ్నుల సరణి యముని
నాశ్రయించియు ధూమ మై రాత్రియయ్యును
గృష్ణ పక్షంబయి కేవలంబ
దక్షిణాయన పితృ ధామముల్ గడచియు
జంద్రలోకము జేరి, సరిగ దివ్య
దేహమూనుచు జంద్ర దేవసమానుడై
దివ్యభోగములచే దేజరిల్లి॥

గీ॥ దివ్యదేహంబు తోడను దివ్యసౌఖ్య
ముల ననుభవించు చుందురు పుణ్యశేష
మున్నదనుకను, నచ్చోట నుండి పిదప
దివ్యదేహంబు విడచియు దేజమొప్ప॥ 204

## పునరావృత్తి నిరూపణము

గీ॥ ప్రాణరూపము ధరియించి భద్రమైన
యాకసమునం బ్రవేశించి యందునుండి
గాలిలోపల గలిసియు గాలినుండి
నీరులోపల నిలిచియు నీరునుండి॥

గీ॥ మేఘరూపము ధరియించి మేదినిపయి
వానరూపముగా బడి వానవలన
నోషధాదుల రూపంబు నూని యనియె
యన్నమగుటను దానిని నఖిల జగము॥ 205

క॥ నేరుపుతో సర్వేశ్వరు
డారూఢిగ బ్రాణికోటు లన్నింటికి నా
హారము నిద్రయు మైథున
మారయగ స్వభావసిద్ధ మౌనటు చేసెన్॥ 206

గీ॥ అందు నాహారము బ్రధాన మగుట జీవ
నేచ్ఛ నెల్లపదార్థము లెల్ల ప్రాణి
కోటులు భుజించుచును దృప్తి గొనుచు భూమి
మండలంబున జీవించు చుండుననఘ॥ 207

## గుణానుకూల భుక్తి

గీ॥ ఇటుల జీవించు చున్నట్టి యెల్లప్రాణి
కోటులకు నాధిపత్యంబు గూర్చబడిన
మానవాళి గుణంబులం బట్టి భుక్తి
గొనుచునుందురు సుమ్మ; యో గుణనిధాన॥ 208

గీ॥ ఏమి గుణములు మనుజుల కెటులగలిగె
నట్టి గుణములబట్టి యా హారములను
గొనుచునుండుట యెట్టులో మనమునకును
వింతగా దోచుచుండెను వినుచుమార్య॥ 209

గీ॥ జగతి సాత్వికమును రాజ సంబు దామ
సమును ననుమూడు గుణములు గ్రమముగాను
మూడు గడియలవరకును మొనసి తిరుగు
నందుల బ్రధాన గుణమొక టంటియుండు॥ 210

## సాత్వికాహారములు

గీ॥ ఆయువు బలము సత్వ మ నామయంబు
సుఖము బ్రియమును నభివృద్ధి చూపునవియు
రస్యములు స్నిగ్ధములు మధు రములు హృద్య
ములును స్థిరమైనవియు సాత్వి కులకు బ్రియము॥ 211

## రాజసాహారములు

గీ॥ శోక దుః ఖా మయంబులు జేకురిచెడు
నుప్పు పులుసును జేదుల నొప్పునవియు
కఠినములు విదాహములు దీ క్ష్ణములు మిగుల
వేడివియు రాజసులకును బ్రియము వత్స॥ 212

## తామసాహారములు

గీ॥ తొలుదినంబువి దుర్గంధ ములువి జాము
గడచునవి భుక్తిగొనువారు నిడుచునవియు
రసములేనివియు న పవిత్రమగు నవియు
దామసులకు బ్రియంబగు ధరణి వత్స॥ 213

గీ॥ అన్ని జంతువులకు జఠ రాగ్నిబలము
మిక్కుటంబౌట బచ్చివే మెక్కుచుండు
జనుల కంతటి బలము లే కునికి నగ్ని
బచనమొనరించి తినుటకే ర్పరుప బడియె॥ 214

## ఆహారపదార్ధములు

గీ॥ ఉర్వి నారణ్యకములైన యోషధాదు
వేడు గ్రామ్యంబులైనట్టి వేడు కలిసి
పదియునాలుగు జీవప్ర పంచమునకు
జీవనాధార మగునట్లు దేవుడిచ్చె॥ 215

గీ॥ నమలి కొన్నిటి దవుడల ను మెదపియును
జప్పరించియు నాల్కచే జవిగొనియును
గటగటను ద్రావి పంచ భ క్ష్యములు గాగ
వాడుచుందురు జీవన వాంఛ గలిగి॥ 216

## భోజన నియమము

గీ॥ ఎప్పు డాకలి వేసిన నప్పుడన్న
మెపుడు దాహము గలిగిన నపుడు నీరు
గొనుట యొప్పును; దూపకు గూడు నీరు
నాకటికి గొన్న విపరీత మగు దనువుకు॥ 217

గీ॥ వడుగునకు గ్రాసనియతి యె క్కడను లేదు
ముప్పదియురెండు కబళము లొప్పగేస్తు
కడవిమనికికి బదియారు నష్టకంబు
భుక్తి సన్యాసి గొనుట కొ ప్పును, నియతిగ॥ 218

గీ॥ గరిమ చాంద్రాయణ వ్రత క బలములకు
బార్వణపు బిండములకును బ్రతిదినంబు
గొనెడు గ్రాసాన్నమునకును గుక్కుటాండ
పరిమితిగ నుండవలెనని పలుకుచుంద్రు॥ 219

గీ॥ అన్నమును బప్పు మొదలౌ ప దార్ధములను
సగము గర్భము నిండగా సాపడవలె
నందు నొకపాలు నీరు దా హమును దక్కు
పాలు చోటు విడువవలె వాయుగతికి॥ 220

గీ॥ చేత నీరూని గాయత్రి చేత బ్రోక్ష
ణంబొనర్చియు మరల జ లంబుగొనియు
చుట్టు ద్రిప్పి చల్లియు నీరు వట్టి నోటి
యందు నాపోశనము గొన నగును, పిదప॥ 221

గీ॥ ప్రాణ పంచకమునకును నాహుతులను
నైదుసారెలు త్తమెతుకు లర్పణంబు
జేసి యన్నాదికము భుక్తి జేసి పైని
నుత్తరాపోశనము గొన నొప్పు భుక్తి॥ 222

## సప్తధాతూత్పత్తి

గీ॥ అట్టులను నోషధాదిక మన్నముగను
దినుచు జీవన మొనరింతు రనుదినంబు
నవ్వియెల్ల జఠర గోళ మందుజేరి
జీర్ణమగుచుండు జఠరాగ్ని చేతఁ గాగి॥ 223

గీ॥ పచనమైన పదార్థముల్ బ్రథమమందు
జలము నయ్యును నుఛ్వాస బలిమివలన
నావిరిగ బైకినెగసియు నంత గొంత
రసముగా నిల్చి యద్దియే రక్తమగును॥ 224

గీ॥ అదియె యేడు దినంబుల కగును మాంస
మట్టి మాంసము గ్రమముగా నగును యేడు
దినములకు మేధరూపమై తేజరిల్లు
మాంసమందున నరములు మఱియుగలుగు॥ 225

గీ॥ అట్టిమెద డేడు దివసంబు లైన పిదప
నెమ్ములౌ, నట్టి శల్యంబు లేడునాళ్ల
కగును మూలుగు లేన్నాళ్ల కవును మూల్గు
లందు శుక్లంబు బున్నను చందురువలె॥ 226

గీ॥ దినదినంబును దినియెడి దినుసులెల్ల
జఠర గోళంబుచేత ప చనమునయ్యు
దనరి నలువది తొమ్మిది దినములకును
శుక్లమను పదార్థంబగు సుభగ చరిత॥ 227

గీ॥ అనిన విశ్వజ్ఞుతోడ ని ట్లనియె శిష్యు
డోగురూత్తమ; దేహమం దుద్భవించు
సప్తధాతు ప్రవృద్ధి యే సరణి నుండు
నో; వచింపుమనన్ గురు దేవుడనును॥ 228

గీ॥ నీరు పదిదోయిళులు, నది నిలిచి యుందు
రసము కుంచెడు తవ్వెడు, రక్తమెనిమి
దంజలులును, బురీష మే డంజలులును
నారు శ్లేష్మంబు, పైత్య మై దంజలులును॥ 229

గీ॥ మూత్రమును నాల్గు, కొవ్వును మూడు, మెదడు
రెండు దోయిళులును, మూల్గు లుండు దవ్వె
డందులో సగమగు సోలె డైన వీర్య
ముండు, నద్దియే ప్రాముఖ్య మోయి; కుఱ్ఱ॥ 230

గీ॥ అగ్నియే బలమిచ్చు, దే హములకెల్ల
వీర్యమే యెల్లరకును జీ వితమొసంగు
నందుచేతను సర్వప్ర యత్నములను
నగ్ని వీర్యము కాపాడ నగును తండ్రి॥ 231

గీ॥ అట్టి విధి దెలియుటను మ హాముని లొగి
భక్ష్య భోజ్యాదులను మాని పర్ణ వాయు
భుక్తులను గొంచు నగ్నికి శక్తినిచ్చి
మహిత బలమొందియును సనా మయులునైరి॥ 232

గీ॥ కామముండిన నింద్రియ స్ఖలనమునకు
హేతువగునని యాత్మలో నెంచి విగత
కాములై యింద్రియంబును గట్టిపెట్టి
దీర్ఘ జీవితులై రెంతొ తేజమొప్ప॥ 233

క॥ యుక్తాహార విహార ని
షక్త మనోవృత్తిచే వి షయ సంఘా నా
సక్తిని మెలగెడు వారికి
భుక్తియు ముక్తియును గలుగు బుత్రా; వినుమా॥ 234

## వీర్య ప్రాధాన్యత

గీ॥ వీర్యమే ముఖ్యవస్తు వీ విశ్వమునకు
రంగశా య్యెట్లు సప్తావ రణలనడుమ
నమరినటు దేహ మధ్యము నందు నుండి
పాంచ భౌతికములను గా పాడుచుందు॥ 235

క॥ ధాతువులలోన సప్తమ
ధాతువు వీర్యంబు దక్కు ధాతువు లారీ
ధాతువుతో సరియగునే
ధాతవలెన్ సృష్టిసేయు ధాతువు యిదియే॥ 236

గీ॥ ఇదియె బలకారిణియు, ప్రాణ పదము గాను
మోహముల మూలకందంబు బుత్ర పుత్రి
కాభివృద్ధి యొనర్చు గృ హస్థులకును
వీర్యమున కెద్దిసాటి యీా విశ్వమునను॥ 237

గీ॥ ఒయి! మునిసుపుత్రా; యిప్ప డు విదలకును
బురుషులకు బుష్పవీర్యముల్ బుట్టువిధము
సెప్పితిని, వారలిందుపై జిత్రగతిని
గనయు లీలల వచియింతు గాంక వినుమ॥ 238

క॥ అని వీర్యోత్పత్తి క్రమ
మును మిక్కిలి తేటతెల్ల ముగ జెప్పితి గ్ర
న్నన గర్భోత్పత్యాదిక
మును దెలిపెద వినుమటంచు ముదమున బలుకున్॥ 239

## ద్వ్యక్షరీకందము

క॥ నామేను నీమమున నిను
నోమను, మనమునను నైన నోమను, మును నీ
నామము మోమున నానమి
నేమెూ; మననమను నేమ మీను ముమేశా॥ 240

## నాగబంధము

చ॥ నిను మదిలోన బూనికను
　　నేను సుఖస్థితిగోరి సామజా
నన; వినుతింతు నానుతి గ
　　నంగదవయ్యా; న వేందు శేఖరా;
ఘన పరిబోధి; నీ నగవు
　　గావుత మత్క్రుతు లాదిదేవరా;
యనిజ దురాతిగా; నవ మ
　　హా మహిమప్రథితా; నుతామరా॥



## సగర్భద్రుత విలంబిత కందగీతోత్పలము

ఉ॥ ఓ కరుణాకరా; సరసి
　　జోదర స న్నుత; సద్గుణాఢ్య ద
ర్పాకరణా; మహాగిరి వ
　　రాలయ; గీష్పతి గేయభావ శ
ర్వా; కలి సంహర్తా; సరస
　　వాగ్వర చర్చిత సాభిధాన కా
మ్యా కలితా; మముగ్గరుణ
　　మానక గావుము కామదాయకా

## గర్భద్రుత విలంబితము

ద్రు॥ సరసి జోదర సన్నుత సద్గుణా
గిరివరాలయ; గీష్పతి గేయభా
సరస వాగ్వర చర్చిత సాభిధా
కరుణ మానక గావుము కామదా॥ 243

## గర్భకందము

క॥ కరుణాకరా; సరసి జో
దర సన్నుత; సద్గుణాఢ్య; దర్పాకరణా
కరిసంహరా, సరస వా
గ్వర చర్చిత సాభిధాన కామ్యాకలితా॥ 244

## గర్భగీతము

గీ॥ సరసి జోదర సన్నుత; సద్గుణాఢ్య;
గిరివరాలయ; గీష్పతి గేయభావ
సరసవాగ్వర చర్చిత సాభిధాన
కరుణమానక గావుము కామదాయ॥ 245

గద్య : ఇది – ప్రౌఢసరస్వతి - స్మార్తసింహ - సూత్నమస్కరి చేవూరి వేంకట సోమసుందరశాస్త్రి విరచిత మానవ జన్మ అను జ్ఞానదీపంబున ప్రథమోల్లాసము.

ఓం తత్సత్ శ్రీ మత్పర బ్రహ్మార్పణమస్తుశ్రీ

ప్రౌఢ సరస్వతి గ్రంథమాల మేనేజరు
పంచవృత్తుల పురోహితులు
కవికుమార్ **చేవూరి భానుమూర్త్యాచార్య (శ్రీమూర్తి)**
బుక్కావీధి, విజయనగరం-2.

—०००—

ద్వితీయోల్లాస ప్రారంభము

# దాంపత్యధర్మము

గీ॥ బాలకా; వినుమయ్య; దం పతుల కూట
మెపుడు కలుగునో సంతాన మెటుల బట్టి
వృద్ధియై జననమొందెడు విధము తేట
తెల్లముగా జెప్పెదను నీకు దెలియనటుల॥ 1

క॥ ఋతువు పదియారు ది వసము
లతివలు రతికేళి భర్త నంటక యున్నన్
బతితలయి నిరయమొందుచు
బ్రతి జన్మము విధవలగుచు బ్రతుకుదురవనిన్॥ 2

గీ॥ అట్టులనె ఋతుకాలము నందు భర్త
సతుల బొందక యున్నను జగతి యందు
భ్రూణహత్యా మహాఘంబు బొందుచుండు
ననుచు బలికెడు ధర్మంబు లరసికొనుచు॥ 3

క॥ ఒకరొకరు నెడము సేయక
బ్రకటితమగు చక్రవాక పక్షులవలె బొం
దిక గువ్వలవలె గడు మ
చ్చికతో మెలగం గవలయు జిత్తము లలరన్॥ 4

గీ॥ నాతి మూన్నాళ్ల తుది ఋతు స్నాతయై వి
భీతయై వస్త్ర కంచు కో పేతయై సు
పూతయై మన్మథోద్రేక జాతయగుచు
రాతిరిని గేళికా మంది రంజు సేర॥ 5

గీ॥ ఎంతలోవచ్చు మారుని దంతి పూల
బంతి సొగసుల దొంతి మా కాంతయనుచు
కంతుబారిని బడియున్న కాంతు డంత
సంతసంబున జెంతకు నింతి దిగిచి॥ 6

గీ॥ ఉభయులును ఫలహారము లొప్పగదిని
పాలుద్రావియు నంతటి బాన్పుపైని
జేరి కప్పూర విడియముల్ జేసి సెంట్లు
రాసికొని కూరుచుండ జి త్రగతి నంత॥ 7

గీ॥ మోహమగ్గల మగుటను దేహములను
బులక రంకుర మందగా జలదరించు
నవసరంబున బంచాస్త్ర డంబకముల
దొంతరగవేయసాగు హృ దంతరముల॥ 8

గీ॥ అంత నిరువురు మనముల నంతకంత
కెంతొ వింతగ మోహము లెచ్చుచుండ
మదన కదనమునకుఁ నిదె యదననుచును
బొదలువేడ్కను గోరిక లుదయ మంద॥ 9

ఉ॥ మోమును మో మునుంగనుచు
ముద్దులు గొంచు గళాప్రదేశముల్
వేమరు ప్రేమనంటుచు ద్ర
వింపగ జేయుచు రోమహర్షణ
గ్రామమెసంగ దంత నఖ
రక్షతముల్ ప్రచురించుచున్ మహో
ద్దా మగతిన్ మనోభవ క
థల్పొచి యించుచు నేక చిత్తులై॥ 10

ఉ॥ కన్నుల తేటలన్ స్మిత వి
కాసముఖంబుల బంచకృత్య సం
పన్నత ప్రీతియుక్కల ర
వస్వన భాషల నూత్ననూత్న సం
ఛన్న విసర్జన త్రపల
సౌహృదభావము లుప్పతిల్లనె
న్నెన్నొ విలాస సంపదల
నెంతయు గాముని రాజ్య మేలుచున్॥ 11

## దుస్సంతాన సూచన

సీ॥ ప్రీడాభరంబున గ్రీడించునప్పుడు
కనులు మూసిన గ్రుడ్డి కాన్పు గలుగు
రతివేగమునను దం పతు లలసటనొంద
రోగిష్టి కూనలు రూఢి గలుగు

జౌ శీతి బంధన సమితితో గవగూడ
నతి దీర్ఘ హ్రాస్వసం తతి లభించు
వికల మనస్కులై వెలయ బధిరకుబ్జ
ఖంజాంధ వికృతులు గలప్రసూతి॥

గీ॥ బడలికలుజెంది కవయుచో జడులు గలుగు
గోపమున మాటలాడక గూడిరేని
మూగ సంతాన మబ్బును ముఖ్యముగను
ననుచు వెలిసియు దంపతు లట్టియెడను॥ 12

గీ॥ కనులు మూయక నలసట గ్రందనీక
బంధనాదుల గ్రుంగక బడలకయును
వికల చిత్తులు గాకను వివిధ గతుల
బెనగుచును గాముకేళిలో మునిగియుండ॥ 13

గీ॥ స్వాతివానకు శుక్తి యే సరణి వికస
నెంబగుచు నబ్దినుండునో నయముగాను
ఋతుమతుల గర్భగోళమం దతులడుగు జ
రాయు కోశము వికసనం బయ్యునుండు॥ 14

గీ॥ మహిత సర్వేంద్రి యములకు మనసు కర్త
యట్టి మనమున నే యూహ బుట్టునెడను
వాయువర్గము దాని స హాయ మయ్యు
నింద్రియంబుల జేయించు నెల్లపనుల॥ 15

గీ॥ దేహ ధర్మంబు గావున దీవ్రమైన
వేడిమిని లోన నున్నట్టి వీర్యమపుడు
గొబ్బునను వెడలి ఫిరంగి గుండు మాడ్కి
నారి గర్భంబు లోపల జేరుకొనిన॥ 16

గీ॥ అంతట జరాయు కోశము నల్ల నల్ల
ముకుళితంబయి యెప్పను మొగడవలెను
లోన జేరిన రెండును లీనమయ్యు
నుండు నొకచోట రవిచంద్రు లుండురీతి॥ 17

## జరాయు ప్రాధాన్యత

ఉ॥ అట్టి జరాయు కోశమను
నట్టిది స్త్రీలకు గర్భమందునన్
బుటకయున్నచో ఋతువు
బొంది మనోహరుతోడ గూడినన్
బుట్టరు బిడ్డ లద్ది మును
బుట్టి వికాసతనొంది యున్నచో
బుట్టెద రందు డింభకులు
బూర్వస మార్జిత కర్మబద్ధులై॥ 18

ఆ॥గీ॥ అందుచే జరాయు వనునది ఋతువున
బుట్టి యుండవలెను పుట్టకున్న
యట్టి ఋతువులెల్ల వ్యర్థమై సంతతి
గలుగ దిదియ దీని కారణంబు॥ 19

## శుక్లశోణిత జీవనిర్ధారణము

గీ॥ ఆర్య; శుక్ల శోణితములు ననెడు రెండు
ద్రవ పదార్థము లేకద తద్ద్రవములు
జీవయుతములో లేక నిర్జీవకములో
సందియము దీర్పుడని న వి శ్వజ్ఞు డనును॥ 20

గీ॥ పంచకోశంబులందున బ్రథమకోశ
మై తగిన యన్నకోశంబు నందు బ్రాణ
కోశ మందు మనోమయ కోశమొప్పు
నందు విజ్ఞాన మందు నా నందమయము॥ 21

గీ॥ అనటి కాండమునను బొర లమరియుండు
నట్టు లానందమయ కోశ మనెడుదాని
నల్లిపై బైని జక్కగా నావరించి
యన్నమయ కోశమగు దేహ మమరియుండు॥ 22

గీ॥ మహిత; యన్నమయా దన్న మయ మనుగతి
స్నాయు మజ్జా త్వగస్తి మాం సరుధిరములు
నాగ షట్కోశ సమితిచే నాగుదేహ
మన్నమయ కోశమగు జుమ్ము కన్నతండ్రి॥ 23

గీ॥ అట్టి షట్కోశ సారమై యంతరమున
శుక్ల శోణిత రూపమై చూలు నిలిచి
జంతురూపము వహియించి జంగమంపు
దనువునై వృద్ధిగనుచుండు దండ్రి; యదియ॥ 24

క॥ వినుమయ్య; పూర్వము జగ
జ్జనకుడు చైతన్యమేవ చైతన్యాత్తం
చని యిటు శ్రుతిమూలం బున
వినుచుటచే నట్టిపలుకు వితథంబగునే॥ 25

క॥ కావున నారెండును దగ
జీవ పదార్థంబు లగుట చే మెలమెల్లన్
జేవ గలిగి యభి వృద్ధిం
గావింపబడును స్త్రీల గర్భము లందున్॥ 26

## స్త్రీ పుంసక లింగోత్పత్తి

గీ॥ పురుషవీర్య మధికమైన బురుష జన్మ
స్త్రీ రుధిరమెచ్చు కలిసిన స్త్రీ ప్రసూతి
రెండు సమముగ నుండు చో షండ జన్మ
కలుగునని పెద్దలందురు కన్నతండ్రి॥ 27

## యుగళ జనన కారణము

గీ॥ ఇంక మఱియొక్క వింతను నెఱుగుమయ్య;
వాయువిహృతిని వీర్యము ద్వైధ మగుట
గవలవాండ్రు జనింతు రీ యువనియందు
నింక ఋతు దినోత్పత్తినే నెఱుగజేతు॥ 28

## ఋతుదినోత్పన్న స్త్రీ పురుష ధర్మములు

గీ॥ ఋతువు పదియారు దివసంబు లతివలకును
నందు మూడు దినంబులు బొందరాదు
సమదినంబుల బుత్రు డ సమదినముల
బుత్రికయు గల్గుచుండును భూ స్థలమున॥ 29

గీ ఎవ్వరైన గర్భాధాన మెట్టి ఋక్ష
మందు జరిగింతురో దాని కవల దొమ్మి
ది పది పదిరెండు భముల నె ద్విభమొ యందు
శిశువు జనియించుననె తెలి సి కవయదగు 30

## చతుర్ద దినాద్యుత్పన్న స్త్రీ పురుష గుణములు

గీ॥ నాలవ దినంబు గూటము నను గుపుత్రు
డన్యనారీ రతుండు వి ద్యావిహీను
డల్పజివితుడును దరి ద్రాన్వితుండు
నై వ్రతభ్రష్టు డుదయించు నందు౹ వత్స॥ 31

గీ॥ ఐదవది నంబు గలయిక యందు యువతి
బహుళ సంతానవతి యయి ప్రబలుచుండు,
నారవదినంబు సత్పుత్రు డవతరించు,
నేడవదినంబు వంధ్యయై యిల జనించు॥ 32

గీ॥ ఎనిమిదవనాటి పుత్రకు డీశ్వరాంశ
బుట్టి యైశ్వర్యవంతుడై పొలుపుగాంచు,
దొమ్మిదవ నాటి కూటమిం దోచుకన్య
యతుల సౌభాగ్యవతియగు నందు రయ్య॥ 33

గీ॥ పదియవదినంబు రతియందు బ్రభవమొందు
నతడు శ్రేష్ఠుండు నాచార యుతుడు నౌను,
పదునొకంటను బుట్టిన సుదతి సుంద
రాంగియును ధర్మహీనయా నందు రార్య॥ 34

గీ॥ పదియు రెండవనాటి య ర్భకుడు దీర్ఘ
జీవితుం డుత్తముండయి చెలగును, పదు
మూడవదినంబు కలయికన్ బొడమిన చెలి
జారిణియు జాతి సంకర కారిణియగు॥ 35

క॥ పదునాలవ దివసంబున
నుదయించినవాడు ధర్మ యుతుడు గృతజ్ఞుం
డుదితజ్ఞాని దృఢవ్రతు
డు దయాయుతుడు గుణవంతు డున్ బ్రభువునగున్॥ 36

క॥ పదియేనవ దినమందలి
సుదతి సతీమణియు, రాజ్ఞి సుచరిత, భోగా
స్పదయును, బుత్రవతియునై
యుదయించునటంద్రడు విబుధు, లుత్తమ చరితా॥ 37

గీ॥ పదియు నారవదినమందు బ్రభనమొందు
నతడు సత్యవ్రతుండు స ర్వాశ్రయుండు,
బందితుడు, జ్ఞాని, విజితేంద్రి యుండు, భాగ్య
వంతుడును, జక్రవర్తియై ప్రబలు నంద్రడు॥ 38

గీ॥ అందుచే సమదినముల యందు మంచి
వరసి కవగూడ సత్పుత్రు నందవచ్చు
న సమ దినముల శస్తము లరసి కూడి
మంచి కన్యకం గనవచ్చును మాన్య చరిత॥ 39

## స్త్రీ వాంఛాను రూపసంతాన ప్రాప్తి

గీ॥ స్నాతయగు నారి యెవ్వాని బ్రీతిగనునొ
తత్స్వరూపము గలుగు సం తాన మబ్బు,
నందుచే దన భర్తనే యరయ వలయు
ననుచు బెద్దలు సెప్పుదు రనఘ చరిత॥ 40

గీ॥ ఇంత మఱియొక్క సంగతి నిపుడు వినుము
బిందు పతనంబు సమయము నందు నెవని
బ్రేమ దలపోయునో యట్టి రీతి గలుగి
యున్న సంతాన మేర్పడు గన్నతంద్రడి॥ 41

గీ॥ ఆతివ ఋతుకాలమున రాత్రి బతిని గలిసి
వేకువను మేలుకాంచియు వేడ్క దొలుత
నెవని మొగమును గాంచునో తవిలి యట్టి
రూపు కలవాని బ్రసవించు రూఢిగాను॥ 42

గీ॥ అలయందున గోడీల యందు మంచి
గొప్ప సంతాన మొందగా గోరి యెదుట
మంచి యెద్దుల గుఱ్ఱము లుంచి చూపి
యట్టి సంతతి గలిగింతు రనగ వినమె॥ 43

గీ॥ సుందరంబగు సంతాన మందగోరి
కాదె; కేళీగృహంబుల ఘనతరముగ
వ్రాయు తస్వీళ్లు ఫోటోలు రమ్యముగను
నలుదెసల నిల్పుచుందురు నాగరికులు॥ 44

గీ॥ ఇట్టి కారణములు యుండ బట్టి కాదె
యొక్క దంపతులందున నుద్భవించు
వారు పలురూప ములు గల వారలగుచు
వెలయు చుండుట కల్గె నీ విశ్వమునను॥ 45

ఆ॥గీ॥ ఇదియె మూలమర్మ మీపైని నారెండు
నెటుల వృద్ధిగాంచ నేరుపడెను
యట్టిరీతి నిప్పు డాద్యంతమును నీకు
వినుచువాడ దాని వినగదయ్య॥ 46

## ప్రథమ దివస శుక్లశోణిత రూపనామము

గీ॥ ప్రథమ దివసంబునను నది దధియు నాజ్య
రసము గలిసిన రీతిగా నెసగియుంట
గలల మను నామధేయంబు గాంచియుండు
నా జరాయు కోశంబున నంతకంత॥ 47

## సప్తమదిన స్వరూప నామములు

గీ॥ అదియె యేడవ నాటికి నల్ల నల్ల
పొంగు పొందులుగా నందు బొలిచియుంట
నట్టిదానికి బద్బుదం బనుచు నందు
గర్భశాస్త్ర విశారదులి గ్రమమెఱింగి॥ 48

## పక్షదిన రూపనామము

గీ॥ అట్టి బుద్బుదమనునది యంత కలిసి
పదియు నేనగు దినముల కది క్రమంబు
గాను కుక్కుటాండము పోలి కగను బిండ
రూపము వహించుగడు నప రూపముగను॥ 49

## ప్రథమ ద్వితీయమాస శిరోత్పత్తి

క॥ ఆ పిండము నెలనాటికి
నేపున కఠినత్వమొంది యెంతయు వింతల్
దోపగ రెండవ నెలలో
జూపట్టును శీర్షమటుల జోద్యం బొప్పన్॥ 56

## గర్భిణీరక్ష

క॥ నెలకడచి యంత రెండవ
నెల ఋతుమతి కాకయున్న నెలతకు గర్భం
బలవడెనని కను జాగ్రత
కలవారయి గర్భరక్ష గావింతురొగిన్॥ 57

సీసమాలిక॥ పుట్టలెక్కుటయును, పుడుకలు ద్రుంపుట,
నగ్నయౌటయు, బైకి నడచుటయును,
జగడ మాడుటయును, బగలు పండుట, రేల
జాగరణంబును, శ్రమము గొనుట,
కొప్పు విరియబోసు కొనుటయు, నుత్తర
శిరముగా బండుట, చెట్ల క్రింది
కేగుట, పండుట, వేగిర పడుటయు,
సంజ యందున దింట. శయ్యనీడ
నుంటయు, బీతును గొంటయు, నేనుగు
గుఱ్ఱము లెక్కుట, గుండె బాదు
కొనుటయు, నేడ్చుట, గొంతు గూర్చుండుట
బూడిద బొగ్గులు బునుక లుముక
దూళుల నుండుట, రోళులం దంపుట,
శూన్యగేహంబుల జొచ్చుటయును,
బూది బొగ్గుల గోళ్ల భూమిని వ్రాయుట,
పాచరౌషధముల ప్రాశనంబు,
దారిలోన జతుష్ప థంబులు నదులును,
బాముల జాడల పై నడచుట;

గీ॥ మొదలుగాగల్గు నవి చూలు మొదలు ప్రసవ
మౌదనుక గర్భవతులకు మాన్పదగిన
వనుచు మాన్పించి రక్షణ మాచరింతు
రర్భకునకు నపాయంబు లంట కున్న॥

## తృతీయమాసకర చరణాద్యుత్పత్తి

గీ॥ అంత మూడవ మాసము నందు గాళ్లు
సేతులు మొలచు నెంతయో చిత్ర గతిని,
నపుడు పుంసవ నము నను నట్టి కర్మ
జనకు డాచరణ మొనర్చు సంతసమున॥ 53

## పుంసవనము

గీ॥ హస్త చిత్త త్రియుత్త రే జ్యాశ్విని మృగ
శతభి షాదితి వసు విధి శ్రవణ మూల
స్వాత్యనూరాధ రేవతులి, భాను జీవ
కుజులు, జయ భద్ర పూర్ణలు నజము మీన
ధనువులు నవమశుద్ధిపుంసు వనమునకగు॥ 54

గీ॥ మఱ్ఱిచెట్టు యుత్తరపు గొమ్మ యిరుపండ్లు
గలది యొకసన్నెకంటిపై గన్యచేత
జతుక గొట్టించి యది క్రొత్త చేలమందు
నునిచి దాని భార్యము క్కునను బిడచి॥ 55

గీ॥ పుంసువన మసియను మంత్ర ముసుబ ఠింప
ను విద గర్భంబు లోపల నున్నయట్టి
పిండము పురుషరూపమై పెంపుచెంద
గలుగు, నీ కర్మమహిమచే గన్నతండ్రి॥ 56

గీ॥ అమల చర్య; పురుషవీర్య మధికమైన
పుత్రజన్మ మటందురు పుంసువనము
నందు మఱ్ఱి పండ్ల రసంబు నతివనాసి
కమున నునిచిన పుత్రుండు గలుగునెట్లు॥ 57

గీ॥ వన్య ఫల పత్ర రసము ల వారితముగ
నశ్యమునను నా రోగ్య మ వశ్యముగను
గలుగు నని చేతు రిద్దియే కారణంబు
నగుట గొందరు జేసెద రయ్యదాని॥ 58

## చతుర్థమాస స్త్రీ పుంనపుంసక లింగోత్పత్తి

గీ॥ నాలుగవ మాసముననుఁ బ్రాణంబుగొంత
గల్గుటను తల్లి కడుపులో గదలుచుండు
బురుషరూపమొ; స్త్రీరూప మో; నపుంస్క
రూపమో; యట్టి లింగముల్ రూఢిగలుగు॥ 59

గీ॥ అప్పుడే తల్లి హృదయము నందు జేరి
రెండు హృదయంబు లొక్కటై యుండుకతన
దౌహృదినియను నామంబు తల్లి కొదవు
నప్పుడొక కొన్ని కోరికలే ముప్పిరిగొను॥ 60

గీ॥ అట్టి కొర్కెలు వేవిళ్లటందు, రవ్వి
దీర్పవలె భర్త, యట్టివి తీర్పకున్న
శిశువునకు వ్యంగతాదులు సేరునుండు
ననుచు బెద్దలు సెప్పుదు, రనఘ చరిత॥ 61

గీ॥ మంచికూర లపూపముల్ మావిపండ్లు
రామఫలములు గమలాఫలములు దాడి
మీ ఫలములు సపోటాలు మీగడలును
బాలు పెరుగులు తినుటకు భ్రాంతులొదవు॥ 62

క॥ ఎవ్వెవ్వి తల్లి కోరిన
నవ్వియె శిశుకాంక్షితంబు లౌగద యని తా
నెవ్విధి నైనను దెచ్చియు
న వ్వనితకు నిచ్చు నాథు డతిప్రియ మొప్పన్॥ 63

## గర్భవ్యంగతాదులు

గీ॥ అటుల జూలాలి కోరిక కను గుణముగ
చూడిదలు నివ్వరేని యా చూలునందు
వికృతు లెన్నేని కల్గి జీవితము జెరచు
గాన తప్పక చూడిదల్ గడప నగును॥ 64

ఆ॥గీ॥ వికృతు లెవ్వియనిన విగ్రత బధిరత
గుప్పి చొట్ట మూగ గ్రుడ్డితనము
వికలదృష్టి లాల విజ్ఞత యనునవి
శిశువు జన్మమందు జేరియుండు॥ 65

## గర్భచిహ్నాలు

క॥ ఎప్పుడు మాతాహారము
దప్పక శిశువునకు జీవి తంబయ్యెడినో
అప్పటి నుండి కృశత్వము
జొప్పలవడు దజ్జననికి జోద్యం బొప్పన్॥ 66

గీ॥ ఒక్క కృశతయె కాకను యోకిలింత
లొడలు భారంబు దడబడు జడిమనడక
యరుచి బడలిక పాండిమ మలసటయును
నిద్దురయు బద్ధకంబును నెలత కొదవు॥ 67

## అంగప్రత్యంగోత్పత్తి

గీ॥ అంగకములైన కర చర ణాదికమును
నందుపై నింద్రియాది ప్ర త్యంగకములు
వ్యక్తమై జీవభావాను షక్తమగుట
స్పందమేర్పడు నలునెల యందు గుణ్ణి॥ 68

గీ॥ పురుషుడైనను గుడిప్రక్క గరితయైన
నెడమ ప్రక్కను మెలగెడు నివియు రెండు
గాకను నపుంస్కుడైనచో గడుపు నడుమ
మెలగుచుండుట నిజముగా గలుగు వత్స॥ 69

గీ॥ అంగకములు ప్రత్యంగము లనెడు నివియ
చిన్న చిన్నవిగాగ సూ చింప బడును,
పై నెలల జూలు ముదురుట ప్రబలమగుచు
నంతకంతకు బొదలును వింతగాను॥ 70

## పంచవమాస శిశుస్థితి

గీ॥ ఐదవ నెలను చిత్తంబు నంత బృష్ట
వంశమును మిక్కు టంబుగా వరలి రక్త
మాంసములు వృద్ధి గాంచుటన్ మాతకంత
కంతకును పాండిమము హెచ్చు వింతగాను॥ 71

గీ॥ ఒక్క పాండిమవే కాదు యుబ్బు చనుల
మొనలు నల్లగ నౌ, టారు మొలచుటయును,
నడుమ విరివిగదో చుట నవ్యమైన
గర్భమేర్పడి యొరులకు గానుపించు॥ 72

## షష్ఠమమాస సర్వావయవోత్పత్తి

గీ॥ ఆరవనెలను వెం(డుక లక్షియుగము
ముక్కుచెవు లెమ్ములను నర మ్ములును గోళ్లు
కొప్పు బలమును వర్ణంబు లుప్పతిల్లి
వృద్ధి గనుచుండు (గమముగా వినుము, వత్స॥ 73

## సీమంతము

గీ॥ సు వనమున కేర్పరచినట్టి సుతిథి లగ్న
వార నక్ష(త్రములను స వమ శుద్ధి
గలిగి నాలు గారెనిమిది నెలలలోన
బగర్భవతికి శ్రీమంతపు గర్మ యొప్పు॥ 74

గీ॥ ఆలు తొలుచూలు నందున నారవనెల
బురుష ఋక్షముల్ శుభతిథుల్ పుష్యమినిని
దంపతులు స్నాతలై భార్య దక్షిణ నిడి
రక్షలు ధరించి యగ్నిహో(త్రంబు నిలిపి
యభ్యుదయకము బుణ్యాహ మాచరించి॥ 75

గీ॥ అంకురములు (బధానాంగ మందునునిచి
గాణలను వీణె వాయింప గా నొనర్చి
సంస్కరించెద రిద్దియే సర్వగర్భ
సంస్కృతిగ గూర్తురు, సుఖ(ప సవ మగుటకు॥ 76

గీ॥ భావనాతీత; మణి యేదు బందిముల్లు
మేడికొమ్మయ వాంకురాల్ మెలపి నాభి
మొదలు బాపిటవరకును బొదలజేతు
రిందుచే సుఖ (ప్రసవము యెటులగలుగు॥ 77

గీ॥ (ప్రసవ సమయంబు నందుగ ర్భ ముకులేప
నములు మూలికలను గట్ట నగు (ప్రసూతి,
యనిన శ్రీమంతమన శుభ మనుట కొప్పు
నందున శుభ(ప్రదంబని యం(దు వత్స॥ 78

## శిశు జనకుని నియమములు

సీ॥ కొండ లెక్కుటయును గొమరుని చౌళంబు
దూరమేగుటయును క్షౌరకర్మ
స్తంభ ప్రతిష్టయు దానము ల్వెట్టుట
సాగరస్నానంబు శవముమోత
శ్రాద్ధాన్నమును, గయా శ్రాద్ధంబు దిలహోమ
మితర దేశంబుల కేగుటయును
జెట్టు గొట్టుట పెండ్లి చేయుట గృహమును
గట్టుట కాంతతో గవయుటయును॥

గీ॥ నా దిగాగల కార్యంబు లాలు కారు
నెలలు చూల్మించి బిడ్డం గ నెడు వరకును
జరుపదగ దెట్టి వారలు జగతియందు,
ననుచు బెద్దలు సెప్పుదు రనఘ చరిత॥ 79

## సప్తమమాస సంపూర్ణ జీవత్వము

గీ॥ ఏడవనెల నవ యవము లెన్నియెన్ని
దేహమున నుండవలయునో దీప్యమాన
మగుచు సంపూర్ణ దేహుడు నగుచు బూర్ణ
జీవుడై వృద్ధిగాంచును చిట్టికన్న॥ 80

## గర్భస్థితి

గీ॥ రెండు మోకాళ్ల సందున రెండుకరము
లిమిడిచియు నరచేతుల నెసగరెండు
చెవులు మూసుక యుండును చేష్ట దక్కి
గర్భవాస భయంబుచే నర్భకుండు॥ 81

## శిశువు జ్ఞానోత్పత్తిచే గర్భదుఃఖముతో స్మరించుట

గీ॥ అపుడు జ్ఞానంబుగలిగియు నంటియున్న
గర్భదుఃఖంబు బొందుచు దుర్భరమగు
నిట్టి కష్టంబు గలిగెనా కట్ట యనుచు
జాలశోకించు మిగుల వి షాదియగుచు॥ 82

గీ॥ అయ్యో గర్భమునను జఠ రాగ్నిగ్రా గు
పైత్య వాతాది రసబిందు పరిగణమున
మునిగి దహియింప బడుచుంటి వెనుకకర్మ
వశముచే నిట్టి బాధలు వశమై పొంద॥ 83

గీ॥ అహహ దుర్గంధ భూయిష్ఠ మైన గర్భ
గోళమున ములుబూరుగు బోలు మూతు
లొప్పు పురువుల కాటుల నొప్పు, లమ్మ
ప్రక్కటెముల తాకు రంపముల బోలె॥ 84

గీ॥ ఏమి చేయుదు జఠరాగ్ని యెంతయో భు
గాల్బు గాలున జురికెడి కష్ట మబ్బ
యోర్వలే నింతకంటెను హెూగ్రమైన
కుంభ పాకజ నిరయమే కొంతమేలు॥ 85

గీ॥ అయ్యయో యిందు నపవిత్ర మైన శ్లేష్మ
రక్తములు మాతృభుక్తాన్న రసము ద్రావి
శుచివిహీనత గ్రిమివలె సుక్కవలసె
గర్భ నరకంబుకన్నను కష్టమున్నె॥ 86

## శిశువు పరాత్పరుని ధ్యానించుట

గీ॥ ఇటు పురాకృత కర్మచే నెనయు గర్భ
యాతనలను స్మరింపుచు నంత జ్ఞాన
మానసుండయి పరమాత్మ మనమునందు
నూని మోక్షాభి లషితుడై యొప్పుచుండు॥ 87

గీ॥ సకల భువనప్ర చయమును స్థావరములు
జంగమము లాంతరిక్షక సముదయంబు
దేవతాళుల సృజియించి తేజమొప్ప
వెలయు విశ్వకరుని నాత్మ నిలుపుకొనుచు॥ 88

గీ॥ పశుపతియు విష్ణువును బ్రజా పతియు నింద్రు
డర్యముడు నను వారల నైదుగురను
సృజన మొనరించి వారిని సృష్టి పుష్టి
లయ వివర్ధన సాక్షికు లటు లొనర్చి॥ 89

గీ॥ సూత్రధారుడు బొమ్మ లే చోద్యముగను
నాటలాడిం చుచుండునో యటులనెల్ల
జీవరాసుల నాడించు దేవుడైన
వేద వేద్యుని భక్తి శే వించువాడ॥ 90

గీ॥ పూర్వ జన్మమునందు నా పూజ్యునే ను
నమ్మి స్మరియింపమని యిటు లమ్మ పొట్ట
లోన బుట్టగవలసె నీ పైని నాకు
జన్మరాహిత్యమొనరించు సత్యమూర్తి॥ 91

## అష్టమమాస ఓజోత్పత్తి

గీ॥ అనుచు ధ్యానించు నట నిశ్చ యాత్ముడగుచు
నంతటను నెన్మిదవమాస మనుసరింప
జర్మమును వినికిరియు బ చ్చన యెరుపును
గలుగురక్తము శుభ్రము గాజెలంగు॥ 92

గీ॥ అంత నోజస్సనెడు తేజ మతిని హృదయ
మందు జనియించి మాతృహృ దంతరమున
కరుగుచును నస్థిరంబైన దగుటవలన
నపుడు జనియించువాడు స య్యనను క్రమందు॥ 93

## నవమ మాసము

గీ॥ ఎనిమిదవ మాసము నతిక్ర మించి తొమ్మి
దవనెలను నొక్కదినమైన దవిలెనేని
శిశువు గర్భమందో జస్సు స్థిరపడుటను
నపుడు బుట్టిన ప్రాణ భ యంబురాదు॥ 94

గీ॥ తొమ్మిదవ మాసమున శ్రమ దోగియున్న
వానివలె నిశ్చేష్టితు డైనెగడియు
బడలి యుండెడు నప్పుడు ప్రసవ సమయ
మగుట ప్రసవేదన తల్లి కపుడు కలుగు॥ 95

ఆ॥గీ॥ తల్లి రక్తనాడి తనకాశ్రయంబుగా
తల్లి కొనిన భుక్తి తనకు భుక్తి
గాగ గొనుచు మఱల గదలుచునుండుట
కొంతవడికి మిగుల వింతగాను॥ 96

గీ॥ ప్రాణవాయు సమంబౌ య పానవాయు
వొండు కటి నాభి జంఘ జా నూరు కంఠ
వంక్ష ణోపస్థ గుదముల వరలు కతన
దాని పంచలనమున బా ధలు ఘటించు॥ 97

## తన్మాత్ర గర్భవేదన

గీ॥ నడుము నిలువమి పోటును నొడలునులుపు
కాళ్లుపీకుట మందత కడుపు నొప్పి
బొడ్డుకాటును మల మూత్ర ములకువేధ
మొదలుగా గల బాధలు మూడు కతన॥ 98

శా॥ అమ్మో ప్రక్కలలోన నొప్పు లొదవెన్
హా; నాభివే ధించె న
మ్మమ్మో గర్భము కుట్టులయ్యె, నడుమా
హానిల్వదే మందు బల్
జుమ్మల్ గ్రమ్మెడు నే మిచేయు దికనే
చొప్పున్ భరింపంగలేన్
జుమ్మా నన్నెటు లుద్ధరించెదరొ యం
చున్ దల్లి సుక్కున్నెవసన్॥ 99

ఉ॥ ఎంతని యోర్తునమ్మ: యిటు
లెన్నడె ఱుంగ గదమ్మ నాయెడన్
బంతము సెల్ల దా; యికను
పట్టును వీడగదమ్మ: నీ మది
సంతసమంద జీరలును
జక్కని కానుక లిత్తునమ్మ: యో
మంతర సానిరో: ప్రసవ
మార్గము సూపగదమ్మ: మ్రొక్కెదన్॥ 100

## సుఖప్రసవ సాధనము

గీ॥ అనెడు చూలాలి వేదన నారసియు సు
ఖప్రసవ యంత్రములు రక్ష గట్టి, గ్రహణ
పుంగరము లనీళ్లు వి భూతి బొట్టును నిడి
మూలికల గొన్నిటిని గర్భ మునను గట్టు॥ 101

గీ॥ ఇట్టి సమయంబు నందున దిట్టమైన
శల్య పంజరమును వీడి సరగ బొత్తి
కడుపునకు జేరి, మెదడు ర క్తములగ్రాడి
మావిసంచి శరీరంబు నావరింప॥ 102

గీ॥ అంతట బ్రసూతివాయువుల్ దొంతరగను
లోనిశిశువు నభిముఖము గా నొనర్చు
నంతలో డింభకుడు రెండు హస్తములను
శిరముపై ముకుళించియు జిత్ర గతిని॥ 103

## శిశు జననము

గీ॥ బాణ మెంతటి వేగము బర్వుచుండు
గరుడుడెంతటి శీఘ్రము నరుగుదెంచు
నేపున దుపాకియందు గుం డెటుల బారు
నట్టుల నధోముఖంబుగా నపుడు వెడలు॥ 104

## మాయావ్యాప్తిచే శిశు రోదనము

గీ॥ గర్భమున నున్న జ్ఞానంబు గడచిపోయి
కావు కావుననేడ్చు చ జ్ఞానియయ్యు
నుండుచో వెల్లకిలగను బండవైచి
పురుషుడో స్త్రీయొ యను తలం పున గనుదురు॥ 105

గీ॥ అనినవిని ముని సువ్రతు డ నియె నిట్టి
లో మహాత్మః విశ్వజ్ఞ యీ యుర్వియందు
శ్రీ పరాత్పరుచేత సృ జింపబడిన
చెవులగలయట్టి జంతువుల్ జిత్రగతినీ॥ 106

గీ॥ ఆలు దుంతలు బిల్లులు నడవి మృగము
లెల్లను జరా యుజము లయ్యు దల్లికడుపు
వెడలినంతనె వాటిప్రవృత్తి భాష
లొక్కటను విస్తరిల్లును చక్కగాను॥ 107

గీ॥ మానవుల కట్టితెల్వి యే మైనలేక
శైశవ ప్రాయమెల్లను జరుగ మెల్ల
మెల్లగను జ్ఞానవంతులై రెల్లెడలను
యేమిటో కారణం బాన తీయు డార్య॥ 108

## విశ్వజ్ఞుండు మాయామృత్తాంతముందెలుపుట

గీ॥ ఓయి మునిసువ్రతాఖ్య; యీ యాకరగొను
మౌని బృందంబునందున మంచి గడుసు
వాడవౌటను యిటువంటి ప్రశ్న చేసి
నాడవు బలే; వచించెద నాన్న: వినుమ॥ 109

గీ॥ ఆది కాలమునందు ఒం చాన నునిద్వి
తీయ పుత్రుండు సత్వాద్య మేయ గుణుడు
సర్వభూత హితుండు ని శ్చలతపో మ
హిమ గలట్టి మహాత్మ్మ డ సముడు మయుడు॥ 110

సీ॥ వియదాది భూత ప్ర చయ సర్జనక్రియా
శయ విశ్వకర్తృ త నయుడు మయుడు
నియత మనోగ తా ద్వయ భావ పర్యస్థ
భయ శోకమోహ ప్ర చయుడు మయుడు
క్రియమాణ విష్ట పో చ్చయ చిత్ర దర్శన
స్మయమాన దేవ ప్ర చయుడు మయుడు
సు యశో విభా సము చ్చయ భిన్న లోక త్రి
తయ సత్కళా సమా శ్రయుడు మయుడు॥

గీ॥ సంగ తేంద్రియ వాంఛా ప్ర చయుడు మయుడు
సాధుమానిత సద్గుణా శయుడు మయుడు
చక్రి సంజాత ముఖ కుశే శయుడు మయుడు
అబ్ద పుష్కలనామక హయుడు మయుడు॥ 111

ఆ॥గీ॥ అట్టి మయుడు వింధ్యా కారణ్యమందున
సృష్టి గూర్చి తపము సేయుచుండి
యాహ్నికాది విధుల నా చరించుటకయి
వేకు వందు లేచి వెడలి యంత॥ 112

క॥ అచ్చటికి సమీపంబున
నచ్చపు యుదకంబుచేత న లరియు బులుగుల్
మచ్చెంబులున్న సరసికి
విచ్చేసె జలావగాహ విధి సలుపంగన్॥ 113

మానవుడు - సృష్టి - మానవజన్మ

గీ॥ కాళ్లు చేతులు ముందుగా కడిగి కొనుచు
నాచమించియు సంకల్ప మాచరించి
దంతధావన జేసి వ స్త్రపరిశుద్ధి
జేసి కొనుచును స్నానంబు జేసి యంత॥

గీ॥ తళిమమున లేచినంతనే చుళికెడంత
జలము ద్రావ ద్రిదోషముల్ దొలగి సౌఖ్య
మబ్బునని శాస్త్రమందుంట నాచమనము
జేయుదురు కర్మనిష్ఠులు చిట్టికన్న॥

గీ॥ ఆయువు బలము వర్చస్సు యశము స్త్రీలు
పశువులును మేధ వసువులు బ్రహ్మబుద్ధి
నిమ్మనుచు నష్టు దంత కా ష్టమ్ము వేడి
పండ్లు తోమెద రవ్వి శు భ్రమగునటుల॥

గీ॥ మారడియు కానుగయు నపా మార్గమును ను
దుంబరము కుటజమును క దంబ నింబ
ములును మేడియు జింత వే మును వెదురును
నంకుడును దంతధావన కగును పుత్ర॥

గీ॥ సంధ్య వార్చియు స్వస్తికా సనము దీర్చి
కొంతవడి నాపరాత్పరు స్వాంతమందు
ధ్యానమొనరించి సృష్టిత త్పరత నిట్టు
లొక్క యూహను నూహించె నుల్లమందు॥

గీ॥ నా సహోదరు డుదరము నంగలట్టి
వీర్యముల జంతురూపముల్ వేరుపఱచు,
గర్భగోళము నందున గలుగు తెలివి
మార్చెదను నేను నా తపో మహిమననుచు॥

## మాయమా జననము

గీ॥ బూనికంగొని యొక కన్య పుట్టుగాక
యనుచు దలచిన దక్షుఐ మందునొక్క
బాలికామణి వేగ ను ద్భవము నొంద
నామె గనుగొని వాత్సల్య మావహింప॥

గీ॥ ఆ చిరుత మయసృష్టి చే నవతరించు
కారణంబున నొగి నామ కరణ మపుడు
మాయ యనిచేయ నెల్లరు మాయ యనుచు
బిలుచుచుందురు మిక్కలి ప్రేమతోడ॥ 121

## మాయా సౌందర్యాభివర్ణనము

క॥ చిన్నారి నడలు వాలుం
గన్నులచూపులును ముద్దు గారెడు పలుకుల్
వెన్నెలను బోలు నగవులు
వన్నెలగులుకుచును మాయ వర్ధిలుచుండెన్॥ 122

గీ॥ నవ్యగుణమాలిని దిన ది న ప్రవర్ధ
మానయై నగజాతోప మానయై కు
లీనయై గాత్ర మధ్యమ లీనయై న
వోన్మిష ద్యౌవనంబున నొప్పుచుండె॥ 123

క॥ శ్రీలా కర్ణంబులు మగ
రాలా దంతములు బొంగ రాలాచనులే
ణాలా చూడ్కులు తేనియ
జాలా యధరోష్ఠ మంబు జాలాపదముల్॥ 124

గీ॥ పవడములె గుల్ఫములు శుక్తి భవములైన
ముత్తెములె గోరులును వజ్ర ములె రదములు
గెంపువాతెఱ యింద్రనీ లంపు గురులు
పొన్నుమైగల రతనంపు బొమ్మ యీమె॥ 125

గీ॥ వనజముఖి కైరవాక్షి శైవారచికుర
కంబుగళ విద్రుమోష్ఠి చ క్రకుచ పులిన
జఘన కమఠప ద్భ్రమ నాభ చారుమకర
జంఘ యగు సరసిని బోలె సాధ్వీమాయ॥ 126

గీ॥ మంజులాలాప ముఖము ప ద్మంబుసేయు
కం జనయనాగళంబు శం ఖంబుసేయు
శోణితాధర జఘనంబు క్షోణి సేయు
ముద్దుగుమ్మ తనూలత భూరిసేయు॥ 127

గీ॥ అంత సంపూర్ణ యౌవన యై మనోజ్ఞ
వేషియై మంజులామృత భాషియై స
భూషియై శ్రీజగన్మయు పోషియై సు
తోషియై సుంపర వరాభి లాషి యగుచు॥ 128

క॥ ఉవ్విళ్లూరుచు నుండెడి
జవ్వని గని పంచవరుడు సా నలుగల బల్
చివ్వలు రివ్వున రువ్వెను
యవ్వలికిని నురము దూయు నట్టుల వడిగాన్॥ 129

గీ॥ వెలది పంచశరాంబక విద్ధయగుచు
మోహమగ్గలమై నిజ దేహమందు
విస్మృతినిజెంది తెలివొంది వేదురుగొని
తండ్రికిని జెప్పకుండగా దఱల దలచి॥ 130

క॥ అమ్మాయ యాత్మ ననుకొనె
సమ్మతి నను ననుసరించి సఖ్యతనుండన్
బిమ్మరియె యోగ్యుండని నా
నెమ్మదికిని బోధ పడియె నెట్టు లననగన్॥ 131

## మాయువారవేదనచే బ్రహ్మాదుల కడకరుగుట

గీ॥ అతడు మహాత్మ త్వష్టృ సం జాతుడును సు
పూతుడును విశ్వనిర్మాణ హేతుడగుట
నందునేగెదనని యేగి యాత నెదుట
నమ్రముఖియయ్యు సిచ్చితి నచట నిలిచె॥ 132

ఆ॥గీ॥ ఇటుల నిలువ బడిన యింతినిగాంచి ప
ద్మాసనుండు మదిని నబ్బురపడి
ఎవ్వరీమె యిందు నెందుకు వచ్చెనో
కారణంబు దెలియ గా వలయును॥ 133

గీ॥ తరుణి రో, నీవు యెవ్వరి తలిరుబోడి
వేమి నామంబొ యెంటరి నేల యిందు
వచ్చితివొ; నీదు మదినున్న వాంఛయేమొ
దాచకను చెప్పు మిప్పుడు తప్పక యన॥ 134

ఆ॥గీ॥ ఆర్యతిలక; నే మ యబ్రహ్మతనయను
గోలతనముచేత గొరలు దాన
మీదుదరిశనముకు మే కొనివచ్చితి
నాదుకోర్కె దీర్పు న యగుణాఢ్య॥ 135

గీ॥ అ నిననోబాలనే ద్వష్టు నంశవాడ
నేకపత్నివ్రతుండ బ్ర జేశ్వరుండ
నీ యభీష్టము దీర్పగా నేనుబాల
దన్విరో: నీవు విష్ణువు దరి కరుగుము॥ 136

గీ॥ అనెడు చతు రాననుని మాట లాలకించి
విన్ననైయందు గదలియు విష్ణు దఱికి
నేగి యెదుటను నిలిచిన యింతి గాంచి
యాదివిష్ణువు మాయతో ననియె నిటుల॥ 137

క॥ జవ్వని: యెవ్వరి దానవు
యివ్విధి నొంటరిగ నిందునేతెంచితి నీ
కెవ్వరు పెనిమిటి యంతయు
జివ్వన వచియింపు నాదు చెవులు దనియగాన్॥ 138

క॥ అయ్యా మును మున్నుగ నే
నయ్యజుక డకేగి తెలుప నది విని యాతం
డియ్యెడమోసము జేసిన
జయ్యన వచ్చితిని మీదు సముఖంబునకున్॥ 139

క॥ ఏమని తెలుపుదు, నన్నా
కాముండె డతెఱపిలేక గరకు ములుకులన్
నామేను గాడనేయుట
చే మదినిలుపంగలేక సేగిం బడితిన్॥ 140

క॥ గావున నాతాపంబును
బో విడువగజేసి కలిమి ముత్తైదువగా
భావించి యేలుకొను మిదె
నావిన్నప మటులజేయు నలిన దళాక్షా॥ 141

క॥ అని నంతనె శివ శివ యని
తన కరములు రెండుచెవుల దరిజేర్చియునో
వనజాక్షనేత్ర: నీచే
వినగూడని పలుకువింటి వింతగనేడున్॥ 142

క॥ అమ్మా నేనామయు నం
శమ్మున జనియించి తీవు సహజాతవు స
త్యమ్ముగ నిటమును విధి-నీ
నెమ్మది వరియించినందు నే కోడలువున్॥ 143

గీ॥ అందుచే నిన్ను బొంద న సర్హమమ్మ
నీ వుకైలాసమునకేగి భావ జారి
గలియ నీ కోర్కె తీర్చును గాన యందు
నే గుమన విన్ననై యందు నేగి నిలువ॥ 144

గీ॥ కడగి యామెనుజూచి యో కాంచనాంగి
నీవెవరి బిడ్డ వెవ్వరు నీదు భర్త
యిందునొంటరిరా బని యేమి, యంత
తెలియ బలుకుము నాతోడ తెల్లముగను॥ 145

గీ॥ అనెడు శంభునిజూచి యి ట్లని యెమాయ
యనఘ మయుడను వైశ్వక ర్మణుని కూర్మి
కూతురను మాయయనుపేర గొఱలుదాన
తమను దరిశింప వచ్చితి విమల చరిత॥ 146

క॥ మారుడు విరహాంచిత జన
మారుడు వైకుంఠవిభు కు మారుడు ద్రిజగ
చ్ఛూరుడు గడుక్రూరుడు బలు
నారాచంబులను నేసి నను వేధించెన్॥ 147

ఆ॥గీ॥ కమలభవుడు బ్రోవ గా జాలడయ్యెను
కమలనాభు డంత కన్నసాధు
వారిచేతగాదు మారుని మీరగా
మీరు చాలుదు రని చేరి తేను॥ 148

గీ॥ అనిన శంకరు డిట్లను నతివ; మేలు
బేల వలెనుండి భావ గుం భితములైన
పలుకులను వింత వింతగా బలుకుచుంటి
మాయలను బన్ననేర్చిన మాయవౌదు॥ 149

ఆ॥గీ॥ మొదట కొండవాని ముగుద మాయనుజిక్కి
సగమునైతి, మఱియు బాలరని
పట్టితెచ్చి శిరము పైబెట్టు కొంటిని
భిక్షువునకు నాతి ప్రేమయేల॥ 150

గీ॥ అనెడు శంభుని వాక్యంబు లాలకించి
మాయమిక్కిలి చింతిలి చేయునదియు
లేక నిశ్చేష్ట యయ్యు జీ కాకు జెంది
వేడినిట్టూర్పుని గుడించి విన్నబోయె॥ 151

## మాయ నిరాశచే తండ్రికడకు వచ్చుట

క॥ అడు గొక యామడగా దడ
బడనడచుచు నందుగదలి బహుదీనతతో
సడి వచ్చెననుచు నెంచుచు
గడుసిగ్గున మాయ తండ్రి కడకున్వచ్చెన్॥ 152

గీ॥ ఇటుల మిక్కిలి దీనయై యేగుదెంచు
మాయ గనుగొని యప్పుడు మయు డనియెను
కుతురా: మాయ: యీ రీతి గుందియుండు
కారణం బేమియనిన న క్కాంత యనును॥ 153

గీ॥ నాన్న: యేమని తెలుపుదు నాదుజన్మ
వ్యర్ధమయ్యెను మిగుల న నర్ధమయ్యె
మీరు సర్వజ్ఞులగుట చే మీకునేను
వివరమును దెలుప వలయునా వేరుగాను॥ 154

గీ॥ అనెడు కూతుని వాక్యంబు లాలకించి
జ్ఞానదృష్టి యథార్థంబు గనుగొనియును
మనమునందు విచారించి మాయ గూర్చి
మిగుల దయతోడ వగపున దగి యనుకొనె॥ 155

ఆ॥ అయ్యొ: దేహధారు లైనట్టి స్థావర
జంగమంపు ప్రాణి సముదయమున
కాది పురుషు డుంచె నాహారమును నిద్ర
సంగమం బనంగ జ ను ప్రవృత్తి॥ 156

గీ॥ అందుచే నీమె మిగుల గా మాతురయయి
బ్రహ్మ విష్ణు మహేశుల పజ్జకేగ
వారు నాకూతు రిట్టుల వచ్చెననుచు
నాదరింపక నిరసించి రద్ది తగునె॥ 157

క॥ బ్రమ్మయు విష్ణువు శంభుడు
సమ్మదమున నాలగూడి సాంసారికులై
యెమ్మెల నుండిరి యిక పెర
కొమ్మలతో పొందు వారు గూడగలుగుతన్॥ 158

క॥ అనుచు శపియించి మాయను
గనుగొని యిట్లనియె నమ్మ; కడు నీమముచే
కొని తపమొనరింపుమునీ
మనమునగల కోర్కె సఫల మగు నిక్కముగన్॥ 159

## మాయ తపమాచరించుట

క॥ అను తండ్రి వాక్కులను విని
వనికేగియు భుక్తిమాని పాదాంగుష్ఠం
బును నేలమోపి నిశ్చల
తను వేయబ్దములు మాయ తపమున్ సలిపెన్॥ 160

గీ॥ అత్తపోవహ్ని లోకము లన్ని నేర్చ
భీతిగొని దేవతాళి వి ధాత జేర
నతడు హరిజేర వీరెల్ల హరునిజేర
వారలును వీర లొక్కచో జేరి యంత॥ 161

క॥ సురలార; మేము మాయను
వరియింపమి గోపమూని వచ్చిన మయు డం
దఱకును శాపమొసంగెను
తరువాతను మాయ యిట్టి తపమున్ సలిపెన్॥ 162

క॥ గావున మనమెల్లరమును
దేవతలకుదేవు డాది దేవుండు దయా
శేవధియగు పరమాత్ముని
శేవించితిమేని మనల సేగి దొలంగున్॥ 163

క॥ అని నిశ్చయించి వారలు
మనమున ధ్యానింప సర్వ మయుడైన జగ.
జ్జనకుడు ప్రత్యక్షంబై
కనువట్టిన వినుతి సేయగా గడగిరొగిన్॥ 164

## బ్రహ్మాదులు పరాత్పరుని ధ్యానించుట

ఆ॥గీ॥ ఆదిదేవ; నీ మ హత్వము గొనియాడ
వశమె మనమునకును వాక్కునకును
నందరానివాడ వౌచు జగంబుల
కర్తవైన యట్టి ఘనుడ వీవ॥ 165

గీ॥ దేవ; యీ మయపుత్రిక తీవ్రమైన
తపమొనర్చుట లోకముల్ దాపమొందె
నందుచే మాకు సంతాప మావహిల్లె
మాదుపరి తాప మార్చియు మమ్ముబ్రోవు॥ 166

గీ॥ అను త్రిమూర్తుల ప్రార్థన నాలకించి
దేవదేవుండు గరుణా ప్ర దీప్తుడగుచు
దేవతలనెల్ల నోదార్చి దీక్షనున్న
మాయ మేల్కొల్పి నుడి విను మా యనుచును॥ 167

గీ॥ అమ్మరో; మాయ; నీ వివు డాచరించు
చున్న తపముకు మెచ్చితి నన్ను జూడు
నీదుమ ది నున్న కోరిక నెఱుగ జేయు
దేని స ఫలం బొనర్చెద మానకిపుడు॥ 168

గీ॥ అనెడు సర్వేశ్వరుని జూచి యనియె మాయ
లోకములనెల్ల సృజియించు లోకనాథ
నీ కుదెలియని కోరిక నాకు గలదె
సఫల మొనరించుటయె ధర్మ సరణి దేవ॥ 169

క॥ ఓ మాయ; నీకు గలిగిన
కామము దీరుటకు దపము గావించితి నీ
కామ మునొక్కరు దీర్చుట
కేమైనను శక్తిచాల దిమ్మహి లోనన్॥ 170

గీ॥ గావునను నీవు విశ్వాత్మ కరణి దేహ
ధారులై యొప్పచుండెడి తరుణుల గల
యోనులందున నివసించి తేని నీదు
కామముం దీరు నామాట కడపుమటులు॥ 171

## శ్రీ పరాత్పరుననుమతి మాయ ద్రవరూపమున స్త్రీలయోనులం బ్రవేశించుట

క॥ అనెడు పరాత్పరు వాక్యం
బును ద్రోయలేక మాయ బొదలినదేహం
బును వీడియు ద్రవరూపం
బున యువతుల యోనులందు బొందుగనిలిచెన్॥ 172

గీ॥ అంత దేవత లెంతయో సంతసించి
విశ్వకరు చేత కాత్మలో విస్మయపడి
చాలవినుతించి, జోతలు సలిపి వారి
వారి లోకములకు జెలు వార జనిరి॥ 173

గీ॥ అది మొదలు స్త్రీ పురుష కూట మందు గలుగు
కామ సౌఖ్యోన్నతిని మాయ గ్రాలు చుండె
నట్టి మాయ రహస్యాంగ మందునుంట
స్త్రీల మాయల మగవారు సిక్కగలిగె॥ 174

## మాయావ్యాప్తిచే శిశువులకజ్ఞానము వ్యాపించుట

గీ॥ అందుచే మానవతుల గ ర్భాంతరమున
జ్ఞానముండియు జన్మమా ర్గమున వచ్చు
నంతలో మాయ వ్యాప్తమై నందు వలన
గావుమని యే డ్చుచుందుర జ్ఞానులగుచు॥ 175

గీ॥ అయ్యు; మునిసువ్రతాఖ్య; న న్నడిగి నట్టి
ధర్మ సందేహమునకు ను త్తరము నిదియ
యనిన ముదమొంది నా సంది యంబువాసె
నార్య; విశ్వజ్ఞ; శిశు వృద్ధి నానతిండు॥ 176

## నిరోష్ఠ్యకందము

క॥ కరుణాకరు డనుచును నీ
చరణ సరోజాతయుగళి సారెకునెదలో
గురి గాదలచెద నాయం
దరి దగు దయతోడ గాంచ నగు జంద్రధరా॥ 177

## నాగబంధము

చ॥ హరి విధి పూజితా; రిపుజ
యా; జనన స్థితి నాశకారణా;
నిరుపమ సోమధాలి; వర
నీరజపద్మ జితామ లాననా;
పరవశకార; మేరునగ
భాగ ధను, శ్శమనాధి తాపనా;
దురిత మనోతి దూర; ఖల
తూలని ర స్థ; రతీమనోనుగా॥ 178



## స్రగ్విణీ గర్భ భుజంగ ప్రయాతము

వృ॥ హరా నిన్ను గొల్తు న్మ హానీ మమొప్పన్
పరాకన్న నామీద భక్తాను యాయీ
దు రాపన్న రక్షా స దోషాస్తిచే దే
వరా నిన్ను నే బూని వర్ణింతు శర్వా॥ 179

## గర్భస్రగ్విణీ వృత్తము

వృ॥ నిన్ను గొల్తున్మ హా నీమ మొప్పన్ బరా
కన్న నామీద భ క్తా నుయాయీదురా
పన్నరక్షా సదో షాస్తిచే దేవరా
ని న్ననే బూని వ ర్ణింతు శర్వాహరా॥ 180

ఆ॥గీ॥ అనిన నోయి; యువిద లాశిశువుంగని
మంచి బిడ్డ గలిగె, మగశిశువని
తండ్రితోడదెల్ప దండ్రి కట్టిన బట్టి
తోడవేగ స్నాన మాడి యంత॥ 181

## జాతకర్మ

గీ॥ అశ్విరోహిణి పుష్య మూ లాంత్య హస్త
చిత్తమై త్రాదితులను ద్రి యుత్తరల, శ
శీందుజగురూశనుల, నైదు యేడు పదియు
రెండు మూడ్తిధులను, ధను ర్మీన తౌళి
కన్య, లష్టమశుచి, జాత కర్మ కొప్పు॥ 182

గీ॥ దానములు నేసి యావాలు దవుడు హెూమ
మాచరించియు, జాతక ర్మాచరణము
బొడ్డు గోయకమును జేయు బొడ్డు గోయ
నశుచి జ్ఞాతుకును దన కంటునండ్రు॥ 183

ఆ॥గీ॥ వియ్యమున్నచోట గయ్యము, బురిటింట
ద య్యముండు టయును దప్పదనెడి
సామెతగను నందు జన్మద యనియెడి
బూతమొండు సేరు బురిటి యిల్లు॥ 184

గీ॥ అదియు బాధింపకున్న నె న్నమ్మకథలు
సెప్పుకొనుచును, గత్తులు సెప్పుజోడు
రేల దీపంబు లుంచియు రే బవళ్లు
గా చుచుందురు పదినాళ్లు గడచువరకు॥ 185

గీ॥ తత్వగుణ ధుర్య; యావాలు తవుడు హెూమ
మాచరించెద రెందుకో యనిన వాటి
ధూమమున భూతబాధలు తొలగుననుచు
వ్రేల్చెద రుసుమ్ము వాటి వి వేక శీల॥ 186

ఆ॥గీ॥ ఇదియు జాతకర్మ యిందుపై శిశువుకు
బాలసారెయనుచు బదునొకంట
జరుపు యుత్సవమున జనకుడు బెద్దలు
పేరు వెడుదురెంతొ ప్రేమమీఱ॥ 187

## బాలసారె నామకరణము

గీ॥ అశ్వి రోహిణి పుష్య మృ గాంత్య మూల
శతభిష వ సూత్తరాదితి స్వాతి హస్త
మైత్ర వైష్ణవములను, కుం భాళి సింహ
వృషములను, దశమి పంచమి, విదియతదియ
ద్వాదశైకాదశీ త్రయో దశుల సప్త
మిని, సురాచార్య కుజ వి ధూ శన బు ధ దిన
ములను, నష్టమ శుద్ధి పే రుల నిడదగు॥ 188

గీ॥ పదునొ కొండవనాడు దం పతులు స్నాన
మాచరించియు బంధులి నాప్తులను సు
వాసినీలను బెద్దల బండితులను
వేగరావించి మిక్కిలి వేడ్క మీఱ॥ 189

గీ॥ పీఠములయందు గూర్చొని విష్ణునాథు
నర్చనమొనర్చి పుణ్యాహ మాచరించి
శిశువు కేపేరు వెడుదుము చెప్పుడయ్య
పెద్దలెల్లరు మీయాజ్ఞ పేరువెడుదు॥ 190

క॥ అందరియనుమతి బియ్యము
నందున మాస భముల వ్యవ హారపు బేర్లన్
బొందుగ వ్రాసియు బూజన
లందుం గావింతు రెంతొ హర్షం బొదవన్॥ 191

గీ॥ పేరులుంత్రు లోకవ్యవ హారమునకు
నందుచే కీర్తి గౌరవము లబ్బు చుండు
ధర్మకీర్తులు రెండె యీ ధరణియందు
శాశ్వతంబయి యొప్పును సద్గుణాఢ్య॥ 192

గీ॥ అంత దల్లి కుమారకు నామెభర్త
చేతి కందియ్య నాతడు ప్రీతితోడ
నందికొని వాని దన తొడ యందుజేర్చి
ముద్దులాడును శిరమును మూర్కొనుచును॥ 193

గీ॥ తనువు వలనను దనువు హృ దయమువలన
హృదయమై పుత్రునటు పుట్టి తీవు తండ్రి
నూరు సంవత్సరంబు లీ ధారుణి మను
మనుచు శిరమును మూర్కొను జనకు డంత॥ 194

గీ॥ అగ్ని చంద్రుడు జన్నము నజుడు సురలు
దీర్ఘ జీవితు లౌట నా తీరున శత
వత్సరంబులు బ్రతుకుమా వత్స: యనుచు
నేయి గు డు పుచు దీవింత్రు నిగమ విధిని॥ 195

## శిశు రక్షణ

గీ॥ ఆ దినంబున సాయంత మందు గొంద
రర్భకుని గర్భదోషాదు లంటకున్న
రక్షలనువేసి, మిగుల సం రక్షణంబు
జేసెదరు కటు తిక్తముల్ జెచ్చెరనిడి॥ 196

గీ॥ మాతృ గర్భంబు వెడలి జ న్మంబునొంది
కంకటెంబున మాంసంపు కండరీతి
నుండునెద దండ పాణులై యుండనుండి
దంష్ట్రులగు పిల్లి కుక్క బా ధలెడపింత్రు॥ 197

## శిశుప్రవృత్తి

గీ॥ దైత్యులగ పడునెడ దన తండ్రి యనుచు
ధాకినులు గనుపడ దన తల్లి యనుచు
నెంచుచును దనలోన దా నేడ్చుకొనుచు
నవ్వుకొనుచును జ్ఞాన హీ నత జరింత్రు॥ 198

గీ॥ వెల్లకిల బడి మూత్రంబు విడుచునెడను
మోముపై వ్రాల నది దుగ్ధ ములుగనెంచి
చప్పరింపుచు మలము హ స్తముల బిసికి
మోమున నలందు కొనెదరు, ప్రేమమీర॥ 199

గీ॥ అంత మూడవ మాసము నందు శిశువు
మనుజులను గాంచి చిరునవ్వు లెనయ ఊఁఉఁ
ఉఁక్కు ఉఁక్కటయు బ్రక్క కొత్తి గిలుట
బోర్గిల బడుట మొదలుగా బొసగుచుండు॥ 200

గీ॥ తల్లి దండ్రులు బిలిచెడి తఱిని వారి
మోములను గాంచి కిలకిల మొలకనవ్వు
లెనయ, జేతులు జాచుచు ననువు మీఱ
నురుకు చుందురు శిశువులెం తో ముదమున॥ 201

గీ॥ ఇటుల నురికెడు శిశువుల నెంతొ ప్రేమ
నెత్తికొని బిగ్గరగ గౌంగ లిం చిరెండు
బుగ్గలును గడుపును శేఫ మును ప్రియంబు
తోన ముద్దులు గొనెదరు, మానితముగ॥ 202

గీ॥ అపుడు తలిదండ్రులును దోడు లైనవారు
మేనయత్తలు నాన్నమ్మ మేనమామ
మొదలుగా గలవారలు ముద్దులాడి
ముచ్చటలు సెప్పుకొనెదరు ముదముమీఱ॥ 203

ఆ॥గీ॥ చీచి చీచి చీచి చిట్టికన్నా యన
నన్ను జూచి నవ్వె నాన్నయిపుడు
ఔను నన్నుజూచి యట్టులే నవ్వెను
మంచి గడసువాడు మనలవాడు॥ 204

క॥ అన్నా; ఈపువు లాడుము
కన్నాయను నంతలోన గ్రక్కున దిగిచెన్
ఎన్నండు నేర్చెనో యీ
చిన్నారి వినోదములగు చే ష్టలు ఇహిహీ॥ 205

క॥ అదిగొ యొదికిల బడియెను
ఇదిగో బోర్గిలను బడియె నెంతటివాడే
అదిగో యత్తా యనియెను
ఇదిగో తాతయని యనియె నిప్పుడు వింటే॥ 206

గీ॥ ఏదిరా బుజ్జినాన్న; నే నిపుడు వినగ
దాతయని పల్కుమాయన దాతయనియె
నౌనునే దాతయనినను ననియెదాత
యనుచు నబ్బురపడు చుందు రనవరతము॥ 207

గీ॥ వెల్లకిల బడి చేపెను వ్రేలినైన
మధ్య మానామికములైన మఱియు దనదు
కాలిపెనువ్రేలునైన జ క్కగను నోట
నుంచుకొని చప్పరించెద రుత్సవమున॥ 208

గీ॥ నాలుగవనెల బురిటింటి నడుమనిడక
నిజ గృహంబుకు దోతెంత్రు నోర్పుతోడ
నప్పుడప్పుడు జ్ఞాపకం బలవడుటను
తల్లిదండ్రుల పోలిక తవుల గలుగు॥

గీ॥ చిట్టి కన్నా యటంచును చీరినంత
నాల్గువైపులు పరికించి నాన్న జూచి
కిలకిలనునవ్వి రెండు చే తులనుజాచి
లేవ గమనించు నట్టుల లీల చేయు॥

క॥ అట్టుల దుమికెడు ముద్దుల
పట్టిని గని యాప్తులెల్ల బకపక నగుచున్
అట్టట్టె వాని చేతులు
బట్టుకొనుచు గొంత నిలువ బడజేతు రొగిన్॥

గీ॥ ఐదవ నెలను గూర్చుండు టబ్బి నాన్న
అమ్మయను పేర్లు స్ఫుటముగా నాడగడగు
చిన్నచిన్నవి మాటలు గొన్ని కొన్ని
యస్ఫుటంబుగ బలుకుట యభ్యసించు॥

గీ॥ అంత నాడింభకుండు ద నంతదాను
గూర్చొనుట బంగురుట మాట గొణుగుకొనుట
యూతగొని నిల్చుటయు బైకి నరుకుటయును
సాజ్ఞచే గొన్ని తెమ్మన సాగునంత॥

గీ॥ శైశవావస్థ యెంతక ష్టంబునైన
దల్లితండ్రులు మిగుల వా త్సల్యమొప్ప
సకల రాజోపచారముల్ జరుపుచుంట
బాలుడభివృద్ధి గనుచుండు మేలుగాను॥

## షష్ఠమ మాసాన్న ప్రాశనము

గీ॥ అరవనెలను ముడుకుల నాని కొంత
ప్రాకగా గమనించు భూ భాగమునను
చేతిలెద్దియు దొరకిన ప్రీతితోడ
నోటి కందిచ్చి తినసాగు వాటముగను॥

గీ॥ శతభి షాంత్య త్రియుత్తర శ్రవణ పుష్య
హస్తరోహిణి మైత్ర మృ గాశ్వి వాయు
వసు పునర్వసు చిత్తల, భార్గవే జ్య
విధు బుధుల, మీన యుగకర్కి వృషభకన్య॥ 216

గీ॥ చాపముల భవ్యతిథుల, ధ శమ విశుద్ధి,
యైదునే డ్తొమ్మిదిటస్త్రీల కారె ని మిది
పదిట పురుషుల కన్నంబు ప్రాశనంబు
జేయవలెనని పెద్దలు సెప్ప చంద్రు॥ 217

గీ॥ అంతలోన నన్నప్రాశ నాఖ్యకర్మ
చేయనూహించి సిద్ధాంతి చే ముహూర్త
మార్యశుక్రులు లగ్నము నందు, దశమ
శుద్ధి, శుభతారగలడిగా జూడజేసి॥ 218

గీ॥ అప్పములు లడ్డు వులును క్షీ రాన్న మిడ్డె
నలును మావిఫలములు బ నస తొలలును
ద్రాక్షఫలము లనటిపండ్లు దాడిమీఫ
లములు జామాఫలములు గొ ల్లలుగ జేర్చి॥ 219

గీ॥ దేవతాస్థాన మందున దీ పములిడి,
పూజసామగ్రులును మంచి పాత్రములును
కత్తులును బనిముట్టులు ఘనతరమగు
చిత్రవస్తువులెల్లను జేర్చియంత॥ 220

గీ॥ తల్లిదండ్రులు శిశువును దానమాడి
గణపతిని గొల్చి రక్షలు గట్టుకొనియు
శిశువు నచ్చట వి డిచియు జిరుత యంత
మున్నుయెద్దాని బ్రీతితో ముట్టినొ యని॥ 221

గీ॥ తలచు చుండగ శిశువు బొ త్తమునుబట్టి
కూరుచుండియు నవ్విన గుట్టి మంచి
పండితుం డగునంచు నే ర్పరచి యపుడు
పాయసము నేయి తేనియల్ బట్టికొనుచు॥ 222

గీ॥ తొలు దొలుతను మహావ్యాహృ తులను బలికి;
యోషధీ చయ మును గుడుపు చుంటిమిపుడు
శుభమొ సంగుత, యనుచును, సూక్ష్మమైన
కబళమును దినుపింతురు కాంక్షతోడ॥ 223

గీ॥ అదిమొదలు గుఱ్ఱవానికి నన్నుకణము
లప్పటప్పట దినుపెంతు రందువలన
విదియ చంద్రుడు దినదినం బెదుగురీతి
బాలుడభి వృద్ధి గనుచుండు మేలుగాను॥ 224

గీ॥ నాన్న; ఇది యన్న ప్రాశ నంబటందు
రిది సమస్త మానవుల రీ జులను జీవ
నంబునకు ప్రాముఖ్యమై నది యగుటను,
సర్వజను లాచరింతురు సంతసమున॥ 225

గీ॥ అప్పు డుబాలు డ త్యద్భుతముగ
జేతులూతలు గొంచును చిత్రగతిని
జతికిలబడు చు లేచుచు గుతుకమెసగ
గిలకిలను నవ్వు చుండును మొలక నవ్వు॥ 226

గీ॥ ఏడవనెలను దంతము లెంతొ వింత
సన్న బియ్యము పగిది, వ జ్రముల మొనలు
మాదిరిగ, మంచిముత్యాలు మాట్కి, రెండు
ముందుగా గ్రింద సూచించు నందముగను॥ 227

గీ॥ అంత మూలలకేగుచు వింతగాను
బొంచి చూచెదునెడల దో బూచియ నిన,
గిల కిలను నవ్వుచును జిలి బిలిపలుకులు
నలుకుచును బడుచులేచుచు బారుచుండు॥ 228

గీ॥ చూచినవియెల్ల దెమ్మను చు నొగి సన్న
జేయుచుండెడునెడ నట్టి వీయకున్న
గంతువేయుచు దూరము గా బరువున
నేగుచును బొర్లి పొర్లియు నేడ్చుచుండు॥ 229

గీ॥ పదియవనెలను దే నియ పంచదార
బోలు జిలి బిలి పలుకులు సొల ముద్దు
లొలుక బలుమారు గులుకుచు బలుకుచుండు,
నత్తినత్తిగ వినువారి చిత్తమలర॥ 230

# తృతీయాబ్ద చౌళవుం

గీ॥ శత భి షాశ్విపునర్వసు స్వాతి పుష్య
హస్త చిత్త మృగ శ్రవ ణాంత్య వసువు
లందు, బుధ గురు శుక్రాబ్జు లందు, రెండు
మూడునైదేడు పది పదు మూడునైన
తిధుల, చాపాంగనాంగనాకర్కి మిధున వృషతు
లాంత్యముల, బేసియైన మా సాబ్దములను
చౌళమున కొప్పునందురు సాధుచరిత॥ 231

గీ॥ బాలురకు పుట్టు జుట్టులు వపనమునకు
మూడునైదేడు సమములు ముఖ్యమగును
తల్లి గర్భిణియైయున్న దగదు యైదు
మాసము లతిక్రమించిన మాన్యచరిత॥ 232

గీ॥ అట్టి జుట్టెలుతీయుట కందురిలను
చౌళమని యట్టి చౌళంబు జరుపుటకును
దంపతులు శుచివంతులై దైవ పూజ
లాచరించియు సామగ్రు లలవరింత్రు॥ 233

గీ॥ మూడుచోటుల దెలుపున మొనయు నేదు
బందిముల్లును దర్భలు బదియురెండు
పేడధాన్యము గత్తియు వేడినీళ్లు
చల్లని జలంబునేయియు సంగ్రహించి॥ 234

గీ॥ దంపతులుస్నానమాడి పుత్రకుని వద్ద
నునుచుకొని రక్షల ధరించి కొ నియు హోమ
మాచరించియు బిమ్మట నగ్నితూర్పు
నందు గూర్చొని స్మృతి విధి న నుసరించి॥ 235

గీ॥ వేడినీళ్లను జ లినీళ్లు వేసి బుడుత
శిరమున నలంది దర్భల శిరముచుట్టు
ద్రిప్పి కేశసంస్కృతి జేసి తెల్ల
కత్తినంది వపనంబు గావించు నంతతండ్రి॥ 236

గీ॥ తూర్పునెరుల మూడ్దర్భల తోన ద్రుంచి
తల్లిచే నఖమంత్రుణ దగనొనర్చి
గోమయంబున ధాన్యము గూర్చియున్న
దానిలో గృంతకేశముల్ దప్పక నిడి॥ 237

గీ॥ తక్కు మూడు దిశల్ ద్రుంచి తకితురంబు
గూఢముగదాచి యచ్చటి గోమయంబు
గోగృహంబుననునిచియు గుఱ్ఱనికి ని
స్నానమొనరించి తత్కర్మ సలుపుదురొగి॥ 238

గీ॥ ఇద్ది చౌళంబు విధి, దీని నెఱిగితి గద
ఇందుపై నక్షరాభ్యాస మెలమితోడ
నైదవ సఘంబుననుఁ జేతు రందువలన
బాలునకు నెల్ల విద్యలు బట్టువడును॥ 239

## పంచమాబ్దాక్షరాభ్యాసము

గీ॥ హస్తమైత్రాంత్య పుష్య చిత్రాశ్వివాయు
జ్యేష్ఠ వాదితులను, సౌమ్య భార్గవేందు
గురుల, సింహాళి కుంభ మకర తులాజ
వృషభ కటకముల, సప్తమి విదియ తదియ
పంచమి దశమి తిథులను, పంచమాబ్ద,
మష్టమ విశుద్ధి, యక్షరా భ్యాసముకగు॥ 240

గీ॥ పంచ మాబ్దంబునందున బాలకునకు
నక్షరాభ్యాస మొనరింప నాత్మనెంచి
మంచి మౌహూర్త్యమును నియ మించి శుచిగ
గణపతిని మున్ను పూజించి క్రమముతోడ॥ 241

ఆ॥గీ॥ క్రొత్తవలువయేని యిత్తడి పళ్లెంబు
గాని యునిచి యందు లోన బియ్య
మునిచి వానిపైని యుమ హరి సిరులతో
శారదాంబ పూజ సలిపి యంత॥ 242

గీ॥ ఒక్క పళ్లెరమున బియ్య మునిచి పసుపు
గొమ్ము బాలుని చేతను గూర్చి యందు
**ఓం నమశ్శివాయ** యను శైవోక్త మంత్ర
రాజమును బియ్యమందున వ్రాయ జేసి॥ 243

గీ॥ బాలకుని చేత ముమ్మారు పలుక జేతు
రద్ది హిందువులకు మూల మైన మంత్ర
మగుట విద్యాభ్యసనమున కాదియందు
ముఖ్యముగ నుపదేశింత్రు ముచ్చటగను॥ 244

గీ॥ ఆర్య; విశ్వజ్ఞ; సర్వజ్ఞ యవనియందు
ఓం నమశ్శివాయ యనగ నుత్తమంబు
నైన శైవాగమపు మను వనుచు బలికి,
రిద్ధి యాదిని జెప్పుదు రెందుకొఱకు॥ 245

## ప్రణవ మహిమము

గీ॥ అనిన నమ్మంత్రరాజ మీ యవనియందు
దమ్మ మర్ధమ్ము కామ మో క్షమ్ము లనెడు
నాల్గు పురుషార్ధ ములను గా ణా చిగానొ
సంగు చుండును సుమ్మ; యో సద్గుణాఢ్య॥ 246

గీ॥ అందు మొదలను గలుగు ఓం అనెడు బీజ
అ.ఉ.మ.(మ) యను మూడు వర్ణము లత్తి విశ్వ
మునను సర్వంబునకును బ్రా ముఖ్యమైన
దగుటచే ముందుచెప్పెద ర న ఘ చరిత॥ 247

సీ॥ దండిగానొక పెద్ద కొండ తిరుసనొండు
వేదంబు గలదను విధి ని జంబొ,
సత్యంబు ఋ గ్యజు స్సా మంబులను మూడు
వేదముల్గలవను విధి ని జంబొ,
వేదరాశిని నాల్గు పిడికిళ్లుగొన నాల్గు
వేదంబు లనియెడు విధి ని జంబొ,
పంచాననుని ముఖ పంచకమున నైదు
వేదముల్గలవను విధి ని జంబొ,॥

గీ॥ అనుచు దర్కించునెడలను నైదు వేద
ములను విధి యొక్కటే నిజ మ్ముగ దనర్చె,
నట్టివే దమ్ములకునాది యైనప్రణవ
మహిమ మేమని తెలుపుదు మాన్యచరిత॥ 248

గీ॥ తారకాకృతి ప్రథమవఁబు దండరూప
మగు ద్వితీయంబు, మఱి తృతీ యంబు గుండ
లాకృతియును, జతుర్ధక మర్ధ చంద్ర,
మైదు బిందువు ప్రణవము నయ్యొ దంఁడి॥ 249

గీ॥ ఆ అకారమె బ్రహ్మ గా యత్రి గార్హ
సత్య భూలోక ఋగ్వేద వసువులు సుర
నదియు బ్రాత స్స వనమును నవ్య రక్త
వర్ణమై వెలుగొందును వరగుణాఢ్య॥ 250

గీ॥ ఆ ఉకారమె విష్ణువు యమున దక్షి
ణాగ్ని భువము యజుస్సు మ ధ్యాహ్నసవన
మసిత వర్ణము నుష్టుపు నయ్యు రుద్ర
రూపమై వెలుగొందును రూఢి వత్స॥ 251

గీ॥ ఆ మకారమె యీశ్వరు డదితి సుతులు
సామ మాహవనీయంబు జగతి ఛంద
మును సరస్వతి సాయంస వనము సువర
లోకము మెఱుపువన్నె సు శ్లోక: వినుమ॥ 252

గీ॥ అర్ధ మాత్రిక మౌ చతు ర్థాంశ మీశ్వ
రస్వరూపము సురలు వి రాట్ సుతుద్రి
యజ్ఞ పుచ్ఛ డథర్వంబు నంగిరసుడు
జంద్రలోకము స భ్యావ సధ్యులు శిత
వర్ణమును బ్రహ్మైక్యత వరలు వత్స॥ 253

గీ॥ డెందమున సర్వదేవత లుండి రందె
ప్రాణమును నుంచబడియెను, నాత్మయుండె,
అ.ఉ.మ. యను మూడు మాత్రల కవల వెలుగు
నా పరాత్పరు డోంకార మనగ నుండె॥ 254

సీ॥ ఈ సర్వజగముకు హితమైనదియు, బ్రజా
పతిచేత దెలియగ బడునదియును,
సూక్ష్మమైన దియును, సోముడౌహరునకు
వేరుకానిది, నిండి వెలుగు నదియు
నణురూపమైనది, యగ్రాహ్యమగు తేజ
మున గ్రహాదులకును గన న శక్య
మైనదియును, బూర్ణ మై నదియును, నిహ
పరముల నొసగెడు వాయువునకు
సోమ సంబంధియౌ సుషమకు మించిన
యగ్నితేజంబును నధి కరించి॥

గీ॥ యంతయును నొక్కకబళము నట్లుమ్రింగు
నామహాగ్రాసు ననుకారి యై జగంబు
లోగొనుచు శాశ్వతంబుగా నాగియున్న
యట్టి ప్రణవము గొనియాడ నలవియగునె॥

సీ॥ అఖిలదేవాత్మక మై ప్రవృత్తియె పాద
మును నివృత్తియె శీర్ష ముగనెసంగి,
యందు నుత్తరమైన యట్టి మోక్షము శీర్ష
మనునట్టి యోంకార మనగ నదియె,
ప్రణవంబు నదియె స ర్వవ్యాపి యనదగు,
నట్టి సర్వవ్యాపి యగుననంత,
మాయనంతమె తార, మాతారమే సూక్ష్మ,
మాసూక్ష్మమే శుక్ల, మట్టి శుక్ల
మగువైద్యుతంబన, నావైద్యుతమె పర
బ్రహ్మ మనంగను బరగుచుండె॥

గీ॥ నట్టి బ్రహ్మంబునగు బర మాత్మయొక్క,
డతడెరుద్రుండు, నీ శాను డాతడె, భగ
వానుడు, మహేశ్వరుండన వరలు చుండు,
నా మహాదేవు డోంకార మనగనొప్పు॥

సీ॥ ఉచ్చరించి న మాత్ర నొడకెల్ల బైకి సు
ద్గమమొనర్చుటను నోం కార మదియ,
తనను జపించెడి మనుజులకును బ్రహ్మ
వర్చస్సు నిడుటను ప్రణవ మదియ,
చ ముఱెట్లు మాంస ఖం డము నందువలె వ్యాప్త
మౌట సర్వవ్యాపి యనగనదియ,
అడుగున మీదిని నన్నిదిక్కుల బూర్ల
మై నిండియుంట న నంత మదియ,
రహి గర్భ జన్మ జ రా మృత్యు సంసార
తార కంబగుటను తార మదియ,
జంగమ స్థావర సకలాంతరస్థత
సూక్ష్మంబుగా నుంట సూక్ష్మ మదియ,
నాదాకృతిని సర్వ నాడుల శోధించు
నద్వైతమగు శుక్ల మనగ నదియ,

తనువుల సజ్ఞాన మున నుండి వెలిగించు
పరమ మౌ ప్రణవమే వైద్యుతంబు,
వృద్ధియై జగముల వృద్ధి బొందింపుచు
బరగు చుండెడు పర బ్రహ్మ మదియ.॥

గీ॥ ప్రణవ మోంకార మనియును వైద్యుతమని
సూక్ష్మమనియు సర్వవ్యాపి శుక్లమని య
నంత మని యు పరబ్రహ్మ మనియు దార
మనియు బ్రహ్మాదులును గొల్తు రనవరతము॥

సీ॥ విశ్వరూపము చేత వేలయుచుండెడి దెద్ది,
యేకము బ్రహ్మమై యెసగు నెద్ది,
మంత్రాది మంత్రాంత మగుచు నుండెడిదెద్ది,
భూర్భువ స్సువములై పొలుచునెద్ది,
కృత మకృతంబును హుత మహుతంబును
దత్త మదత్తంబు దాపశాంతి
విశ్వ మవిశ్వంబు విపుల తుష్టియు బుష్టి
పర మపరంబునై పరగునెద్ది॥

గీ॥ ప్రకృతి పురుషుల రూపమై పరగునెద్ది,
నామ రూపక్రియాత్మయు నైనదెద్ది,
శుద్ధమై బుద్ధమై క్రాలు చుండునెద్ది
దీన భక్త పరాయణ మైనదెద్ది॥

సీ॥ ఎద్దాని వేదంబు లెల్లను గొనియాడు,
నెద్దాని సామము లెల్ల బాడు,
నెద్దాని శస్త్రము లెల్లను జెప్పును,
యెద్దాని నధ్వర్యు లెల్ల బొగడు,
నెద్దానిదేతాగ్ను లెల్లను దెలియును,
యెద్దాని బ్రహ్మయే యెంచు చుండు,
నెద్దాని జపియించి యెల్లరు బ్రహ్మత్వ
మందుచు నుంటిరో పొందుగాను॥

గీ॥ అదియె సర్వాశ్రయంబును నదియె బ్రహ్మ,
మదియె సర్వోప నిషదర్థ, మఖిలసార,
మదియె సర్వంబు దరచిన యట్టి ఘృతము,
నౌట బ్రణవంబె; సర్వజ నాశ్రయంబు॥

గీ॥ సప్తకోటి మహామంత్ర సమితి జగతి
యందుగల దెద్దియైన ఓ మ్మనెడు బీజ
మాదియందు నలే మిని నగునె మంత్ర,
మందుచే బ్రణవము ముఖ్య, మయ్యె దండ్రి॥ 260

గీ॥ అట్టి యోంకారమందున నఖిల జగము
బంచదేవతలును జని యించి, లోక
నటనకును ముఖ్యమైన ద గుట వలనను
అహహ! ప్రణవంబు మహిమమ్మే మనగవచ్చు॥ 261

గీ॥ ఇద్ది యోంకార మహిమంబు నెఱుగజెప్పి
నాడ. వింటవి, దీనిని నమ్ము కొనిన
మోక్ష మబ్బును, యీపైని ముఖ్యమైన
శైవ పంచాక్షరిని నేవి శదపఱచెద॥ 261

ఇది
ప్రౌఢసరస్వతి - స్మార్తసింహ - నూత్నమస్కరి
చేవూరి వేంకట సోమసుందరసాస్త్రి
విరచిత మానవజన్మయను
జ్ఞానదీపంబున
ద్వితీయోల్లాసము
ఓం తత్సత్ శ్రీ మత్పర బ్రహ్మార్పణమస్తు॥ శ్రీ

ప్రౌఢసరస్వతి గ్రంథమాల మేనేజరు
పంచవృత్తుల పురోహితులు
కవికుమార్ **చేవూరి భానుమూర్త్యాచార్య (శ్రీమూర్తి)**
బుక్కావీధి, విజయనగరం-2.

—oOo—

తృతీయోల్లాసము ప్రారంభము

## శైవ పంచాక్షరీ మహిమమును

గీ॥ నమశివాయ్యను నైదక్ష రములు శైవ
మైన పంచాక్షరి యనంగ నలరె జగతి
నదియె ప్రణవముతోడ ష డక్షరంబు
నగుట బురుపా ర్థములొసంగు నదియె వత్స॥

గీ॥ శైవ పంచాక్షరికి వామ దేవ ఋషియు,
పజ్త్తిఛందము, బీజము ప్రణవమగును,
శక్తిన మకారము, శివాయ యుక్తి కీల
క ముగ భావించి, జపియింప గలుగు ముక్తి॥

గీ॥ ప్రణవము ముఖంబు, స.మ.కార పాదయుగము,
శి.జఠరంబును, వా.య లు సేతులుగను,
మూర్తిధ రియించి, జనులకు ముక్తినొసగు,
నా ప రబ్రహ్మమైన ష డక్షరంబు॥

సీ॥ ఓంకారమే యగ్ని హెూత్రాత్మకం బౌట
నం గుష్ఠమున, హృద యమున దనరు,
పుడమి సంకృతి దర్శ పూర్ణ మాసాత్మత
తర్జనీ శిరముల దగ వసించు,
మంకారమే చతు ర్మా స్యాత్మకంత మధ్య
మంబున శిఖయందు మసలు చుండు,
శింకారమే వసిం చె నిరూఢ పశు బంధ
మై యనామిక కవ చాదులందు,
స్థిరమయి యుండు జ్యో తి ష్టోమతను వాం క
ని ష్ఠనేత్రత్రయి నిష్టతోడ,
యంకృతి సర్వ త త్వాత్మత కరతల
కరపృష్ఠ యస్త్రసం కలిత మయ్యె॥

గీ॥ నందుచే నిమ్మను వును గ రాంగకముల
న్యాసమొనరించి ధ్యానించి నమ్ముకొనుచు
దమ్మ మర్ధమ్ము కామ మో క్షమ్ము లొసగు
ననుచు శైవులు జపయింతు రనవరతము॥

సీ॥ అ.ఉ.మ లతో గూడి నట్టి యోంకారంబు
నీవే యనుచు మది నిశ్చయించి,
న యను షోడశ భావ మును ద్రోచి పూర్ణము
నీవే యనుచు మది నిశ్చయించి,
మ హదాదిసప్తక మాత్మ గల్పించి తి
నీవే యనుచు నాత్మ నిశ్చయించి,
శి ష్టమై యమృతేచ్ఛ సే వనార్హుండవు
నీవేయనుచు మది నిశ్చయించి,
వా సంశయార్దని వారణస్థిరుడవు
నీవే యనుచు నాత్మ నిశ్చయించి,
య మిమనోజ్ఞాత మ ధ్యమ సంస్థితుండవు
నీవే యనుచు మది నిశ్చయించి,

గీ॥ సంతతము నాదు హృత్సరో జాతమందు
నిన్నె ధ్యానం బొనర్చెద నిర్మలాత్మ;
నా దు దురిత ములెడ బాపి న న్ను దయను
మనిపి మోక్షంబొసగు, మోన్న మశ్శివాయ॥

గీ॥ ల ము పృథివి, యాకసంబగు అమును, వాయు
యమును, నగ్నితత్వంబగు రమును, అమృత
తత్వమగు వము, సము సర్వ తత్వమగుట
నివియె యాత్మోపచారము లెఱుగు మయ్య॥

గీ॥ ల మునగంధము, పుష్పము అమున, యమున
ధూపమును, పిమ్మట రమున దీపక శిక,
వ మున నైవేద్య, మందుపై సమున సర్వ
మైన యుపచారములు సేయ నగును తండ్రి॥

గీ॥ భూ తి రుద్రాక్షమాలికల్ బూని, కంబ
ళంబొ యజినంబొ కుశయొ, వ్యా ఘ్రా జినంబొ
వేసుకొని నూటయెనిమిదొ పైని వేయి
నె ని మి దొ జపింపదగు, న మ్మ తేచ్ఛ తోడ॥

గీ॥ తులసి రుద్రాక్షములు నీల ములును ముత్తె
ములును గెంపులు రాజిత ములును స్వర్ణ
ములును బుత్రజీవులు పాద్మ ములును బవడ
ములును జపమాలికలు గొప్ప ఫలితములిడు॥

## సృష్టి - మానవుడు - మానవజన్మ

గీ॥ వరుసతోన పంచాశ ద క్షరములు నను
లోమము విలోమముగ నాత్మ లోనగూర్చి
అ.క.చ.ట.త.ప.య.శ. ల్గల్ప నదియు నూట
యెనిమిది శనుమేరు వుగ జ పింప ముక్తి॥

సీ॥ అర్థియై కైలాస యాత్రకేగిన కృష్ణు
డెద్దాని జపియించె నింపు మీర,
సీతా వియోగంబు చే రా మగిరి యందు
రా ముడెద్ది జపించె ప్రేమ మీర,
సార్వకాలంబు నా స్తను కుంభసంభవు
డెద్ది జపించుచు నెన్నికగనె,
శ్రీయాళు సానంద సిద్ధ రామాదులే
మంత్రంబుచే ముక్తి మహిమగనిరి,

గీ॥ సచ్చిదానందమయమును, సర్వవశ్య,
మై హి కాముష్మి కప్రద, మఖిలసార,
మాస్తిక సురద్రు మంబు, శై వాగమోక్త,
మక్షయ ఫలప్రదంబు, ష డక్షరంబు॥

సీ॥ ఏ మంత్ర జపమున నిల భక్తవరులకు
కైలాస వాసంబు గలుగుచుండు,
నే మంత్రజపమున నీశ్వర పీఠంబు
సన్ని ధానంబును సంభవించు,
నే మంత్రజపమున నే కా కృతిగనొప్పు
పరమేశు రూపంబు బడయవచ్చు,
నే మంత్రజపమున నీ శ్వరులో నైక్య
భావంబునొందెడి పదవి గలుగు,॥

గీ॥ నే మహామంత్ర మీయిల నెసగుచున్న
సప్తకోటి మహామంత్ర స మితియందు
మిన్నయై పురుషార్థము లన్నినిచ్చు,
నదియె ముఖ్యంబు శైవ ష డక్షరంబు॥

సీ॥ అనెడునెడన్, గంట గనెడునెడన్, జేత
బనులు సేసెడునెడ, వినె డునెడను,
నడచునెడన్, విష్ట విడచెడునెడ, సతిన్
గవయునెడన్, మేలు కాంచునెడను,

గూర్కొడునెడ, భుక్తి గుడిచెడునెడ, స్పర్శ
గలిగెడునెడ, దావు లొలయునెడను,
దలచునెడన్, లేచి నిలుచునెడన్, దుమ్ము
నెడ, సుఖ దుఃఖము లేగుడు చునెడను॥

గీ॥ ఉర్వి నిమ్మంత్ర ముపదేశ హోమ దీక్ష
తర్పణలు లేక జపియింప దగ ఫలించు,
గురుముఖత జెప్పుకొనినచో గోటిగుణిత
మగుచు మోక్షం బొసంగు గదయ్య తండ్రి॥ 13

గీ॥ ఓయి; మునిసువ్రతా: ఇపు డుత్తమంబు
నైన పంచాక్షరిని వింటి వయ్య; యిందు
పైని నక్షర తత్వంబు బలుకువాడ
శ్రద్ధగా విని, మనసంబు సలుపుమయ్య॥ 14

## అక్షరతత్వమగు నర్ణుల్లు లు ని రూపించుట

గీ॥ ఆది న.ఇ.ఉ.ఋ.ఐ. ఔచ్చు యనెడు నచ్చు
లైన పదియారు, హ.య.వ.ర డ్డ ల్ల టంచు
నమరు ముప్పదినాలుగు హల్లు లనియు
న వియు నివియును నేబది యక్షరములు
ఢక్కచేదెల్పె బరమేశు డక్కజముగ॥ 15

గీ॥ అచ్చులను ప్రాణములు బది యారు, హల్లు
లనెడు ముప్పదినాలుగు ప్రాణులనియు
న వియు నివియును నేబది యక్షరంబు
లయ్యె నక్షరతత్వమీ యవనియందు॥ 16

గీ॥ అట్టి యక్షరతత్వంబె మొట్టమొదట
వాక్కుచే నుచ్చరింపగ బడియె, బిదప
దేవ నాగరలిపి బుట్టి యావెనుకను
తక్కలి పులెల్ల గలిగె, నీ ధరణియందు॥ 17

గీ॥ ఎన్నిలి పులున్న, భాషలు యెన్నియున్న
నెన్ని శబ్దము లున్నను యెన్ని పలుకు
లున్న, నామంబు లెన్నియో యున్న నేబ
దక్షరంబులచే బల్క నగును, తండ్రి॥ 18

## అక్షరతత్వము షట్చక్రముల నుండుట

సీ॥ ఆధార చక్రంబు నందున వ.శ ష.స,
స్వాధిష్ఠమందున బ.భ.మ.య.ర ల,
మణి పూరమందు డ ఢ.ణ.త.థ.ద.ధ.న.ప
ఫ లు ననా హత చేరు వ.క.ఖ గ.ఘ.ఙ
చ ఛ.జ.ఝ.ఞ ట.ఠ లు సద్వి శుద్ధంబున
బదియారు నచ్చులు బరగి యుండె,
నాగ్నేయ చక్రంబు నందు హం.క్షం.ములు
గలిగి యేబది మాతృ కలును నయ్యె,

గీ॥ ఇదియె యక్షరతత్వంబు యింత కన్న
వేరు నుచ్చారణాక్షర వి తతిలేదు,
సకల భాషలు, రుతములు శబ్దములును,
బరగి నిండెను సుమ్మ; ప్ర పంచమెల్ల॥ 19

సీ॥ నామ రూప క్రియ లేమి యులే న ట్టి
యాత్మను బరతత్వ మను చు బలుకు,
హర హరి విధి శక్తి తరణులు ముఖ్యమౌ
పంచదేవతలని పలుకు నదియ,
క్రీస్తుదేవుడు మన కే వల రక్షకుం
డనుచు వక్కాణించు నదియ కాదె,
హల్లా మహాప్రభుం డాదిదేవుండని
నిశ్చయంబుగను వర్ణించు నదియ,

గీ॥ అన్ని పేరులు వలుకుట యన్నిమతము
లన్ని మంత్ర రహస్యంబు ల దియెనయ్యొ,
జాతిభేదముల్ వరములు శాపములును
నట్టి యక్షరతత్వంబె యయ్యొ, దంద్రి॥ 20

## అక్షరతత్వంబె అన్ని పేరులగుట

గీ॥ స్వామి వెంకన్న దేవుడు సాలెపురుపు
ఇల్లు యేనుగు గుఱ్ఱము పల్లు దవుడ
గడ్డి రోకలి యావును గాదెయనెడు
పేరు లక్షరతత్వంబె పెట్టి పిలుచు॥ 21

## అక్షరతత్వంబె అన్ని మతములనుట

గీ॥ శైవ వైష్ణవ శాక్తేయ సౌర బౌద్ధ
కూచి మాచికాపాలి య ఘోర యోగ
క్రైస్త వాలేఖ యిస్లాము గాణపత్య
మతము లక్షరతత్వంబె మహిని వెలుపు॥ 22

## అక్షరతత్వమే అన్ని మంత్రములగుట

సీసమాలికా

సీ॥ ఏకాక్షరి యనంగ నెసగు ఓం అనియెడు
ప్రణవమే యాదిప్ర పంచమునకు,
హ్రీం అనునట్టి గౌ రీ మంత్రరాజము
సర్వసిద్ధులు భక్త జనము కొసగు,
ద్వ్యక్షరియనగను దగిన సో. హం అను
హంసగాయత్రి ము ఖ్యంబు, జగతి
ద్వ్యక్షరియగు రామ తారక మంత్రంబు
బ్రాముఖ్యమయ్యె బ్ర పంచమునకు,
త్ర్యక్షరియైన ఓం తత్స తు యనునది
బ్రహ్మార్పణంబగు పరమ మనువు,
త్ర్యక్షరి యనగను దగిన శ్రీ విఠల్ త్రి
మూర్త్యాత్మకంబైన ముఖ్యమనువు,
చతురక్షరి యనంగ జను తత్వమసి యన్మ
హావాక్యమును ముఖ్య మైన మనువు,
చతురక్షరి యను సంజ్ఞ నారాయణ
యను మంత్రమును ముఖ్య మైన మనువు,
పంచాక్షరి యనంగ బడిన ఓం కారంబు
మోక్షాస్పదంబైన ముఖ్యమనువు,
వంచాక్షరి యనంగ బడు అహంబ్రహ్మాస్మి
యను మహావాక్యమ నాది మనువు,
పరగ ప్రజ్ఞానము బ్రహ్మ యంచను మహా
వాక్యపంచాక్షరి ప్రబలమనువు,
పంచాక్షరి యనంగ బడిన నమశ్శివా
య యనుమంత్రంబు మో క్షాస్పదంబు,

అయ మాత్మ(బ్రహ్మ యంచ ను షడక్షరి ముఖ్య
మైన మహావాక్య మవనియందు,
అ ఓం నమశ్శివా య యను షడక్షరి
కైవల్యమొసగు ము ఖ్యమగు మనువు,
నవ్యమౌ ఓంనమో నారాయణాయ్యను
నష్టాక్షరి యును మో క్షప్రదంబు,
ఆద్యమౌ (బ్రహ్మస త్యం జగన్మిథ్య యం
యనెడు యష్టాక్షరీ మనువు దొడ్డ,
అష్టాక్ష రేతదే వాక్షరం(బ్రహ్మ యం
చనుచు వచించెడు మనువుదొడ్డ,
ఉర్వీదశాక్షరి ఓం నమోభగవతే
రు(ద్రాయ యనునది భ(ద్రమనువు,
ద్వాదశాక్షరి ముక్తి దాయిని ఓంనమో
భగవతే వాసుదే వాయ యనగ,
ఈశ్వరత్వంబు ఓం (హ్రీంక్లీం శివాయు వీ
ర(బ్రహ్మణేనమో (బ్రహ్మమనువు,
రహి ఓం నమోపర బ్రహ్మ ణేశ్రీవీర
నారాయణాయ్యను నట్టి మనువు,
అచల పరబ్రహ్మ మగు ద్వాద శాక్షరి
శాశ్వతమైనట్టి సత్యమనువు,
షో డశాక్షరియని శోభిల్లు మంత్ర మీ
దృశ్యప దార్థముల్ న శ్యమనువు.
ఇరువదినాలు గ క్షరముల గాయ(త్రి
(బ్రహ్మత్వమును సిద్ధి పఱచుమనువు,
ద్వా(తింశదక్ష ర (భాజిత స మకా ది
మంత్రంబు కైవల్య మార్గదర్శి,
ద్వాత్రింశ దక్షరీ ధాత్రిని బురుషసూ
క్తా దినినుండె మో క్షప్ర దంబు,

గీ॥ ఇట్టి మంత్రము లేడుకో ట్లై స గుచుండు
బాల్య యౌవన వృద్ధ సు ప్త ప్రమత్త
మిళిత మూర్ఛిత స్తంభిత ములును, హీన
వీర్య (త్రస్తారిపక్షముల్ వెలయు మంత్ర
సమితి యక్షరతత్వంబె, సద్గుణాఢ్య॥

## అక్షరతత్త్వమే జాతిభేదములు సెప్పుట

గీ॥ బ్రాహ్మణులని క్షత్రియులని వైశ్యులనియు
శూద్రులని పంచములని క్షుద్రులనియు
నిలను మనుజులు నాల్గుల కలగు జాతు
లనియు నక్షరతత్త్వమే యనును తండ్రి॥ 24

## ఆశీర్వచనములు తిట్టులు అక్షరతత్త్వమేయనును

గీ॥ ఆయు రారోగ్య పుత్ర పౌత్రాభివృద్ధి
రస్తు విజయోస్తు చల్లగా బ్రతుకుమయ్య
యనెడు దీవెనలును॰ తిట్టు లన్ని జగతి
లోన నక్షరతత్త్వమే మాననీయ॥ 25

## సకల భాషోచ్చారణలక్షరతత్త్వమే

గీ॥ ద్రావిడము కన్నడమ్ము వో ధ్రమ్ము నింగి
లీషు మహరాష్ట్రమును నెరు కలియును
మొదలు ఛ ప్పన్నభాషలు మూలమైన
యట్టి యక్షరతత్త్వంబె యనును వత్స॥ 26

## అన్ని జంతువులపలుకులు అక్షరతత్త్వమే

గీ॥ కీరుకీరు కుహూ బాంబ్రు కిచ్చు కిచ్చు
కొక్కురోకొ కిహీహి మేఁ గుఱ్ఱు గఱ్ఱు
కావు కో యంభ భౌ యన గాదనర్చు
రుతము లక్షరతత్త్వమే రూఢి బలుకు॥ 27

## అక్షరతత్త్వమే అన్ని శబ్దములగుట

గీ॥ టక్కు టిక్కను గభ గుభాల్ ఠంగు, టింగు
కంగు ఝూం జేం పఠాల్ ఖణేల్ కఱ్ఱు కిఱ్ఱు
బస్సు బుస్సు ధణాల్, చిఠాల్ బరగెడు ధ్వను
లట్టి యక్షరతత్త్వమే యనును తండ్రి॥ 28

ఆ॥గీ॥ అర్ధమాత్ర నకుల మ భ్యసించెను పాల
గువ్వ యొక్క మాత్ర గూయుచుండు
వాయసంబు రెండు వర్ణంబులను బల్కు
మనుజు లభ్యసించె మాత్రలన్ని॥ 29

## మానవులకక్షరతత్త్వమంతయుం పట్టుపడుట

గీ॥ కంఠమున దాలువులి నాసి కమున నోష్ఠ
ములను మూర్ధను దంతోష్ఠ ములను దంత
ములను నేబది వర్ణముల్ వలుక బడుట
చేత మనుజుల కన్నియు సిద్ధ పడియె॥ 30

గీ॥ అట్టి పలుకులె పంచ వే దాళి యు ప ని
షత్ప్రపంచము సకల భా షలు బురాణ
సమితి సూత్రముల్ ధర్మశా స్త్రములు మొదలు
నెన్నియో విద్యలుగ మారి యెన్నబడియె॥ 31

గీ॥ ఇట్టి యక్షర తత్త్వంబె యెల్ల భాష
లకును వేదంబులకు విద్య లకును ముఖ్య
మగుట నన్నియు మానవు లందఱకును
జదువుటకు నధికారము సంభవించె॥ 32

గీ॥ అట్టి యక్షరతత్త్వంబె యన్ని యగుట
మానవుల కెల్లరకును స మానమైన
హక్కు గలుగుట జక్కగా నభ్యసించి
ధర్మములు గమనింపగా దగును, వత్స॥ 33

## అక్షరతత్త్వ ప్రాధాన్యత

గీ॥ అట్టి యక్షరతత్త్వంబు నంచె సర్వ
మిమిడియుంటను సర్వలో కముల యందు
నద్దియ ప్రధానమై యుంట నార్యులెల్ల
రా పర బ్రహ్మ మదె యని యా దరింత్రు॥ 34

గీ॥ ఇదియె యక్షరాభ్యాస మం బెఱుగ జేసి
నాడ నక్షరతత్త్వంబు నూడ జూడ
ని జము దెలియును, యూపైని సుజనులైన
బాలకులచర్య వినుపింతు బాగుగవిను॥ 35

# బాల్యము

గీ॥ బాల్యమనునది శిశువుల పంచమాబ్ద
మాది పదియేను వర్షము లైన దనుక
గడచు పదివత్సరంబుల నడువడికను
సూచనగ వివరించెద సుగుణ ధుర్య॥ 36

గీ॥ అవని విద్యాధనంబులు ననెడురెండు
ముఖ్యమైనవి కావున ముందుగాను
విద్యనేర్పిన గలుగు బ్రవీణ తయని
యక్షరాభ్యాస మొనరింతు రర్భకునకు॥ 37

గీ॥ చదువునందున మిక్కిలి శ్రద్ధ నూని
ప్రతిదినంబును దప్పక బడికినేగి
గురువుసెప్పెడు పాఠముల్ గురుతుమీఱ
జదువుచుండును మిక్కిలి శ్రద్ధ తోడ॥ 38

గీ॥ బాలకులతోడ గలిసియు బరువు విడుచు
నాటలందున నెన్నేని యాటలాడు
బుద్ధి మంతుడు వీడని బుధులుమెచ్చ
నెంతయోనెమ్మదిగ సంచ రించుచుండు॥ 39

గీ॥ తల్లిదండ్రులు ప్రేమింప దగిన మంచి
నడు వడిక నేర్చికొనుచును గుడుపునందు
గయ్యములు వెట్టకను బొంది కగను బెట్టి
నట్టు సాపడు, నొగి కట్టు దిట్టముగను॥ 40

గీ॥ ఆటలందున దనతోడి యర్భకులను
గొట్టకను, దిట్టకను గవ గూడి యెంతొ
మైత్రతను సోదరులబోలి చిత్రగతిని
మెలగుచుండును మిక్కిలి లలితముగను॥ 41

గీ॥ అన్నివి ద్యలయందున నారితేరి
శిల్పములు వింతవింతలౌ చిత్తరువులు
వ్రాత సంగీతవిద్యలు వాద్యములును
మొదలు వెన్నేని యభ్యాస మొనరజేయు॥ 42

గీ॥ ఇవ్వి బాలుర నడు వడు లిందుపైని
బ్రహ్మ వి ద్యోపదేశంబు బరగజేయ
నుపనయన మాచరించెద రొప్పగాను
దాని విధి చెప్పెదను విను, తప్పకున్న॥ 43

## అష్టమాబ్ద ఉపనయనము

గీ॥ హస్త చిత్త త్రియుత్త రాం త్యాశ్వి పుష్య
శతభిష ధనిష్ఠ రోహిణి స్వాతి మైత్ర
విష్ణు మృగ పునర్వసులను, వృషభ మిధున
కర్కి మేష తులా కుంభ కన్యకలను,

2 మూడు నై దేడు పది పదు మూడు రెండు
తిధుల, బుధ గురు కావ్యల, ని ధనశుద్ధి
నుపనయన మొనరించుట కొప్పునంద్రు
సుగుణ గుణధుర్య; యో ముని సువ్రతార్య॥ 44

గీ॥ ద్యుమణి కేంద్రగతిన్ స్పృజి త మను దోష,
మద్ది యాచార్య శిష్యుల కంటు చుండు,
కుజుడు కూజిత మన మాత కు, శని రుధిర
మద్ది కులముకు, రా హూగ్ర మనెడు నదియ

2 బాలునకు, కేతు రంధ్ర మ బ్బకు ను దోష
మనుచు బరికించి శుభలగ్న మరయు టొప్ప,
సుకృత గుణచర్య; యో ముని సువ్రతార్య॥ 45

గీ॥ ఎనిమిదవ వత్సరంబున జనకు డర్భ
కునకు నుపనయనోత్సవం బును నొనర్ప
బూని తత్ప్రయత్నంబును బొనర జేయు,
జప్పరంబులు నిర్మించి జగిల వేసి॥ 46

గీ॥ బంధువుల నాప్తజనుల సు వాసినులను
బెద్దలను బండితులనెల్ల బిలిచికొనుచు
మంగళధ్వను లొప్ప; దం పతులు వటువు
స్నానము లొనర్చి, సమ్మద స్వాంతు లగుచు॥ 47

గీ॥ పీఠములను గూర్చుండియు, విఘ్ననాథు
గొలిచి, పుణ్యాహవాచనం బలవరచియు,
రక్షలను గట్టుకొని యంకు ర ములువేసి
యా ఇడావాచనంబును నపుడొనర్చి॥ 48

## అంకురారోపణము

గీ॥ అంకురారోపణముసేయ నపుడు, పుట్ట
మన్ను నవధాన్యములు బాలు మంచి దూర్వ
లున్ను చందన మక్షత లును శిరీష
పిప్ప లామ్ర ఛ దమ్ములు బేడ పంచ
పాలికలు దారములు గూర్చి పరమనిష్ఠ॥ 49

గీ॥ మృత్తుపాత్రల యందున మెలపి కంచు
పాత్రలో బాలయందున బదియు నాల్గు
యోషధులువేసి మంత్రించి యోజమీఱ
బంచదైవత మంత్రముల్ బఠనజేసి॥ 50

గీ॥ ఐదిట నువేసి ప్రణవము నపుడుపలికి,
మన్ను గప్పియు నబ్లింగ మంత్రములను
బావమానీయ సూక్తంబు బఠన జేసి,
పాలికల మార్జన మొనర్చి, పరమభక్తి॥ 51

గీ॥ పంచదేవత లందు నా వాహనంబు
జేసియు, నిడాహవాచన జేసి నాల్గు
దినము లర్చించి, నాలవ దినమునందు
వాటి నుద్వాసనము చేయ వలయు, వత్స॥ 52

గీ॥ అపుడు వటువు జనించిన దాది యుపన
యనము దనుకను జేసెడి నట్టి పనుల
వినుచు, చపుడు ప్రాయశ్చిత్త మొనరిచెదరు
స్మార్తపద్ధతి మిక్కలి శ్రద్ధమీఱ॥ 53

సీ॥ తల్లిచంటిని బాలు ద్రావుట, నిలిచి మూ
త్రంబును విడిచి శౌ చంబులేమి,
తినరాని వస్తువుల్ దినుట, యుచ్ఛిష్టముల్
దినుట, య భోజ్యముల్ దినుట, కలిసి

తినుట, పర్యుషితముల్ వినుట, యిష్టము వచ్చి
నట్టుల దిరుగుట, యటుల మాట
లాడుట, తమ జాతి తోడ వి జాతుల
తోడను గలిసియు నాడికొనుట,
సరస సల్లాపముల్ జరుపుట, త్రావరా
నివి ద్రావు, టంటరా ని జనులనొగి॥

గీ॥ నంటుటయు, మొదల్ గాగల్గు యఘము లర్భ
కునకు జన్మ మొదలు గను పనయనము ద
నుకను గలిగెడునని యెంచి ప్రకటనంబు
సేసి, నిష్కృతి శాస్త్రోక్తి జేసి యపుడు॥ 54

గీ॥ కాలము గడుపకయె జాత కర్మ నామ
కరణములును, నన్నప్రాశన కర్మ, చౌళ
ములను జేయమి సంస్కార ములనొనర్చి,
యుపనయన మారంభింతు రపుడు తండ్రి॥ 55

గీ॥ అర్భకుని దక్షిణపు భాగ మందునునిచి
యంత సంకల్పము ను జెప్పి, యనుపనీత
నిష్కృతియొనర్చి, కృచ్ఛ్రముల్ నియతి నిచ్చి,
వటువునకు రక్షగట్టి, పి మ్మటను విధిగ॥ 56

గీ॥ యజ్ఞ సూత్రంబు వేసియు నమ్మతోడ
వేరుగా భుక్తివెట్టియు, వెంట్రుకలను
వపనమొన రించి నీ ర్వోసి, వహ్నినిలిపి,
యారుపాత్రలు సంస్కార మాచరించి॥ 57

గీ॥ దర్భలును నీరు కూర్చ వ స్త్రములు సన్నె
కల్లు కృష్ణాజినము మోదు గంపు దండ
మున్ను మౌంజియు నొక్కచో బొందుపఱచి
యొక్క మోదుగస మిధ యా హుతిగనిచ్చి॥ 58

గీ॥ సన్నెకలు ద్రొక్కజేసి, వ స్త్రములు మంత్ర
ణంబొనర్చియు, శీత లోష్ణ శమముకు
వటువుచే ధరియింపించి, వాజపేయ
సిద్ధికై మౌంజి మొలయందు జిరుతకునిడి॥ 59

గీ॥ చంద్ర సురనాయక తురు త్ర్వ సాదమునకు
నజినమును ధ రియింపించి, యర్భకు గుశ
లందు గూర్చుండబెట్టి, త దంజలి నుద
కంబునిచి, బాలునకు బ్రోక్ష ణంబు సేసి॥ 60

గీ॥ వటువు చేపట్టి, వాని దే వతల రక్ష
కొరకు నర్పించి, సుముహూర్త మరసి, జీల
కఱ్ఱ బెల్లము నుదుటను గ దియజేర్చి
తండ్రి తొడపైకి బుత్రకు దారిచియును॥ 61

గీ॥ అపుడు బ్రహ్మోపదేశంబు నాచరించి,
యుభయు లొగి సంభాషించి, హోమకర్మ
యును జయాదిహోమంబును నొనరజేసి,
బ్రహ్మ పూజనమునుసల్పి, పరమ నిష్ట॥ 62

గీ॥ గురువునొగి దర్భకూర్చిపై గూరుచుండ
జేసి, ప్రత్యఙ్ముఖంబుగా శిష్యుడుండి,
గురువు పాదంబులను రెండు కరములగొని
మంత్ర ముపదేశ మిమ్మను, మాణవకుడు॥ 63

గీ॥ అపుడు గురు వర్యు డపసవ్య హస్తమును గు
మారు శిరమున జేర్చియు, మంత్రరాజ
మైన గాయత్రి వ్యాహృతుల్ తోన శిష్యు
దక్షిణ శ్రవఃపుటంబున దవుల జెప్పు॥ 64

గీ॥ పిమ్మటను గురువర్యుండు బెదవులను జె
వులను నీటితో దుడిచి, ని శ్చలత నుండ
మంత్రసిద్ధికై గురునకు మానితముగ
మంచి గోదాన మిచ్చును మాణవకుడు॥ 65

గీ॥ అనఘ; గాయత్రి యనియెడు నట్టి మంత్ర
మంత బాల్యమునను బాలు రందరకును
నేల యుపదేశమిత్తురో యుద్దినాకు
వినుచుమస, విశ్వజ్ఞుండు వినుచు నిటుల॥ 66

# గాయత్రీ మహిమాను వర్ణనము

గీ॥ ఓము మునిసువ్రతాఖ్య; యీ యుర్వియందు
సప్తకోటి మహామంత్ర సమితి గలదు,
ఇద్ది బ్రహ్మత్వసిద్ధిని నేర్పరుచుట
నెద్దియైనను గాయత్రి శుద్ధియగునె॥ 67

గీ॥ జన్మచే శూద్రులయ్యును జగతి గలుగు
సంఘము వడుగునందున శ్లాఘ్యమైన
యట్టి గాయత్రి నుపదేశ మందబట్టి
ద్విజులనగ బూజ్యులై భువి దేజరిలిరి॥ 68

గీ॥ దైవతములు ముక్కోటిలో దల్లిమేటి,
వ్రతములందున ద్వాదసీ వ్రతము దొడ్డ,
దానములలోపలను నన్న దానమధిక,
మటులగాయత్రి మంత్రము లందు రాజు॥ 69

క॥ ధీయుతః విను గాతారం
త్రాయతి గాయత్రి యనెడు ధర్మోక్తిగనే
యే యోగములైనను యీ
గాయత్రికి సాటి మనువు గలదె ధరిత్రిన్॥ 70

సీసమాలికా

సీ॥ మునిసువ్రతాహ్వయా వినుము, మంత్రముల
కెల్లను మేటియై యెసగుచున్న
గాయత్రి యుదయాన గా యత్రియును, బ్రాహ్మి
యనబడు, మధ్యాహ్న మందు నదియె
సావిత్రియును రౌద్రి నా విలసిల్లును,
సాయంతమున సర స్వతియు వైష్ణ
వీ యనబడుచుండు, విశ్వాత్మకుడు ఋషి
సాంఖ్యాయన స గోత్ర సంభవంబు
స వితయే దేవ, తా స్యం బగ్ని, బ్రహ్మయే
శీర్షంబు, రుద్రుండు శిఖయు, విష్ణు
హృదయం, బుపస్థయే పృథివియు, శ్వేత వ
ర్ణంబును, దత్వ వ ర్ణాత్మకంబు,

పాదత్రయంబును, బంచ శీర్షంబులు,
గుక్షి షట్కంబును, త్ర్యక్షియుతము,
బాహుదశంబున వరదాభ యాంకుశ
కశగదా శంఖచ క్ర సరసీజ
యుగళీ కపాలముల్ దగ, హేమ విద్రుమ
ముక్తా ధవళ నీల ముఖము లమర,
రత్నస్రగిత చంద్ర రాజిత సత్కిరీ
టంబు శిరంబున దంబుమీర॥

గీ॥ పంచవేదములకు మాత, బ్రహ్మపదము
నిచ్చునెరదాత, జనుల కీ యి హమునందు
దమ్మ మర్థమ్ము గా మమెా క్షమ్ము లీయ
న మర కల్ప ద్రు మమ్ము, గా యత్రి సుమ్ము॥

సీ॥ అంగుష్ఠమున, హృద యమున ఓం తత్స వి
తు రని నమస్కృతి తిరము గలిగె,
తర్జనీన్ శిరమున తగి వరేణ్యము స్వాహ
యను పల్లవము తోడ న మరు చుండె,
మధ్యమంబున శిఖన్ మరి భర్గొదేవస్య
వషటి పదంబున వరలు చుండె,
ఆ యనామిక కర చాదుల, ధీమహి
హుం మను బీజమై యొప్పుచుండె,
ఇ. కనిష్ఠనే త్ర త్ర యిన్ ధియో యోన వౌ
షడను మంత్రంబున జరుగుచుండె,
కరతల కరపృష్ఠ కమున సర్వాత్మ ప్ర
చోదయా దస్త్రా య సు ఫ టు యొప్పె॥

గీ॥ నందుచే నంగుళీ హృద యాదికముల
న్యాసమొనరించి, ముద్రలు ధ్యాన మాచ
రించి, గాయత్రి నొగి జపి యించిరేని
దమ్మ మర్థమ్ము కామమెా క్షమ్ము లొదవు॥

గీ॥ అట్టి గాయత్రి మంత్రము నభ్యసించి
గాధిరాజ తనూజుండు గౌశి కుండు
బ్రహ్మ ఋషియై, త్రిశంకు భూ పాలకునకు
స్వర్గము రచించి యిచ్చెద చ్ఛక్తిగాదె॥

గీ॥ అట్టి గాయత్రి భువిని బ్రహ్మాస్త్రమందు
రద్దియే ప్రయోగోపసంహారములను
తెలిసి కొనిరేని శత్రుల గెలువ వచ్చు
గాన గాయత్రితగు సర్వ మానవులకు॥ 74

గీ॥ గోవు పాముల బాధలు గూడ కున్న
వటువు పాలాశ దండంబు బట్టు కొనుచు
నిలువబడి సూర్యునకు మ్రొక్కి నియమముగను
ప్రాతరగ్ని కార్యంబును ప్రీతి జేయు॥ 75

గీ॥ అగ్నికిని మ్రొక్కి భస్మంబు నలదికొనియు
సమిధ నగ్నిలో వ్రేల్చియు బ్రమదమొప్ప
దల్లికిని తండ్రికిన్ని పెద్దలకు మ్రొక్కి
భిక్షమునుగొని గురునకా భిక్షమిచ్చు॥ 76

గీ॥ ఇటుల రెలునాడొనర్చి, పిమ్మటను మూడు
దినము లగ్నికార్యంబును నొనరిచియును,
మూడవదినంబున సదస్యమును, జతుర్థ
దినము పాలాశ కర్మను దీర్తు రనఘ॥ 77

గీ॥ మున్ను ధరియించి యున్నట్టి ముంజి సూత్ర
మజిన దండాదులను దీసి, యన్యమైన
యట్టి క్రొత్తవి ధరియించి, యపుడు దీవె
నలు వడసి, కర్మదీర్తురు నాన్న; వినుమ॥ 78

గీ॥ ఇది యుపనయన సంస్కార మెల్ల మాన
వావళికి ముఖ్యమగుటను బాలకులకు
నెనిమిదవయేట జరుపుదు, రిందువలన
బ్రహ్మవర్చస్సు పరమును బడయగలరు॥ 79

## ఉపాకర్మ

గీ॥ అంత శ్రావణమాసము నందు శుక్ల
పంచమిని, హస్తయందు, శ్రవణ భమునను,
బూర్ణిమను, వాచిశాఖాను పూర్వకముగ
వటువుచే దండ్రి చేయించు పటుతరముగ॥ 80

గీ॥ ప్రాతరగ్ని కార్యంబును బ్రీతిజేసి
బ్రహ్మయజ్ఞము సేయించి, బాలకునకు
వేదములను బ్రారంభించి, సాదరమున
బ్రహ్మచర్యము సిద్ధించు, పరత నంత, 81

గీ॥ అదిమొదలు బంచవేదము లారుశాస్త్ర
ములు బురాణములును, గావ్య ములును ధర్మ
శాస్త్రములు నలంకారముల్ సకలవిద్య
లభ్యసింపగజేసెద, రర్భకునకు॥ 82

గీ॥ బాలు డంతటనుండియు బ్రహ్మచర్య
మాచరించుచు, సకల వి ద్యలనునేర్చి
కొనుచు, భిక్షాన్న భుక్తిని గొనుచు, నగ్ని
కార్యమును నెరవేర్చుచు, గడపు, వత్స॥ 83

## వ్రతచతుష్టయము

గీ॥ అటులనొప్పెడు బ్రహ్మ చ ర్యంబునందు
నాదియందు బ్రాజాపత్య మనెడువ్రతము,
బిమ్మటను సౌమ్యమనెడు వ్ర తమ్ము, నందు
పైని నాగ్నేయ వైశ్వదే వములొనర్చు॥ 84

## స్నాతకము

గీ॥ వటువునకు స్నాతకంబను వ్రతమొనర్ప
బూని పందిలి తిన్నెయు బొందుపరచి
మంగళ ధ్వను లొప్ప, నీ మంబు తోడ
స్నానము నొనర్చి, మధ్యాహ్న సమయమునను॥ 85

గీ॥ పీఠమందున గూర్చొని విఘ్ననాథు
గొలిచి, పుణ్యాహవాచన మలవరించి
బ్రహ్మచర్య వ్రతంబు లో పమగుననుచు
నిష్కృతికిని సంకల్పము నియతి నెరపు॥ 86

గీ॥ అపుడు పరిషత్ప్ర దక్షిణ మాచరించి
వటువు వినయాన్వితుండయి వడుగు మొదలు
స్నాతక వ్రతము దనుక జరుపబడిన
దుష్కృతంబులు సభవారి తోడ వినుచు॥ 87

సీ॥ స్నానంబు సేయమి, సంధ్యవార్వమి, జప
హీనత, భిక్షా విహీన, తాగ్ని
కార్యహీనత, క్షౌర కర్మహీనత, యజ్ఞ
సూత్రహీనత, కటి సూత్రహీన
తాజిన కౌ పీన దండహీనత, మాల్య
ధారణ, లేప నో ద్వర్తనములు,
తాంబూలఖాదన, దర్ప ణోత్సవ నృత్య
దర్శన, నీచ సం స్ప ర్శనమును,
పగలు మంచ ముపైని బండుట, దానిపై
గూర్చొని భక్ష్యముల్ గుడుపు, నీరు

గీ॥ ద్రావుటయుఁ సూతకాన్న ఖా దనము, వేద
బాహ్య సంస్పర్శనము, వృద్ధ వాక్య నిరస
నంబు, మొదలగునవి యుప నయనమాది
స్నాన పర్యంతము వటువు సలుపు పాత
కములనుచు నిష్కృతి యొనర్తు రు, ముదమొప్ప॥ 88

గీ॥ అంత సంఘాను మతిగొని యపుడు కనక
మును, ఘృతము, ధాన్యమును, గృచ్ఛ ములుగ నిచ్చి
యగ్నినిలిపి, చతుష్పాత్ర లచట నుంచి
యున్న, పాహిత్రయోదశ హోమ విధియు॥ 89

గీ॥ ప్రథమమున బ్రాతరగ్ని కా ర్యమునొనర్చి,
స్నానసంకల్ప మంతట సలిపి, చేత
రక్షధరియించి, యగ్ని ప్రా ర్థనము జేసి,
యారుపాత్రలు సామగ్రు ల లవరింత్రు॥ 90

సీ॥ నూల్దారములు రెండు నుం బుట్ట ములురెండు
గంధంబు సమిధ బం గారు పూస
పూలదండయు చెవి పోగులు గాటుక
చలినీళ్లు వేన్నీళ్లు చాప కత్తి
ధాన్యంబు గొడుగు య ద్దము పేడ పాంకోళ్లు
బర్హిస్సు దర్భలు పసుపు గుండ
బొడ్డ పుడుక రేగు పూసయు వైణవ
దండంబు నొక్కచో నుండజేసి

గీ॥ పాత్రలను సంస్కరించి, యా పైని దర్శ
పూర్ణమాసాహుతులు, నగ్ని ముఖ హుతములు
వేల్చి, మోదుగసమిధను వ్రేల్చి, పిదప
వ పనమునుజేసి మార్జనం బు ప చరించి॥ 91

## అలంకరణము

గీ॥ మేడి పుడుకను పలుదోమి, మేనియందు
పసుపుగుండను రాసియు వస్త్రయుగము
దాల్చియును, దేవతలకు జం దనము నిచ్చి
యందు శేషము నురమున నలది కొనియు॥ 92

గీ॥ మెడను బంగారు పూసను నిడియు, జేత
రేగు పూసను గట్టియు బోగు జోడు
చెరగు నంగట్టి, హోమంబు సేసి బ్రహ్మ
పూజనమొనర్చి, హోమంబు బూర్తిచేసి॥ 93

గీ॥ పోగులను గుడియెడమ చె వుల ధరించి,
పూలదండను శిరమున బొందుపరచి,
కాటుకను దీర్చి, పాదుకల్ గాళ్ల, దొడిగి,
గొడుగెడమ చేతి యందున గూర్చి పట్టి॥ 94

గీ॥ వెదురు కఱ్ఱను గుడిచేత బొదివిపట్టి,
మంచి ఫలహారములను చే లాంచలమున
ముడిచి, మూపున నిడికొని వడివడిగను
కాశి యాత్రనెపంబున గదలిపోవ॥ 95

గీ॥ మామగా రంత నొక చాపు మంచిగంధ
మాకువక్కలు ను దకంబు నందియేగి,
నాదుకూతు నొసంగెద నయ్య; మఱలి
రమ్మనుచు దోడికొనివచ్చు సమ్మదమున॥ 96

గీ॥ పిమ్మటను స్నాన మొనరించి, నెమ్మదిగను
నుండ, నారేయి పెండ్లి సే యుదు. రటులను
జేయుమని బ్రహ్మ చర్యంబు సెడి, గృహస్థు
గావు యుండగగలఁగును, కన్నతండ్రి॥ 97

గీ॥ ఇద్ది స్నాతక విధి జెప్పి, తిందుపైని
సవని గార్హస్త్యముకు ముఖ్య మైన పెండ్లి
కూతులక్షణములు పెండ్లి కొడుకు లక్ష
ణములు వైవాహిక మహోత్స వము నుడివెద॥ 98

గీ॥ పెండ్లి చేయంగ దలచియు బెద్దలెల్ల
గన్యకారత్నమును జూడ గా దలంచి
యామె యుపలక్షణ సులక్ష ణాదులెల్ల
సరసి నిశ్చయ పఱచెద రనఘ చరిత॥ 99

## కన్యా దుర్లక్షణములు

సీ॥ కపిల వర్ణంబుది. గౌరవర్ణయును, బొం
దర పర్ణ, పింగళ నయ నయుగళి,
యరుణేక్షణయు, స్థూల హస్త పాదయు, ఛిద్ర
శ్యావదంతయు, రోగి, శ్మశ్రు వక్త్ర,
పురుషాకృతి, కరాళ ముఖియు, పార్ష్ణి స్థూల,
దీర్ఘజంఘయు, నతి దీర్ఘ, కృశయు,
సతి లోమ, హ్రస్వయు, వ్యంగాంగి, క్షామ, వి
కే, శాతకేశయు కేకరాక్షి,
పింగాక్షియును, కృష్ణ, పింగళ, వృత్తాక్షి,
అధికాంగి, న్యూనాంగి, యధికలోమ,
సక్షత్ర పర్వత వృక్ష నదీనామ,
భీషణనామయు భిన్న దశన॥

గీ॥ ఘర్ఘరస్వన, నిర్లోమ, కా కరుతయు,
బంధుహీన, భృకుటి యుగ, భ్రాతృమాతృ
హీన, లంబభృవయు, వంశ హీన, యైన
కన్య నుద్వాహ మొనరింప గాదటండ్రు॥ 100

## కన్యా సులక్షణములు

సీ॥ రాకేందు వదన, బ ర్హసుకేశి సుభ్రువ,
ఇందీవరాక్షియు, గుందరదన,
సుక పోలయుగ్మ, చం పకనాస, బింబోష్ఠి,
కంబుకంధరియు, శ్రీ కారకర్ణ,

నవ్యకోకస్తని, నాళిక బాహయు,
సారసపాణి, న క్షత్రనఖర,
యావర్తనాభ, పం చాననమధ్య, చ
క్రశ్రోణి, రంభోరు, కమఠ పాద॥

గీ॥ కోకిలస్వన, శుకవాణి, కోమలాంగి,
హంసగామిని, సుందరి యైన, యువతి,
యీడు, జోడును, బుద్ధియు, నెంచి, పెండ్లి
యాడగా వలె నని పెద్ద లందురయ్య॥ 101

## వరలక్షణములు

గీ॥ విద్యయును దేహకాంతియు విత్తమును వ
యస్సు కులమును శీల తా న్యోన్య సమత
యును బరీక్షించి కన్యక నొసగవలయు
ననుచు బెద్దలు సెప్పుదు. రనఘ చరిత॥ 102

గీ॥ కనకమును గీటు వెట్టుట కాల్చుట తెగ
గొట్టుటయు దెబ్బవేయుట యెట్టినాడె
మో; వరుని గుణ కుల శీల ములును గర్మ
నెంచి యాపైని కన్యక నీయదగును॥ 103

సీ॥ హనువులు నాస స్త నాంతర లోచన
బాహువుల్ దీర్ఘమై పరగువాని,
జంఘికల్ జిహ్వా ప్ర జనన పృష్టంబులు
హ్రస్వంబులైయున్న యట్టి వాని,
త్వ క్కేశ నఖర దం తాంగులపర్వముల్
సూక్ష్మంబులై పాడ చూపు వాని,
ఘ్రాణ వక్షస్కంధ కక్ష కు క్ష్యళికము
లున్నతంబులుగాగ నొప్పువాని,
హస్త పాద నఖ జి హ్వాధర తాలు నే
త్రములు రక్తిమములై తనరువాని,॥

గీ॥ నొసలు శిరము విశాలమై యొసగువాని,
పొక్కిలియు సత్వమును స్వరం బును గభీర
ములుగ నొప్పెడు వానిని బురుషలక్ష
ణాన్వితు గనెంచి కన్యక నగునొసంగ॥ 104

# వివాహ ప్రారంభము

గీ॥ హస్త మూల త్రియుత్త రాం త్యానురాధ
స్వాతి మృగ రోహిణీ మఘ ర్క్షముల, సోమ
సౌమ్య గురుశుక్రులను, తులా చాప మీన
కర్కటక వృషభ మిధున కన్యకల, నిరు॥ 105

గీ॥ మూడునై దేడు పది పదు మూడును బది
యేను పదునొకండు తిథులః నే డిట శుద్ధి,
యిరువదొక్కటౌ దోషంబు లెనయకున్న
బెండ్లి సేయంగ శుభమగు విశ్వమునను॥ 106

గీ॥ చైత్రమున కుజ, మాధవ జ్యైష్ఠ్య ముల ధ
నంబు శుచి నభో నభ స్యాశ్వి నంబులనున
పుత్రి, తోర్జ నాయుక్షీణ ముస్సు, సహ సహస్య
ముల దుఃఖమును త పోం త్యముల నాయు
వును సిరి యనామయము బెండ్లి కొసరు నంద్రు॥ 107

గీ॥ అంత బెండ్లికి బెద్దలు నైన పెండ్లి
కొడుకు తలిదండ్రు లాపెండ్లి కూతు తల్లి
దండ్రు లాయంకురార్పణ తగనొనర్చి,
వృద్ధియనౌ శ్రాద్ధమును చేసి యెలమితోడ॥ 108

గీ॥ నాల్గు రాత్రులు నవి పూజ నము లొనర్చు
చును వివాహ మహోత్సవం బునునొనర్తు
రద్ది గార్హస్త్యముకు ముఖ్య మైనదగుట
స్మార్త పద్ధతి నద్దాని జరుపుదు రెగి॥ 109

గీ॥ అంత బెండ్లీ కొమారుండు నా వివాహ
మంటపమున జతుస్తంభ మండితంబు
సకల శృంగార భరితంబు చౌకపౌ వి
వాహ వేదికయందు సు త్సాహమొప్ప॥ 110

గీ॥ వరుడు బెండిలిపీటపై బ్రాఙ్ముఖుండు
నగుచు గూర్చొని ముందు గ ణాధినాధు
నర్చనమొనర్చి, పుణ్యాహ మాచరించి,
శాకునాదిక మంత్రముల్ జపమొనర్చి॥ 111

గీ॥ కాళ్లు గడిగికొని యును సం కల్పమాచ
రించి. రక్షను గుడిచే ధరించి, మామ
గారిచే నీయఁబడినట్టి కనక యజ్ఞ
సూత్రమును వామభుజమున సొంపుమీఱ
దాల్చి, కన్యను వరియింప దక్షణంబ॥ 112

గీ॥ మంచి బుద్ధియు విత్తంబు మంచినడత
సౌహృదత కార్యసఫలత సాంఘికతయు
శ్రేష్ఠతయు వైదికత గల సత్పురుషుల
నైదుగురి గన్యనడుగగా న నుపునెడను॥ 113

గీ॥ అంత నందు గన్యాదాత లైన కన్య
తల్లిదండ్రులు స్నానముల్ దగనొనర్చి,
గణపతిని గొల్చి, మాంగల్య గౌరిపూజ
పెండ్లికూతుచేత నొనరిం పించి యపుడు॥ 114

గీ॥ అంత వరుణులు గ్రహియించి నట్టివార
లైదుగురు కన్యాదాత యంతికమున
కేగి ప్రత్యఙ్ముఖస్థులై వేగ గన్య
నడుగు నంత కన్యాదాత యనుమతించి॥ 115

గీ॥ అయ్యలార! యన్నుల మిన్న యైన నాదు
యనుగు గూతుని సుందరు డైన వరు న
కిచ్చెదనని ముమ్మాటికి నచ్చ జెప్ప,
నంతట బ్రధాన మనునది యాచరింతుర॥ 116

గీ॥ అప్పుడా వస్తురూపిణి యైన లక్ష్మి
పూజగావించి, నగలను బుత్రికకిడి,
తల్లి దండ్రులు గన్యయు దక్షిణకంబు
రక్షలను గట్టుకొని వేగ రంబు వెడలి॥ 117

గీ॥ అంతలోన గన్యాదాత లా వివాహ
వేదిపై బ్రాఙ్ముఖత నుప విష్టులగుచు
వరున కొకకూర్చ పీఠము పైని వేసి
పళ్లెమును నీళ్ల చంబును బట్టుకొనియు॥ 118

గీ॥ పల్లెరంబున నల్లుని పదము లునుప
భార్యనీర్వోయగా గుడి పదము ముందు
కడిగి, పిమ్మట నెడమకా ల్గడిగి తజ్జ
లంబు నిరువురు శీర్షంబు లందుదాల్చి॥ 119

గీ॥ మంటిపాత్రను నకతల్ మలపి యర్ఘ్య
మిచ్చి, దధి గుడ మధుపర్క మిడియు, గోవు
దానమిచ్చి యన్నము సూప దాని వరుడు
మంత్రణ మొనర్చ నిరువుర మధ్యముననుः॥ 120

గీ॥ తెరను బట్టించి, కన్యకం దెచ్చి వేఱు
పాత్ర లో యందున బియ్యము పైని యామె
తాతయో తండ్రియో యన్న జ్ఞాతులో జ
ననియో యుంచి సంకల్ప మును వచించి॥ 121

గీ॥ పంచభూతముల్ సర్వదే వతలు సాక్షి
కముగ సాలంకృతయు సాధ్వి విమలయైన
కన్య ధర్మార్థ కామముల్ గడపు కొరకు
శీలయుతుడగు నీ కొప్ప జెప్పితి నన॥ 122

గీ॥ స్వస్తియని పెండ్లి కూతురి హస్తమంద
మామవల్కను ధర్మార్థ కామములను
నిన్ను గూడియె యీకన్య నెఱపుచుండు
ననిన, నే నట్లు నడచెద నను నువరుడు॥ 123

గీ॥ అంత బ్రాహ్మిక బఠియించి, యాలు మగల
నొసళులను జీరకయు గుడ ను సవరించి,
తెఱను బైకెత్తు నంతలో నిరువురొకట
జూచుకొనెదరు మోముల బోద్యముగను॥ 124

గీ॥ అపుడనామి కాంగుష్ఠము లందునొక్క
దర్భగొని కన్య బొమల మ ధ్యమున దుడుచు
నందున రుదంతియను దైత్య డమఱి వరుని
జంపునని దర్భతో వాని జంపు వరుడు॥ 125

గీ॥ అంత నిరువుర స్నానార్ధ మంపి, దర్భ
చుట్టి కన్యశిరంబుపై బెట్టి, దుక్క
క్క పూజు దక్షిణ బిలమును బొందుపఱచి,
యాబిలంబున స్వర్ణంబు నమరచియును॥ 126

గీ॥ నీటిధారను బిలమున నెగడజేసి,
వాసవు డపాల యనుకన్య స్వస్థపరచె
నటుల గన్యకు మార్జనం బలవరించి,
యోక్త్ర మంగల సూత్రంబు లొప్పుగాను॥ 127

గీ॥ పూజగావించి యక్షత ములను బంచి
మంగళాశీస్సు లొకట జె లంగుచుండ,
బెండ్లికూతుని యరుతను బెండ్లికొడుకు
కనక మంగళసూత్రంబు గట్టునంత॥ 128

గీ॥ యోక్త్రమను దర్భత్రాటిని యువతి నడుము
నందు గట్టియు, నంత శ్వే తాక్షతములు
దోయిళుల నింపికొనుచు వ ధూవరులును
క్షీరధార యుతంబులు జేసి, యపుడు॥ 129

గీ॥ వధువు శిరమున వరుడును వరునిశిరము
నందువధువును మూడేసి యావృతులుగ
నించెదరు, ప్రజ పశువులు మంచియజ్ఞ,
ఫలములు సమృద్ధియగు కోరి కలు దెలుపుచు॥ 130

గీ॥ అంత వరుడును ప్రాఙ్ముఖు డై వధువును
వామభాగంబు నందిడి బ్రహ్మముడులు
గట్టి, పెద్దలు నైదువుల్ గలిసి మిగుల
దీవెనల నొసగుదురు, స తీపతులకు॥ 131

## ప్రధాన హోమము

గీ॥ తొలుత సప్తపదంబులు ద్రొక్కజేసి,
యంతట బ్రధాన హోమంబు నాచరించి
సన్నెకలు ద్రొక్కజేసి, లా జలను వ్రేల్చి
యంత నగ్నిప్ర దక్షిణ లాచరించి॥ 132

గీ॥ మఱియు నపుడు జయాది హో మంబు, యోక్త్ర
మోచనము బ్రహ్మముడులు వి ప్పటయు జేసి
దీవెనలు బొంది వధువును దెచ్చి యింటి
నూతన గృహప్రవేశము జేతురయ్య॥ 133

## ప్రవేశ హోమము

గీ॥ నీదు మామయు నత్తయు నీదు బావ
మఱదులును నాదు బదుచులు మఱియు జ్ఞాతు
లెల్లరు ధనంబునుండె, నీ వెలమి తోడ
కర్తవై ప్రోచుచుండుము, కాంత: వారి॥ 134

గీ॥ అనుచు సర్వాధికారంబు నామెకిచ్చి,
హోమమును జేసి, సత్పుత్త్రు లుదయమంద
సుతులు పుట్టియు బొలిపోక బ్రతికియున్న
బాలకులలోన నొక్కని బట్టితెచ్చి॥ 135

గీ॥ పశువు నంకమునందిడి వానికి ఫల
దానమిప్పించి, పిదప గంధర్వపూజ
జేసి ధ్రువుని గనుగొని, యాశీర్వచనము
నందియు ప్రవేశహోమంబు బొందుపఱచు॥ 136

## స్థాలీపాకము

గీ॥ వెనుక తత్పత్ని చేతను బియ్యము నొక
పాత్రలో గడిగింపించి, పచన మొనర
జేసి, యగ్నిహోత్రునకును స్విష్టకృతున
కాహుతులొసచ్చి సమ్మతి దా యత్తుడగుచు॥ 137

గీ॥ ఒప్పమిఁ బ్రాజాపత్య హోమవిధియు,
సంత బర్హిస్సమంజన మాచరించి,
యును నవిజ్ఞాత నిష్కృతి యును నొనర్చి,
యగ్నికి బ్రదక్షిణత్రయ మాచరించి॥ 138

## ఔపాసనము

గీ॥ బ్రతిక సన్నాళ్లు విడుప కౌపాసనంబు
జేసెదనని సంకల్పము చెప్పి, భార్య
చేత బియ్యముగొని తన చేత బ్రేల్చి,
సాయమౌపాసనంబును జరిపియుంత॥ 139

గీ॥ అప్పుడాయనాజ్ఞాత త్రయంబు సెప్పి
యగ్ని ప్రార్థించి పన్నతు లాచరించి
ఫలములనొసంగి వారి దీవనలు బొంది
ఇటుల నాల్గుదినంబులు పటుతరముగ॥ 140

గీ॥ నట్టి యౌపాసనములు గౌర్యంబ పూజ
పంచపాలికారాధన భక్తి జేసి
మూడవదినంబున సదస్య మునునొనర్ప
బండితుల మిత్రవర్గము బంధువులను॥ 141

గీ॥ బిలిచికొని సభగావించి; విఘ్ననాథు
నష్టదిక్పతుల పంచబ్రహ్మలను శార
దాంబపూజించి సమ్మదాయత్తు లగుచు,
నప్పుడు పురోహితుడు కార్యమంతనడపి॥ 142

గీ॥ అగ్రతాంబూలమును దీసి, యార్యవరుల
పళ్లెరంబుల జెప్పించి బహుమతులిడి
యెల్లరకును సంభావన లిచ్చియంత
సభను చాలించెదరు, సదస్యంబు యిదియ॥ 143

## శేషహోమము

గీ॥ ముందు గంధర్వపురుముని బూజచేసి,
వానినుద్వాసన మొనర్చి తోన శేష
హోమమొనరించి మిగిలిన దువిదశిరము
నందు వ్యాహృతుల్ చెప్పుచు పొందుగనిడి॥ 144

గీ॥ వరునిమొగమును వధువును వధువుమొగము
వరుడు సూచియు బాత్రలో పలి ఘృతంబు
వరుని బొటమనవ్రేల నుంగరపువ్రేల
గొని యిరువుర హృదయముల నునిచికొందుర॥ 145

గీ॥ అప్పుడౌపాసనంబును నాచరించి
అగ్ని బూజించియును నపూపాదులనిడి
దంపతులు ప్రదక్షిణ జేసి తక్షణంబ
యగ్ని నుద్వాసనంబును నాచరించి॥ 146

గీ॥ అంత సంకల్పమును జెప్పి, యాలు మగల
కును సమావేశమును జేసి మనము లలర,
గొను విధిగ గర్భాధాన ఖండ చదివి
దీవెనల నిచ్చి పెండిలి దీర్తు రనఘ॥ 147

గీ॥ పెండ్లి నాలుగు దినములు విధిగ సలిపి,
నా క బలి వేసి, యంతట నలువుమీర
నీలమణి ధారణ మొనర్చి, నియమముగను
కంకణ విమోచన మొనర్చి కంకణముల॥ 148

గీ॥ నొండొరుల పట్టి, విడిపించి యుత్సవమున
గంధముల లందికొనియు. వ క్కలును నాకు
లిడికొనుచు నంత నుంగరా ల్దవి కొనుచు,
నా వసంతము లాడుదు రతి ముదమున॥ 149

గీ॥ అంత బాను పునందున నాలుమగల
జేర్చి యుయ్యాలలో బొమ్మ జేర్చి, యంద
లోవసంతము పోసి, యి ర్వుర పయినొగి
ధారగా దోగ చేతురు నారులంత॥ 150

గీ॥ అపుడు వరునకు, కన్యక నప్పగించ
నొక్క పళ్లెములో బాల నుంచి యందు
ముగుద హస్తము బాలలో ముంచి, వరుని
చేతిలోనుంచి, అయ్యా! ఈ చిగురు బోడి॥ 151

గీ॥ గొమరుపలె బెంచి యిపుడు నీ కునొసగితిమి
గాన స్నేహంబుతో నేలు కొనగదయ్యా,
అందుపై నత్తమామల కాపురలకును
గన్నె నప్పన చేతురు, కన్నవారు॥ 152

గీ॥ ఇది వివాహ మహోత్సవం బిటులదీర్చి
పిమ్మటను దంపతుల సతి ప్రేమతోడ
నేకముగజేయ మనముల నెంచి, శుభము
హూర్తమున బనస్సంధాన మొనరిచెదరు॥ 153

# సమావేశ గర్భాధానములు

గీ॥ శతభి షాంత్య త్రియుత్తర శ్రవణ హస్త
స్వా త్యనూరాధ రోహిణుల్, సౌమ్య సోమ
భార్గ వేద్యులు, ఘట వృష భ మిథు నాళి
కర్కి మీన తులా సింహ కన్య ధనువు,॥ 154

గీ॥ లేను పదియును రెండు మూ డేడు తిథుల
తను విశుద్ధి గర్భాధాన మునకు నొప్పు,
యామ్య మూ లాంత్య పితృవాస రాంత్యసార్ప
ములను, పాపగ్రహాక్రాంత ములను, నిధన॥ 155

గీ॥ జన్మ భాష్టమవిధు విష షష్ఠ్యములను
పాత పరిఘార్ధ వైధృతి పర్వ భూత
వ్రత పితృశ్రార్ధ సంధ్యల బగటియందు
పనికిరాదు గర్భాధాన మునకు నందు్రు॥ 156

గీ॥ ముందుగా బునస్సంధాన మునటుపైని
దంతుమతిహోమమును జేసి తత్ప్రవృత్తి
పగట నెరవేర్చ నంత ను భయుల మనము
లందు నెంతట సాయంత మౌనొ; యనుచు॥ 157

గీ॥ దలచు చుండగ బద్మ బాం ధవుడు దనదు
కాంతియంతయు బావకు కడను దాచి,
యపరవార్నిధి స్నానంబు నాచరింప
నేగెనన సాయమందున నినుడు గ్రుంక॥ 158

గీ॥ తనదు పరిపాలనంబున ధరణి గలుగు
ప్రాణి సముదాయ మానంద భరితమగుచు
నుండునను సంతసంబున నుడువిభుండు
నిర్మలంబుగ గనుపట్టె నింగియందు॥ 159

గీ॥ నూత్నదంపతులంతట నూత్నవస్త్ర
ములను ధరియించి యును పీఠ ములవసింప
రక్షలనుగట్టి వధువును దక్షిణనిడి
తమ్మల మ్ము లుభయులు హ స్తములబట్టి॥ 160

గీ॥ భార్య కుడి భుజమందున భర్తచేయి
భర్తయెడమ భుజంబున భార్యచేయి
జేర్చియును సమావేశము జెప్పనెడల
వారి యుత్సాహ మేమన వచ్చునపుడు॥ 161

గీ॥ అంతనొక నారికేళంబు నందు వక్క
లాకులు బసుపు దక్షిణ లమరిచియును
వధువు హస్తము సందుంచి వరునిహస్త
మందుపై నుంపించెడి యవసరమున॥ 162

గీ॥ నిండువేడ్క గర్భాధాన ఖండ జెప్ప
నంత హృదయంబు లొకటజ ల్లనగ బులక
లంకురముసెంద, బరవశు లై, నిరీక్ష
ణావశేషములునై కోర్కె లంకురింప॥ 163

గీ॥ అపుడు దంపతులకు వక్క లాకులు ఫల
దానములొసంగి, భర్తచే తను బ్రసాద
మారగింపించి, తచ్ఛేష మామెకునిడి
యుభయులును శుచి పంతులై యున్నతఱిని॥ 164

గీ॥ ఐదువు లుగొంప రుభయుల హస్తములను
బట్టుకొని మెల్లమెల్లగా బడకటింటి
లోనికిని దోకొనెడునంత లోపల ఫల
హారములు బాలు పెచ్చెద రతిముదమున॥ 165

గీ॥ సిగ్గుచే మో మువంచియు జేరవెరువ
కొమ్మరో; యెంత సిగ్గరి వమ్మ; నీవు
మోమువంచిన తలపులు మొలవకున్నె
కలసి సంతసె యూవ్రీడ నిలుచునమ్మ॥ 166

గీ॥ అనుచు బరిహాసమాడి, యయ్యంబు జాకి
సరగ దోతెంచి, యాతని దరిని జేర్చి,
యిరువురను బాన్పునందున నిరవు కొలిపి
దీవెనలొసర్చి, యయ్య: యూ తీవబోడి॥ 167

గీ॥ ముద్దరాలొట నేర్పుతో నద్ది, సౌఖ్య
మందుమూ; యని వాలెల్ల రంచు దరల
తలుపు వేసియు సెజ్జకు దార్చి, కలర
వా ను కూలస్వనంబున నంత విభుడు॥ 168

గీ॥ సాంత్వవాక్కుల నెంతయో సంతసంబు
తోడ నిట్టుల నక్కన్య తోడ బలుకు
జొనె; ముద్దులగుమ్మ; నీ యనుగ బలుకు
గౌంగిలింత లొసంగవె కాంత; యనియు॥ 169

గీ॥ పిలిచినను ముద్దులొలుకగా బలుకవేమి,
చురుకు చూపుల దలయెత్తి చూడవేమి,
అతి మధుర ఫలహారము లందవేమి,
ప్రేయసీ; విడెమైనను వేయవేమి॥ 170

గీ॥ ఇందు మన మిర్వురముగాక నెవరుగలరు;
సిగ్గు మది నూని మురిపంబు సేయదగునె,
ఇదిగొ మరు డంబకముల నా యెదను జొనిపె
ఊరకుండుట పాడియే వేరు చేసి॥ 171

గీ॥ అనుచు బలికిన గ్రే గంట నతని జూచి
మొలక నగవ్యాన నంబున గలుగుచుంటి
గనుచు ననుకూల సూచన యనుచునెంచి
పాలు ఫలహారములును దాం బూలమొసగి॥ 172

గీ॥ చందన మలందియును గళా స్థానములను
నంటుచును జెక్కిలిని ముద్దు లాడి, మరుని
చేతలకుదార్చి, కౌంగిటం జేర్చి, యపుడు
పంచ కృత్యంబు లొనరింప నెంచి కొనియు॥ 173

గీ॥ అంత నిర్వురునుం బలువింత లైన
కంతుచైవుల నెంతయో సంతసంబు
లంతరంబుల నొందియు మంతనమున
బంధనాదుల జరియింత్రు పలువిధముల॥ 174

గీ॥ పుడమి బ్రథమ సమావేశ మునను గలుగు
సౌఖ్యమనునది తలచగా స్వర్గతుల్య
మగుట నప్పటి యానంద మా యిరువుర
యాత్మలకె సాక్షి, మునిసువ్రతాభిధాన॥ 175

గీ॥ ఇద్దియ ప్రథమ సంస్కార మిటకుమున్ను
పుంసువనమాది సంస్కార ములను బదియు
నాల్గుచెప్పితి వింటివి నాన్న; కర్మ
లన్ని యారోగ్యసౌ ఖ్యాదు లంద జేయు॥ 176

క॥ తేరి మతాచార కులా
చార గృహాచార, శిష్ట సరణి యు దేశా
చార స్వవంశ పు స్వపురా
చారములని యెన్నియో ప్రచారములుండన్॥ 177

గీ॥ సంఘజీవనమును కొక్క సంఘ మిట్టి
కర్మలను గల్పించిరి గాని; వీని
నితరదేశీయు లంగీక రించలేదు
హిందువులలోన గొంత రెంతేని బలిమి॥ 178

గీ॥ చేతు, రైసప్పటికి శాస్త్ర రీతినుంట
నేను వాక్రుచ్చితిని యిది నిజము కాదు,
గాన యీపైని యౌవన గరిమ చెపుదు
సావధానుండవై విను, సద్గుణాఢ్య॥ 179

## యౌవనము

గీ॥ అట్టి బాల్యంబు గడచియు దిట్టమైన
యౌవనంబుద్గమించు, బ దారుకళలు
జంద్రునందున రాకను సాంద్రమైన
చందమున, దేహమందున నందమొప్ప॥ 180

గీ॥ కనులయందున నూతన కాంతి, దేహ
మందు గ్రొత్తనిగారంబు, నాననంబు
నందు నూనూగు మీసల చంద, మౌర;
యౌవనోద్గమమెంత యొ య్యారమ వని॥ 181

గీ॥ పరిఘములో, పంచవక్త్ర స ర్పములో, నాగ
తుండములో, యర్గళమ్ములో, తూండ్లో, యనగ
బరగుచున్నట్టి యాజాను బాహుయుగము
విసరుకొని సంచరించు నె వ్వోక బడమి॥ 182

గీ॥ చెట్టులెక్కను, లోతైన చెరువులీదు,
బరువు లిడుచుండు, గట్టిగా బాడుచుండు,
మంచివారల నొగి వెక్కి రించుచుండు
బలముగలవాడనని గర్వ పడుచునుండు॥ 183

గీ॥ సంగి డీలెత్తు, రోటాలు సాముసేయు,
పన్నిద ములాడు, దండీలు బట్టుచుండు,
విక్రమంబున గుస్తీలు వేయుచుండు,
లేనిపోని కయ్యంబు లె న్నేనిదెచ్చు॥ 184

గీ॥ ఇద్ది పుడ, మిద్ది యాకస, మిద్దిమంచి,
యిద్ది చెడ్డయు, జేయున దిద్ది, చేయ
రానిదిది, వినదగినది, మానదగిన
దనుచు నిసుమంత తలచరు యౌవనమున॥ 185

గీ॥ అంతలో గామమనునది యంకురింప
గామినులయందు మిక్కలి కాంక్ష గలుగ,
వారి రూప విలాసములే గోరిచూచి
మోహమగ్గలమున గొన్ని యూహసేయు॥ 186

ఆ॥గీ॥ ఎవరి నాశ్రయింతు, నెవ్వారి బుత్తెంతు,
నేమికాను కిత్తు, నెందునిలుతు,
నెంతలోన వచ్చు, నెక్కడ గలియుదు,
న నుచు రే బవళ్లు ననుకొను, మది॥ 187

గీ॥ మదన బాణాగ్ని తప్తుడై మది నిలుపక
యన్యకామినిపై యాస నరిగి, యందు
గొట్లు తిట్టులునుం జుట్టి కోతలాది
పెక్కుల వమానములకోర్చి పెచ్చురేగు॥ 188

గీ॥ అన్యకాంతలకన్న వా రాంగనాభి
రతియె యేయవమానము రాదటంచు
నెంచుకొని మెల్లగా నందు నేగి, వేశ్య
మాతనద్దియు నొగి దాని మాయ జిక్కు॥ 189

గీ॥ ఇంటి రొక్కము వెచ్చించి యింతి తాళి
బొట్టు గూడయు గొంపోయి దిట్టమైన
దేహదార్ఢ్యతచెడి, కడు దీనుడగుచు,
రోగములు బెక్కు గడియించి రోయడకట॥ 190

క॥ కడుపు వగిలియు వెలికిల గాను నూత
దేలు కప్పవడువునను దేజరిల్లు
యోనికై స్మరబాణార్తి నూని, జగము
కొంచెమైనను గాంచడు వంచకుడయి॥ 191

గీ॥ గండములు లోకమున బెక్కు కలవుగాని
యౌవనపు గండమును దాట నలవికాదు,
యందు యుక్త ప్రవర్తకు డై యశంబు
సంగ్రహించిన వాడెపో శంకరుండు॥ 1

సీసమాలికా

సీ॥ యౌవనంబునగదా యఖిల విద్యలు నేర్చు,
యౌవనంబున గదా యన్నిపనులు,
యౌవనంబున గదా యఖిల సత్కారముల్,
యౌవనంబున వ్యవ హారములును,
యౌవనమ్మునగదా యభినవోద్యోగముల్,
యౌవనంబునను సత్యవ్రతంబు,
యౌవనంబుననె శ తావధానంబులు,
యౌవనంబున సభా ధ్యక్షతలును,
యౌవనంబున సర్వ యంత్రనిర్మాణత,
యౌవనంబుననె శి ల్పాచరణము,
యౌవనంబుననె భార్యాసౌఖ్యమందుట.
యౌవనంబుననె దే శాటనంబు,
యౌవనంబునగదా యలఘు పుత్రులగంట,
యౌవనంబున పెద్ద లందు భక్తి,
యౌవనంబుననె దు ర్వ్యసనముల్వీడుట,
యౌవనమందునే యడకువయును,
యౌవనంబునగదా; యమలయోగంబులు,
యౌవనంబున దేవ తార్చనములు,
యౌవనంబునగదా యఖిలాపన్క్రియల్
యౌవనంబున సద్వ్ర తాచరణము,
యౌవనంబు నగదా యశముస్థాపించుట,
యౌవనంబున సత్క్రి యాచరణము,
యౌవనంబునగదా యతి శాంతవర్తన,
యౌవనంబునగదా యార్త రక్ష,
యౌవనంబునగదా యైకమత్యంబును,
యౌవనంబుననె ధ నార్జనంబు,

యౌవనంబునగదా యఖిలోపకారముల్,
యౌవనంబున మైత్రి తాచరణము,
యౌవనంబునగదా యస్తోకదానముల్,
యౌవనంబునను ద యాప్రవృత్తి,
యౌవనంబునగదా యభినవాచారముల్,
యౌవనంబున దైవ మందు భక్తి,
యౌవనంబునగదా యార్యాను మతచర్య,
యౌవనంబుననె దీ నావనంబు,
యౌవనంబునగదా యతి సౌమ్యవర్తన,
యౌవనత నృపద యాత్రలబ్ధి,
యౌవనంబుననె కా ర్యాకార్యభావన,
యౌవనంబున నీశ్వ రార్చనంబు,

గీ॥ యౌవనంబున సకల ధ ర్మాచరణము,
యౌవనంబున యోగాదు లభ్యసింపు,
యౌవనంబున నిత్యమో క్షాభిరతియు,
గాన యౌవనమునకన్న గలదె దివము॥

గీ॥ అందుచే యౌవనమునందె యఖిల సత్ప్రి
వర్తనాదుల దప్పక వ్యవహరించి,
ఇహపరంబుల సౌఖ్యంబు లెల్లనొందు
మార్గమున గమనించుటే మంచి, తండ్రి॥

గీ॥ ఇదియె యౌవన లక్షణ మిందుపైని
యౌవనమునందె జ్ఞానంబు నభ్యసింప
వలయు గావున, తత్త్వప్ర పంచవిధము
వలికెదను మునిసుపుత్రా; తెలిసికొనుము॥

## ప్రపంచోత్పత్త్యాదికము

గీ॥ ఓ మహాత్మ; విశ్వజ్ఞ; యీ యుర్వి మాన
వాళి దేహములందున నలరు తత్త్వ
సంచయం బెట్టులుండెనో; స ద యుడవయి
నాకు శలవీయుమా; గురు నాథ; యనుడు॥

గీ॥ సచ్చిదానంద మూర్తియు, శాశ్వతుండు,
నిర్మలు డసంగుడును, శుద్ధ నిర్గుణుండు,
స్ఫురదహంకార రహితుండు బూజ్యుడాఢ్యు
డప్రమేయు డచింత్యుండు నచ్యుతుండు॥ 197

గీ॥ అట్టి శ్రీ పరమేశు డనాది నీ ప్ర
పంచము సృజించి, ధరియించి మించి శక్తి
రజితమటు లీనమొనరించి రాజిలుచును
నుండె, నద్వైతమగు తత్త్వ మొండు జగతి॥ 198

గీ॥ అట్టి తత్త్వంబునందు ననాదియౌ య
విద్యయనుమాయ తొలు దొల్త విశదపడియు,
పిమ్మట ను సర్వశూన్యమై పెంపుదక్కు
శుక్తి రూప్య భ్రమన్ గడు బోధ్యముగను॥ 199

గీ॥ అట్టి మాయయె సర్వశక్త్యాత్మకమయి
మూడు గుణములు గలదయి, పుడమి మొదలు
నైదు భూతంబులను జేసి యట్టి భూత
పంచకముచే సృజియించు బ్రపంచమెల్ల॥ 200

గీ॥ శుక్తియందున వెండి రజ్జువున సర్ప
మటుల భ్రామిక మొప్ప, జ్ఞానావధిగను
తెలిసినంతనె భ్రాంతి యెట్టులను బాయు
నట్టుల బ్రపంచ మామాయ యందునడగు॥ 201

## త్రిగుణోత్పత్తి

ఆ॥గీ॥ అట్టి మాయయె త్రిగుణాత్మకమయ్యును
జనన పోష లయము లనునొనర్చు,
గుణము లెవ్వియనిన జను సత్త్వమును రజ
స్సును దమంబుననగ చనరు నివియ॥ 202

గీ॥ సత్త్వము తెలుపు సుఖమును జ్ఞానమూల
మగును, చంచల మెరుపు దుఃఖాస్పదంబు
నౌర జోగుణమును, జడ మసితము సుఖ
దుఃఖములకు సమంబయి దోచు దమము॥ 203

గీ॥ అట్టి త్రిగుణాత్మకంబైన యట్టి శక్తి
విశ్వరూపంబు చేతను విస్తరిల్లి,
భ్రామికము గల్గ జేసి, య నామికమయి
లీనమగుచుండు నాత్మలో లీలనదియ॥

గీ॥ అట్టి యాత్మను నాకస మాది పంచ
భూతములు వుట్టి యవ్వియే భూతకోటి
రూపమునునూని, యోషధీ రూపమూని
స్త్రీపురుష గర్భములయందు జేరి, యంత॥

గీ॥ జఠరవహ్నిని నవ్వి ప చనమునయ్యు,
స్నాయుమజ్జాత్వగస్థి మాం స రుధిరములు
నాగ షట్కోశములు బరి ణతివహించి,
స్త్రీ పురుషగర్భములయందు జేరికొనును॥

గీ॥ అట్టి షట్కోశయుత దేహ మందు శుక్ల
శోణితంబులు ననురెండు చోద్యముగను,
ఋతురతులయందు వెడలియు నతులమౌ జ
రాయుకోశమునంజేరి చిత్రగతిని॥

## పితృమాతృ జన్యములు

గీ॥ దేహ రూపము వహియించి దీప్యమాన
మగుచు, నద్దేహమున మాత యంశవలన
జర్మమును రక్త మాంసముల్, జనకువలన
నెమ్ములును మూలుగులును న రమ్ములొదవు॥

## ప్రత్యేక మాతృజన్యములు

గీ॥ ఇంక మిక్కిలి మృదువులై యొసగు మెదడు
రక్తమాంసముల్ క్రొవ్వు న రములగుంపు
గుండెలును నల్లమాంసము గుదము ననెడు
నవి జనని వల్లనుత్పన్న మవు, దను వున॥

## ప్రత్యేక పిత్రుజన్యములు

గీ॥ వెండ్రుకలు మీసలును దల వెంౘ్రుకలును
స్నాయువు ధమనులు శిరలు నఖర దంత
ములును శుక్లమాది స్థిర ములు జనకుని
వలన నుత్పన్నమగు దేహ ములను వత్స॥ 210

## రస జన్యములు

గీ॥ దేహధర్మము బలమును వృప్తి వృద్ధి
సంతసము రంగుగలుగుట పక్తిలేమి
యెప్పటివలె నుండుట మొద లివ్వియెల్ల
రసమువలనను గలుగు ధ ర్మములు దండ్రి॥ 211

## ఆత్మానుసార జన్యములు

గీ॥ తలపు కోరిక ధర్మ మ ధర్మమును సు
ఖంబు దుఃఖంబు దగు ప్రయ త్నంబు వస్తు
భావనయు జ్ఞాన మాయువు బలము నింద్రి
యములు నాత్మానుసార జ న్యములు, వత్స॥ 212

## షణ్ణవతి తత్వనిరూపణము

గీ॥ ఇట్టి దేహంబునందున నెంతొ వింత
దసర దొంబదియారు త త్వము లుగలవు
యవ్వియెల్లను నేకమై యవయవంబు
లింద్రియాదులునై దేహ మెసగుచుండు
వాని వివరము మంతయు బలికెదవిను॥ 213

సీ॥ పంచ భూతంబులు, బది యింద్రియంబులు,
సనిలముల్పది, విష యములు బదియు,
నారుచక్రములు, రా గాదులెన్మిది, చతు
రంతఃకరణ, లూర్మ లారు, సప్త
ధాతువుల్, నాడులు దశకంబు, మఱి యు మం
డలములు మూ; డీష ణత్రయంబు,
మూడుగుణంబులు, మూడవస్థలు, దాప
ములు మూడు, నా కోశ ములు నునైదు॥

గీ॥ దగియు దొంబదియారు త త్వములు నింక
ద్వాదశ మలముల్ షోడశా ధారములును
గలిగి మానవదేహంబు వెలయుచుండు,
దీని మర్మమె తప్పక తెలియనగును॥ 214

గీ॥ ఓ మహాత్మ; విశ్వజ్ఞ; ని యుక్తమైన
షణ్ణవతి తత్వసమితి యే సరణి దేహ
మందు బరిణతినొందెనో యట్టి వివర
మానతీయుము నాకు ద యా యుతుడయి॥ 215

గీ॥ అనిన మునిసుపుత్రుని గను గొనుచు ముందు
పంచభూత విధానంబు వలికె ద విను
మవని జల మగ్ని వాయువు నాకసమన
బంచభూతంబులివి యన బరగు, వత్స॥ 216

గీ॥ ఇవ్వి దేహంబునందున నెటులబరిణ
మించి వెలుగొంది చుండెనో యంచితముగ
వాని వివరణ మంతయు వరుస తోడ
వినిచెదను, సుస్థిరుండవై వినుము తండ్రి॥ 217

## పంచభూతములవలన జతుర్వింశతితత్వోత్పత్తి

సీ॥ ఆకస మందు బ్రా ణానిలమును జెవుల్
వాయి జ్ఞానంబు శ బ్దంబు పుట్టె,
వాయువునన్ వ్యాన వాయువు స్పర్శ చ
ర్మంబును గాళ్లును మనసు పుట్టె,
అగ్నియందు నుదాన మక్షులు రూపంబు
హస్తముల్ బుద్ధియు నవతరించె,
వారియందు సమాన వాయువు నాల్కర
సమును బాయువును జి త్తము జనించె॥

గీ॥ భూమియందు నపానంబు ముక్కుపరిమె,
ళం బహంకార మున్ను శి శ్నంబు వొడమె
ని వియసూ భూతపంచక మువలన దను
వందునున్నట్టి తత్త్వము లయ్యెబుత్ర॥ 218

## పంచతత్వాధి దేవతలు - స్థానములు - వర్ణములు

సీ॥ పుడమి పసుపువన్నె కడ పిక్కలందుండు,
నా సదాశివమూర్తి యాధిదైవ,
ముదకంబు వెలుపునై యూరువు లందుండు,
నీశ్వరుం డధిదైవ మెసగుచుండ,
నగ్ని యెరుపువన్నెయై కడుపునముండు,
నధిదైవతము రుద్రుడై వెలుంగ,
వాయు భూతము ధూమ్ర వర్ణమై కంఠంబు
నందుండు విష్ణువు యాధిదైవ॥

గీ॥ మాకసము నీలవర్ణమై యలరి ముఖము
నందునుండును బ్రహ్మయే యాధిదైవ
మగుచునీరీతి భూతము లవయవాదు
లందు గలవని తెలియుమో యయ్య; నీవు॥ 219

### పంచ భూతతత్వములు

సీ॥ భూమియనన్ బంచ భూతంబులందు బ్ర
ధానమై యొప్పు భూ తంబుగాన
శబ్దంబు స్పర్శతే జంబు రసంబును
నాల్గింటి గలిసి గంధంబునూని
షడ్రసంబులు రత్న సమితి లోహంబులు
నోషధు లద్రులు నుద్భి జములు,
నండజముల్ స్వేద జానీకము జరాయు
జములు మొదల్ భూత సముదయంబు॥

గీ॥ బుట్ట జేసియు నభివృద్ధి బొందజేసి
లీనమొనరింపుచును బెన్ని ధాన మయ్యు
నన్నిటికి ముఖ్య మాధార మై యెసంగు
చున్నదిగదయ్య; యో లోకమం దెన్నికగని॥ 220

గీ॥ భూమివలన ఘ్రాణేంద్రియ మునగు ముక్కు
వాసన గ్రహించుటయును, గౌర వంబు ధైర్య
మును స్థిరత్వము ననునివి మొనసియుండు
దేహమందున ననుచును దెలిసికొనుము॥ 221

గీ॥ పుడమిలో భూమి యెమ్ములు, బుడమియందు
నప్పు మాంసము, తేజము నయ్యెనాడు,
లనిలమే చర్మమయ్యెను, యాకసంబు
వెంద్రుకలు నయ్యె, దనువున వినుము, వత్స॥ 222

గీ॥ అవని యం దోషధులు నందు నన్న మట్టి
యన్నము బచనమై మల మగును, మధ్య
భాగమే మాంసము, గనిష్ఠ భాగము మన
మగుట నన్నమ యము మన మంద్రు పుత్ర॥ 223

## జలతత్త్వము

సీ॥ జలమనునది నాల్గు గలదగు రసము రూ
పము స్పర్శశబ్దముల్ బరగి, యందు
రసము ప్రధానమై ప్రాణాత్మ కంబయి
జీవనాధారమై శిఖిని గనియు,
గాయంబునందు గం గా యమునా సర
స్వతుల మాదిరిగను బరిణమించి,
భూప్రదేశమున స ముద్రములట్టుల
నదులు బాతాళంబు నం దనర్చు॥

గీ॥ వాహినులు దేశమందున వరలు ద్రవప
దార్థములు షడ్రసంబులు నైత్రిలోక
ములను బ్రాధాన్యమై ప్రాణ మునకు మిగుల
బలమొసంగుచు సర్వదా బరగుచుండు॥ 224

గీ॥ జ్యోతు లమృతంబు భూర్భువ స్సువము లన్న
మన్ని భూతములు యజుస్సు బ్రాణమును వి
రా ట్స్వరా ట్ఛందములును స మ్రా ట్ప్రణవము
సర్వదేవతల్ బశువులు సత్యమును స
మస్త ముదకం బటంచు నీ మదిని దెలియు॥ 225

గీ॥ ఉదకమువలన నాలుక యును, రుచింగ్ర
హించుటయు స్నేహభావంబు నెసగుటయు జె
మర్చుటయు శీతలత గాత్ర మార్దవంబు
ద్రవముగలుగుట మొదలగు నవి చెలంగు॥ 226

గీ॥ అట్టి యుదకమునను దొడ్డ యంశ మూత్ర
మున్ను మధ్యమాంశము రక్త మును, గనిష్ఠ
భాగము శరీరమందున బ్రాణమయ్యె,
నందుచే బ్రాణము జలాత్మ మయ్యె దండ్రి॥ 227

గీ॥ అప్పులో భూమి రక్తము నయ్యె నుదక
మందు నుదకంబు వీర్యము నగ్ని మూత్ర
మందు వాయువు సెమటయు నాకసంబు
సొంగయయ్యెను తనువున సుగుణ ధుర్య॥ 228

## అగ్నితత్త్వము

సీ॥ అగ్ని యనెడు భూత మలరు రూపము స్పర్శ
శబ్దంబులను మూడు సంగ్రహించి,
య నిలంబునంబుట్టి యప్పుల సడగియు
గాష్టాదులందున గ్రాలుచుండి,
నాభి కూర్ధ్వమున గం ఠమునకు దిగువున
గల హృదయంబున నిలిచి, పొట్ట
వెలసి డెబ్బదిరెండు వేలనాడుల దన
వేడిమిన్ బ్రసరించి వివిధవస్తు॥

గీ॥ పచనమును జేయుచుండియు, భానుచంద్రు
లటుల గంటిక దృష్టిని నలవరించి;
సకలము గ్గ న జేసెడి శక్తి గలిగి
వెలయు చుండునుసుమ్మ; వి వేకశీల॥ 229

గీ॥ అగ్నివలనను గన్నును నన్నిరూపు
లరయుటయు వెల్గుటయు గోప మాపమియు, బ
రాక్రమము దేహకాంతియు నన్ని పచన
మోజ మేధస్సు తాప శౌ ర్యోద్గమములు
శుష్కభావంబు వేడిమి చొప్పలవడు॥ 230

ఆ॥గీ॥ అగ్నియందు బుడమి యాలస్యమయ్యెను,
అందునీరు కాంతి యయ్యె, నగ్ని
యాకలియును దాహ మయ్యెను వాయువు
నాకసంబు నిద్ర యయ్యె వత్స॥ 231

గీ॥ అగ్నిలో బెద్ద భాగము నయ్యె యెమ్మొ,
లందులో మధ్యభాగము నయ్యెగ్రొవ్వ,
నందులో జిన్న భాగంబు నయ్యెవాక్కు
నందుచే వాక్కుతేజో మ యంబు బుత్ర॥ 232

## వాయుతత్త్వము

సీ॥ వాయువనెడు భూత మీయుర్వి స్పర్శయు
శబ్దంబు నమరెండు సంగ్రహించి,
ప్రాణమాదిగ దశ వా యువు ల్గా మించి,
సర్వేంద్రియములకు శక్తినొసగి,
నోటిచే మాటలు నుడివించి, చేతుల
బనులన్ని జేయించి, పాదములను
నడపించి, గుదముచే విడిమర గావించి,
లింగమునకు దృఢ తేప్యమొసగి॥

గీ॥ తనువునందున దాకుడుః గనుల రెప్ప
లార్చుటయు, దావులీనుట లావరింత,
తుమ్ముటయు, నీల్గుటయును శ బ్దమ్ము వినుట
మొదలు నెన్నేని శక్తులను దగు వత్స॥ 233

గీ॥ వాయువువలన జర్మము స్పర్శగనుట
నడచుటయు వంచివేయుట ముడిచికొనుట
చాచుటయు గతిసత్వము సకలమైన
ఇంద్రియప్రేరణంబును నెసగువత్స॥ 234

గీ॥ అనిలమున భూమి చలనము నయ్యె, ననిల
మందు నుదకము గమనము నయ్యె, నగ్ని
మండుటయు, బరువెత్తుట యొప్పె, గాలి,
యాకసము విస్తరించుట యయ్యె బుత్ర॥ 235

## ఆకాశతత్త్వము

సీ॥ ఆకస మనునది యలరు శబ్దంబున
నట్టి శబ్దము నాత్మ యందు నెపుడు
దశవిధనాదముల్ దనరియు, నోంకార
మందు ప్రాధాన్యమై యణిఁతమగు

మృగపక్షి రుతములు మగ నారులస్వనంబు
మేఘ నిర్ఘోషంబు మృదులమైన
వల్లకీస్వనము ష ట్పద జేంకృతంబును
మణితాదికంబు గిం కిణీ ర వంబు॥

గీ॥ సర్ప ఫూత్కారమును వాయు ఝాంకృతంబు,
మొదలుగాగల శబ్దంబు లదనునందు
శ్రోత్రములకెరుకగునట్టి సూటిదెలుపు
చుండును గదయ్య; యోముని సువ్రతార్య॥ 236

గీ॥ ఆకసమ్ము వలనను ధై ర్యమ్ము; సెవియు
శబ్దమును మాటలాడెడు శక్తి మిగుల
తేలికయు వైచిత్ర్యము తెలివి, మొదలు
నెన్నియో కల్గుచుండును కన్నతండ్రి॥ 237

గీ॥ ఆకసంబున బృథివి భ యంబు నయ్యె
నభమునను నప్పు మోహము నయ్యె నగ్ని
క్రోధమును, గాలి కామమై కోరలు, నాక
సంబు శోకంబునయ్యె, ని శ్చయము పుత్ర॥ 238

## సగర్భ ద్రుతవిలంబిత కంద గీతచంపకము

చ॥ పురహర; శంకరా; కనక
భూధరకార్ముక; కామహారి; త
త్పురగిరిజా; హరా; వినుత
బంధుర; విశ్రుత విక్రమాఢ్యకి
న్నర నర రక్షణా మునిజ
నాదర పూజిత; ముక్తిదాయి; త
స్కర హరణా; సదా యనిమి
షాత్మ విహార; మహాఘ నాశనా॥ 239

## గర్భద్రుత విలంబిత వృత్తము

వృ॥ కనక భూధర కార్ముక; కామహా
వినుత బంధుర విశ్రుత విక్రమా
మునిజనాదర పూజిత ముక్తిదా
యని మిషాత్మవి హార; మహాఘనా॥ 240

## గర్భబకందము

క॥ హర; శంకరా; కనక భూ
ధరకార్ముక; కామ హరి; తత్పురగిరి జా
నరరక్షణా; మునిజ నా
దరపూజిత; ముక్తిదాయి; తస్కరహరణా॥

## గర్భగీతము

గీ॥ కనక భూధరకార్ముక; కామహారి;
వినుత బంధుర విశ్రుత విక్రమాఢ్య;
ముని జనాదర పూజిత; ముక్తిదాయిః
యని మిషాత్మ విహార; మ హాఘనాశ॥

## నాగబంధము

చ॥ భవహర; వామదేవ; శివ
పావన; శర్వ! మురారి వందితా
భువన సుతప్రభావ; పరి
పూరిత దుర్దమ పాపనాశనా
ది విభరి తాకృతీ; వ సుమ
తీ మదు దగ్రప్రచార సాదుకా;
భువనప; శే ముషీవి తత;
భూతప' దివ్యకృపాను మోదకా॥



ఇది

ప్రౌఢసరస్వతి – స్మార్తసింహ – నూత్నమస్కరి

చేవూరి వేంకట సోమసుందరశాస్త్రి

విరచిత మానవజన్మ అను

జ్ఞానదీపంబున

తృతీయోల్లాసము

ఓం తత్సత్ శ్రీ మత్పర బ్రహ్మార్పణమస్తు॥ శ్రీ

ప్రౌఢసరస్వతి గ్రంథమాల మేనేజరు

పంచవృత్తుల పురోహితులు

కవికుమార్ **చేవూరి భానుమూర్త్యాచార్య (శ్రీమూర్తి)**

బుక్కావీధి, విజయనగరం-2.

—○○○—

చతుర్థోల్లాస ప్రారంభము

## ప్రత్యేక పంచభూతతత్త్వములు

గీ॥ చర్మమును వెంట్రుకలును మాం సంబు నాడు
లెమ్ములును భూమి తత్త్వమై యెసగుచుండు
మూత్రమును శ్లేష్మమును రక్త మును చెమటయు
వీర్యమును జలతత్త్వమై వెలయు, పత్స॥ 1

గీ॥ ఆకలియు మైథునంబు మో హంబు నిద్ర
దాహమనునవి యగ్ని త త్త్వంబులయ్యె,
స్థూలతయు జలనమును ను న్మీలనము ని
మీల నోల్లంఘ నంబులు గాలి గుణము॥ 2

గీ॥ భయము గామంబు క్రోధ లో భములు డాంబి
కంబు నా కాశ తత్త్వమై క్రాలుచుండు,
ని వియె పంచతత్త్వంబుల నెసగు పంచ
కములు దేహంబునందున గలవి తండ్రి॥ 3

గీ॥ భూతపంచక మీ దేహ మున ని టువలె
పరిణమించె నటంచును బలికితి, నిక
నింద్రియ దశం బదెట్టిదో యెరుగజేతు
సావధానుండవై విను, సద్గుణాఢ్య॥ 4

## దశేంద్రియములు వాటి విషయములు

గీ॥ ముక్కు నాలుక కను చర్మ మును జెవియును
నైదు జ్ఞానేంద్రియంబులు ననగ నొప్పు,
వాయి కాల్సేయి పాయు వు పస్థలనెడు
నైదు కర్మేంద్రియంబులు ననగ దనరు॥ 5

గీ॥ వాసనయు రుచియును దృష్టి స్పర్శ శబ్ద
ములును జ్ఞానేంద్రియ విషయ ము లననొప్పు
పలుకు నడ యీవి విడుపును గులుకనంగ
నైదు దగుచుండు, గర్మేంద్రి య విషయములు॥ 6

గీ॥ ముక్కునకు వాసనయు రస మును రసనకు
దృష్టి కంటికి దాకుడు కృత్తికిని వి
నికిరి చెవికిని స్ఫుటముగా బ్రకటమగుట
చేత జ్ఞానేంద్రియములని చెప్పబడియె॥ 7

గీ॥ నోటికిని బల్కు పుచ్చికొ నుటయు నీగి
చేతికి, నడకాలికిని వి సృతి గుదముకు
సంతసము లింగమునకును చైయ్యులగుట
చేత గర్మేంద్రియములని చెప్పబడియె॥ 8

గీ॥ జ్ఞాన కర్మేంద్రియముల సం జ్ఞలు గలట్టి
దశకమును విషయంబులు తగులువలన
దెలివి చైవులు గలిగె హ ల్లులకు నచ్చు
లంట శబ్ద ప్రపంచ మై నటుల దంద్రి॥ 9

గీ॥ ఆర్య! యా జ్ఞాన కర్మేంద్రి యప్రవృత్తి
యెట్టిదో దాని వివరింపు మియ్యెడనని
వేడు మునిసువ్రతాఖ్యుని తోడ దయను
బలుకు విశ్వజ్ఞముని తేనె లొలుకు నటుల॥ 10

## జ్ఞానేంద్రియ విషయములు

గీ॥ చందనము గప్పురంబును సాంకవమ్ము
మల్లికలు జంపకంబులు నుల్లి తెల్ల
యుల్లి పూతి విస్రాదుల యొరపు దెలియు
గంధగుణ ముండుటంబట్టి ఘ్రాణమెపుడు॥ 11

గీ॥ తేనె మావిఫలంబులు తెలికపిండి
కరకకాయలు తిప్ప తీ గయును మిరియ
ములును నుప్పునగలుగు చ వులను దెలియు
రసగుణంబుండుటంబట్టి రసన కుజ్ఞ 12

గీ॥ తెలు పెరుపు నలుపు కురుచయు దీర్ఘములును
పెద్ద చిన్నలు చీకటి వెలుతురియును
దూరమును దగ్గరయు బోల్కె తోచుచుండు
తేజగుణముంట కంటికి ఛ ప్రకాశ॥ 13

గీ॥ శీతలత వేడిమియు నెత్తి చీమకుట్టు
యూగె వ్రాలుట కండుపు యూదతాకు
గౌంగలింతను గలుగు సౌ ఖ్యంబు దెలియు
స్పర్శగుణముంట చర్మకు సద్గుణాఢ్య॥ 14

గీ॥ పాట యేడుపు గోమృగ పక్షి రుతము
స్త్రీ పురుషకంఠ భేదము తీవ్ర సూక్ష్మ
నాదములు లోని ప్రణవంపు నాదమును గ్ర
హించు చెవి శబ్దగుణముంట నిద్ధ చరిత॥ 15

గీ॥ ఇవ్వి జ్ఞానేంద్రియంబుల నెసగు విషయ
సమితియని తెలిసి కొనుమోయి సద్గుణాఢ్య!
ఇంక కర్మేంద్రియంబుల నెసగు విషయ
సమితి దెలిపెద వినుమయ్య; సాధుచరిత॥ 16

## కర్మేంద్రియ విషయములు

గీ॥ విశ్వకరు నామమహిమంబు వివిధవేద
ములు నసత్య సత్యంబులు తులువపలుకు
లిచ్ఛకంబులు దీవెన లెల్ల భాష
లాడు చుండు నోర్వాగ్విష యంబుగలిమి॥ 17

గీ॥ శివుని పూజన లెన్నేని శిల్పములను
నక్షరంబులు వ్రాయుట యందికొనుట
యిచ్చుటయు గుబ్బెతల గౌంగ లించు కొనుట
కరములకు విషయంబులై క్రాలుచుండు॥ 18

గీ॥ దేవతా స్థానములకును దేశదేశ
యాత్రలకు వనములకును మిత్రగేహ
ములకు సభలకు మఱి యజ్ఞ ములకు నేగ
గలిగె గాళ్లకు విషయంబు గమనముంట॥ 19

గీ॥ ప్రాణవాయు సమంబాయ పానవాయు
వన్న పిష్టంబునౌ మల మనెడు దాని
బైకి వెడలించుచుండును భద్రముగ వి
సర్జనంబను విషయ మా పనము కుంట॥ 20

గీ॥ చానలకు బురుషులకు నుప స్థయను నింద్రి
యంబు నన్యోన్య సంగమ మందుగలుగు
సౌఖ్యమున మిక్కిలియు సంత సంబునొందు
చుండు; నానంద విషయ మం దుండు కతన॥ 21

గీ॥ ఇవ్వి కర్మేంద్రియంబుల నెసగు విషయ
ములను వివరించితిని, వీని దెలిసినాడ
వయ్య; జ్ఞానేంద్రియముల క ధ్యాత్మికాదు
లెట్టివో చెప్పెదను యాల కింపుమయ్య॥ 22

## జ్ఞానేంద్రియముల కధ్యాత్మికాదులు

గీ॥ అయ్య; జ్ఞానేంద్రియంబులు నైన చెవియు
చర్మ కన్నులు నాల్క నా సయనునైదు
నలరు, వానికి నధ్యాత్మ కాధి భౌతి
కాధిదైవికములు నెట్టులనిన వినుము॥ 23

గీ॥ చెవికి నధ్యాత్మికమునగు చెవియును, నధి
భౌతికము విన బడియెడి శ బ్దంబును, నధి
దైవికము శబ్దరూపమై తనరుచున్న
యాకసంబని తెలియు, మో యయ్య, నీవు॥ 24

గీ॥ చర్మ కధ్యాత్మికంబగు చర్మము, నధి
భౌతికము స్పర్శతెలియుట బరగును, నధి
దైవికము వాయు వనియును దలచుమయ్య;
సుగుణగణ ధుర్య; యో ముని సువ్రతార్య॥ 25

గీ॥ కన్నులకు నధ్యాత్మము కన్నులు, నధి
భౌతికము గానవచ్చు ప్రపంచము, నధి
దైవికము నగ్నిరవి యుని తలచుమయ్య;
సూరిజనవర్య; యో ముని సువ్రతార్య॥ 26

గీ॥ నాలుకకు నధ్యాత్మము నాలుక, యధి
భౌతికము నుప్పు పులుసును వగరు తీపె
కారమును చేదు, నధిదైవి కంబు వరుణు
డనుచు దెలియుము, మునిసువ్ర తాభిధాన॥ 27

గీ॥ ముక్కునకు నధ్యాత్మము ముక్కును, నధి
భౌతికము సువాసనయు దుర్వాసన యధి
దైవికము భూమి యశ్వినీ దేవతలును,
ననుచు దెలియుము, మునిసువ్ర తాభిధాన॥ 28

గీ॥ ఇవియె జ్ఞానేంద్రియంబుల నెనసియొప్పు
చున్న యధ్యాత్మికాదులు చూడె, యిందు
పైని గర్మేంద్రియంబుల బరగుచున్న
యట్టి యధ్యాత్మికాదుల నవధరింపు॥ 29

## కర్మేంద్రియంబుల కధ్యాత్మికాదులు

సీ॥ నోరున కధ్యాత్మ నోరు, పల్కెడు మాట
లాధిభౌతికమునౌ, యాధిదైవి
కంబగ్నియైతగు, గరముల కధ్యాత్మ
కరములు, నధి భౌతి కంబు పనులు,
నధిదైవికంబుగా నలరును విష్ణువు,
పదముల కధ్యాత్మ పదములయ్యె,
నాధి భౌతిక మను నడి న డయయ్యెను,
నధిదైవతము రుద్రు డైయొసంగు॥

గీ॥ గుదమునకు నధ్యాత్మము గుదమును, నధి
భూతము విడుపు, నధిదైవమునగుమిత్తి,
శిశ్నమున కధ్యాత్మము శిశ్నము నధి
భూతమానందమ ధిదైవ మును, బ్రజాప
తియను బ్రహ్మయై యొప్పు, సు ధీ విదేయ॥ 30

గీ॥ అయ్య, యీ జ్ఞాన కర్మేంద్రి యప్రవృత్తి
తెలిపితిని వింటివీవు, యిం దలిగుణాళి,
యిందుపై బ్రాణ దశకం బ దెట్టులుండె
నో; దెలిపెదను వినుమయ్య; సాదరమున॥ 31

## ప్రాణాది దశవాయువులు

గీ॥ ప్రాణవాయు వపానంబు వ్యానమును ను
దానము సమానము ననంగ దనరు పంచ
వాయువులు, నందుపై నుప వాయువులగు
నాగ కూర్మ కృకరముల్, ధ నంజయంబు
దేవదత్తంబనంగను దే జరిల్లు॥ 32

గీ॥ ఇట్టి దశవాయువులు దేహ మెల్లబర్వి
తనువు మిక్కలి తేలిక గను నటింప
జేయు, నన్నిటికిని ముఖ్య వాయువౌర
ప్రాణవాయు వదెంతటి బలము గలది॥ 33

గీ॥ నాభికూర్ధ్వము నందు గం ఠముకు దిగువ
హృదయమను నట్టి దొక్కటి యొసగు చుండు,
నదియ ప్రాణము కాధార మైన చోటు
గాన యచ్చట నివసించు గన్నతండ్రి॥ 34

ఆ॥గీ॥ అదియె జీవయంత్ర మౌటను లోనకు
నంగుళములు బదియు నానుకొనుచు,
ద్వాదశాంగుళములు మీదికి జిమ్ముచు
నెడములేక సంచరించు చుండు॥ 35

ఆ॥గీ॥ అదియె నాభియందు, హృదయంబును, నాస
యందు నుండు, మాట లాడజేయు,
చుండి, యెల్లవేళ నుచ్ఛ్వాస నిశ్వాస
కారణంబునయ్యె గన్నతండ్రి॥ 36

ఆ॥ నాన్న; వినగదయ్య; నాభికి బదియురెం
డంగుళములను హృద యాబ్జముండు,
నందు బ్రాణవాయు వాగియు గ్రిందికి
మీదికి నిగమించి మెలగు చుండు॥ 37

గీ॥ అట్టి గమనసంబునకు పేరు హంసయందు,
రట్టిహంసలు బ్రతిదినం బందు రే బ
వళ్లు గమనించు నొగి నిరు వదియు నొక్క
వేయునార్నూరు సంఖ్యగా, వినుము వత్స॥ 38

సీ॥ ప్రాణవాయువు సాల బలిమిగల్గియు హృద
యమ్మున గంతమ్ము నందు నాభి
యందున నాసిక యందునుండియు, మాట
లాడించుటయు నింద్రి యాదికమును
దక్కిన వాయు సం తతిని బ్రేరణ చేసి
యన్నివనులకు స హాయ పడుచు,
నుచ్ఛ్వాస నిశ్వాస లొప్పుగానడపుచు
దేహయాత్రకు చాల తేలికనిడి॥

గీ॥ సరిగ బ్రతిదినమందున నిరువదియొక
వేయి నార్నూరు హంసలు విధి గడపుచు
దనువుసంతతు బూర్ణమై తనరి, జీవ
సన్నిభమునై యెసంగును, కన్నతండ్రి॥ 39

## అపానవాయువు

గీ॥ నాభి కంఠోరు జంఘ శి శ్న కటి జాను
వంక్ష ణోదర గుద నాస భాగములను
నుండి, క్రిందికి గమనించు చున్నయయ్య
పాన వాయువు నెన్నగా వశమె తండ్రి॥ 40

సీ॥ ఓయి! విను మపాన వాయువుయను నది
యాసనమందు మే హనమునందు
నడుమునందున మఱి నాభియందున గడ
పిక్కలయందున డొక్కయందు

తొడలయందునను మీ దొడలయందున గెజ్జె
లందున గంతము నందు నుండి
యును విసర్జన బీజ మునకు లేప్యము వీర్య
నిస్సరణ నడుము నిలుచుటయును॥

గీ॥ తొడలకును గెజ్జెలకును మీ దొడలకున్ను
పిక్కలకు నడచుటందున బెద్ద బలిమి,
నాభికిని గర్భమునకు గం తమున కెంతొ
సుఖముగలిగించు చుండును సుమ్ము, పుత్ర॥ 41

## వ్యానవాయువు

గీ॥ వ్యానవాయువు శ్రోత్ర జి హ్వాక్షి గుల్ఫ
నాసికంబుల దగియు ప్రా ణనియమమగు
పూర కుంభక రేచక ములకు నిలిచి,
కాయరక్షణ మొనరించు గన్నతండ్రి॥ 42

సీ॥ మునిసుపుత్రాహ్వయా విను, వ్యానవాయువు
గనులనుండుట నన్ని కనగజేయు,
రసననుండుట నక్ష రములు పల్కగజేయు,
జెవులనుంటను ధ్వను లు వినజేయు,
నాసయందుంటను వాసన గొనజేయు,
గుల్ఫములందున గొరలు కతన
నిలచుట నడచుట గలిగించి, దేహము
దేలికగానుండ వీలుపఱచు॥

గీ॥ ప్రాణనియమంబునను తను త్రాణమునకు
పూరరేచక కుంభక ములను నిలచి
దీర్ఘజీవిత మొనగూర్చి తేజమొప్ప
గాయరక్షణ మొనరించు గన్నతండ్రి॥ 43

## ఉదానవాయువు

గీ॥ తగ నుదానంబు హస్త పా దముల గంఠ
మునను సంధుల నిలిచియు, దనువులేవ
జేయుటయు, ముందు నడువగా జేయుటయును,
నాదియగు శక్తులనొసంగు నయ్య; కుఱ్ఱ॥ 44

సీ॥ ఘన యుదానంబును కంఠంబునందుండి
గిళితంబొనర్చుట, గీతములను
బాడించుటయు జేయు, బాదంబులను నిల్పి
పరువిడ జేయుట, బలముగాను
నిలువజేయుటయు, జే తుల నిల్చియును నన్ని
పనులు సేయించుట, ప్రబలమైన
పట్లు బట్టించుట, బరగించి యిరునూరు
పదియు సంధుల యందు బరగియుండి॥

గీ॥ అవయంబుల వ్యాపించి; యవసరమున
నన్నిటికి బ్రేరణమొనర్చి, యద్భుతముగ
మెలగుచుండును తనువున మేలుగాను,
తీవ్రగుణధుర్య; యో ముని సువ్రతార్య॥ 45

## సమాన వాయువు

గీ॥ ఆ సమానము జఠరాగ్ని ననుసరించి
వెలయుగా డెబ్బదియు రెండు వేలనాడు
లందు జరియించి, తినెడు ప దార్థములను
బంచి, దేహపుష్టిని గలి గించు, బుత్ర॥ 46

గీ॥ ఇవియ ప్రాణాదివాయువు లింకను నుప
వాయువులు జర్మ మాంసాస్థి స్నాయురక్త
మేధలందున వ్యాపించి మేనులందు
తేలికను గల్గ జేయును బాలక; విను॥ 47

## ఉప వాయువులు

ఆ॥గీ॥ నాగవాయువన్నెడు నట్టిది వాగ్ద్వార
మందునుండి మాట లాడవేసి,
చొక్క జేయునట్టి యెక్కిళ్లు వాంతియు
మొదలు గలుగజేయు, ముద్దులయ్య॥ 48

గీ॥ కూర్మవాయువు గన్నుల గూడియుండి
కన్ను తెఱచుట మూయుట కదకు గనుట
దీర్ఘదృష్టియు సమదృష్టి తీక్ష్ణ దృష్టి
మొదలుగా గల్గ జేయును, ముద్దులయ్య॥ 49

గీ॥ కృకరవాయువు నాసిక క్రేవనుండి
తుమ్ములను గల్గ జేసి, దా హమ్ము క్షుత్తు
మొదలు నెన్నియొ తనువున మూడజేయు
ననుచు దెలియుము, మునిసువ్రతాభిధాన॥ 50

గీ॥ దేవదత్తంబుయనునది దేహమందు
బద్ధకము నావరింతలు ప్రబలజేసి,
అవహితత్వము నిద్దుర యలసతయును
గలుగజేయును సుమ్మ; యో కన్నతంద్రి॥ 51

గీ॥ అలధనంజయ వాయువు అస్థిసంధు
లందునుండియు సుత్క్రాంతి యైన దేహ
మందువీడక నిల్చును, హాస రోష
ణాదులను గల్గజేయు, నో యయ్య; వినుము॥ 52

గీ॥ అనిన మునిసువ్రతాఖ్యుడి ట్లను నొగి, గురు
దేవ; విశ్వజ్ఞ; తమరిప్డు తెలిపినట్టి
ప్రాణదశక ప్రవృత్తి స ర్వంబు వింటి
నికను షట్చక్ర విధ మాన తీయు డార్య॥ 53

## షట్చక్ర విధానము

గీ॥ వెలయ నాధార స్వాధిష్ఠ ములు మణి మణి
పూరకా నాహత విశుద్ధ ములును, నందు
పైని నాగ్నేయమును దాని పైని నేడ
వది సహస్రార మనుపేర వరలుదండ్రి॥ 54

గీ॥ అందు నాధార మాసన మందు, లింగ
మూలమందు స్వాధిష్ఠాన మును, మణి మణి
పూరకము నాభిని, హృదయ మున ననాహ
తము; విశుద్ధము గంఠ మూ లమున, బొమల
సందు నాగ్నేయమును, సహ స్రారము విధి
రంధ్రమందున విలసిల్లు రా; కుమార॥ 55

## ఆధార చక్రము

సీ॥ మునిసువ్ర తాహ్వయా; ముఖ్యమౌ యాయారు
చక్రంబులందాది చక్రమైన

యాధార మనునది యలరు గుదస్థాన
మున, నాల్గు దళముల నెనసి, యరుణ
కాంతిచే మించియు గణపతి యధిదైవ
మైయొప్పి, వ.శ.ష.స యనెడు నాల్గు
బీజముల్, తత్వంబు బృథివియై యాహ్వారు
హంసల కాధార మై తనర్చి,
తగ జతుష్కోణంబు, తారకాంకృతి సకా
రంబును భక్తస్థ లంబు, మఱియు.

గీ॥ ఘ్రాణ విషయ మాచారలిం గంబు దనరు,
నట్టి చక్ర మధో ముఖ మైనయట్టి
కుండలికి నాధారమై కొరలు కతన
యద్ది యాధార మనుపేర నలరు పత్స॥

## స్వాధిష్ఠానము

సీ॥ అయ్య; స్వాధిష్ఠాన మను చక్ర మాధార
మునకు రెండంగుల ములకు బైని
లింగమూలంబున లీలషట్కోణత
నారు దళంబుల నలరి, విద్యు
దాభాస మప్తత్వ మై, బ.భ.మ.య.ర.ల
యను బీజముల తోడ నలరి యున్న
దైతగి, వి మల దం డాకృతి బ్రహ్మయే
యాధిదైవము, శార దాంబ శక్తి,

గీ॥ యా మ కారమె బీజంబు, నై, మహేశ్వ
ర స్థలము గురులింగము రసన యింద్రి
యంబు నార్వేల హంసల నలరి, సర్వ
మునకు బ్రాధాన్యమై యొప్పు, మనస శీల॥

## మణిపూరకము

సీ॥ మణిపూరకము నాభి మధ్యంబునను బది
దళముల దగి, యగ్ని తత్వమగుచు,
అధిదైవతము విష్ణు వాదిలక్ష్మియె శక్తి
యును, డ.ఢ.ణ.త.థ ద.ధ న.ప ఫ లును,

ఘనచక్షు రింద్రియం బును, గుండలాకృతి
రత్నప్రభయు, శికా రంబు బీజ
మార్వేల హంసల కాధారమై, శివ
లింగస్వరూపంబు లీలదనరి॥

గీ॥ యా ప్రసాద స్థలంబుగా నమరి, దేహ
మధ్యమున దనరారును, మాననీయ
మైన రతనాల ప్రోవునా నలరు నయ్య;
సుగుణ గణధుర్య; యో ముని సుప్రతార్య॥ 58

## అనాహతము

సీ॥ అబ్బాయి; వినుమా; య నాహత చక్రంబు
నాభి కూర్ధ్వమున గం ఠముకు దిగువ
బదియంగుళంబుల బదిరెండు దళముల
నర్ధ చంద్రాకృతి నలరి, వాయు
తత్వ మీశ్వరు డధి దైవతం బీశ్వరి
శక్తి వాకార బీ జంబు, శ్వేత
వర్ణంబు చరలింగ ప్రాణస్థలంబు, నా
ర్వేల హంసలు, త్వగిం ద్రియము గలిగి॥

గీ॥ సంగత క.ఖ.గ.ఘ.ఙ.చ.ఛ జ.ఝ.ఞ.ట.ఠ లు
బీజములచేత మిక్కలి తేజమొప్ప
నలరు, నీ చక్రమే ద్వాద శాంత మగుట
మోక్షమున కాస్పదంబయ్యె, ముద్దులయ్య॥ 59

## విశుద్ధ చక్రము

సీ॥ అయ్యా; విను, విశుద్ధ మనుచక్రమే హృద
యమునకు బదియంగు ళములపైని
కంఠ మూలమున జ క్కగ షోడశదళంబు
లమరియు, నది వర్తు లాకృతి దగి,
యాకాశతత్వంబు నచ్చులు బదియారు
బీజముల్, స్ఫటికంపు తేజమలర,
నాసదా శివమూర్తి యాధిదైము, సదా
శివశక్తి శ్రోత్రేంద్రి యవసతియును॥

గీ॥ శరణమనియెడి స్థలము, ప్రసాదలింగ
మా యకారము బీజంబు. నరయ వేయి
హంసలొప్పగ జీవాత్మ యై చెలంగు
చుండును గదయ్య; యో ముని సువ్రతార్య॥ 60

## ఆగ్నేయ చక్రము

సీ॥ అగ్నేయ చక్రము నలరు గంతమునకు
బదియంగుళములకు బైని నున్న
భ్రూ మధ్యమున నుండి, వ్యోమాకృతిగనొప్పి,
మాణిక్య వర్ణమై మనసు భూత,
మోంకారబీజంబు నొప్పి మహాలింగ
మైక్య స్థలంబు, హృ దబ్జమనగ,
రెండు దళంబుల నుండి, హం.క్షం. యను
బీజద్వయంబుచే వెలయుచుండి॥

గీ॥ పరశివుండధిదైవము బరశివయను
శక్తిచే మించి, వేయి హం సల నెసంగు
చున్న పరమాత్మయై, ముక్తి నొసగు స్థాన
మైనదదిసూవె, మునిసువ్ర తాభిధాన॥ 61

## సహస్రారము

గీ॥ ఆసహస్రారమను చక్ర మలరు వేయి
దళములను వేయి హంసల దగి, పరశివ
గురు నివాసము బ్రహ్మైక్య మరయ నొసగు
యున్నతస్థాన మదిసూవె, కన్నతండ్రి॥ 62

సీ॥ ఆసుషు మ్నానాడి ననుసరించియె, కర్ణ
రంధ్రములే నాసికా రంధ్రములును
నేత్ర గోళంబులు నిలిచియు సకల శా
స్త్రోపనిషత్తుల స్థాపితమయి,
కుండలీస్థానము, మండలత్రయము, త్రి
కూటంబు, యూర్ధ్వ శృం గాటమనియు,
ద్విదళం బటంచు, ము క్తిద్వారమనుచును,
కొల్లాట కుండలి కూటమనియు,
ద్వాదశాంత మటంచు, దగ నాద బిందు క
ళాతీతమని, ముత్తినాతియనుచు॥

గీ॥ నిన్ని పేరుల వాడుదు రిందు హంస
రూపమగు పరమాత్మయు రూఢినిల్చు,
నదె సహస్రార మనుపద్మ, మందు నిశ్చ
యాత్మ గనువారు మోక్షంబు నందువారు॥ 63

గీ॥ ఇవ్వియే యారుచక్రము లిందులగల
మర్మములుగాంచు టే; మోక్ష మార్గ, మికను
నెనిమిదైన రాగాదుల నెఱుగ జేతు
ననుచు విశ్వజ్ఞ మౌని ద యా ప్రపూర్ణు
డగుచు ముని సువ్రతునిగాంచి యానతిచ్చు॥ 64

## రాగాద్యష్టకము

క॥ అనురాగంబును ద్వేషం
బును గామము క్రోధ లోభ ములునున్ మోహం
బును మదమును మత్సరమును
నను నివి రాగాదులెన్మి దై తగు. వత్సా॥ 65

## రాగము

గీ॥ తనువునకు నాత్మ కింద్రియ తతికి సౌఖ్య
దాయకమునను నమ్మిక తవిలి, మిగుల
ప్రేమతో నాదరించుట యే; మహాను
రాగమందురు సుమ్మి; యో యోగి వర్య॥ 66

## ద్వేషము

గీ॥ ధర్మవర్త నుడయ్యు న ధార్మికులను
సత్పథంబున నడపింప సాగి వారి
నొంచు యుద్దేశమున బ్రయ త్నించు నదియ,
ద్వేషమని పల్కుచుందురు, ధీ ప్రకాశ॥ 67

## కామము

గీ॥ ధనము ధాన్యంబు పుత్రులు దార విద్య
యశము నాయువు బలము న నామయంబు
మొదలుగా గలయవియెల్ల ముఖ్యముగను
గావలయునను కోర్కెయే కామమయ్య॥ 68

## క్రోధము

గీ॥ తనదు మదిగల కోర్కెకెం తయును బ్రత్య
వాయ దున్యులచేతను జేయబడిన
యపుడు కలిగెడి యుద్రేక మాపుకొనక
నద్ది వెలిగించుటయె, క్రోధ మందురయ్య॥ 69

## లోభము

గీ॥ ఎట్టి కార్యమునైనను నెట్టి కొనుట
కెంతయొ సమర్థతయుగల్గి కొంతయైన
సాయ మూనుట కాత్మలో సాహసింప
బూనమియె లోభమందురు, పుత్ర; వినుమ॥ 70

## మోహము

గీ॥ రూప లావణ్య యౌవనా రూఢలైన
కాంతలను గాంచినంతనే కంతుబారి
బడియు రేయు బవళ్లు దా పంబు నొంది
యద్దియే ధ్యాసనుంట మో హంబు, తండ్రి॥ 71

## మదము

గీ॥ ఎంతధనమున్న బలమున్న నెంత విద్య
యున్న నధికారమున్నను యెన్నికగల
వారలైనను నన్నును మీఱగలరె
యని చరించుట మదమని యందు రయ్య॥ 72

## మత్సరము

గీ॥ వారికంత ధనంబుండె వారికంత
విద్యయుండెను, గౌరవ విధులు జరిగె,
గొడుకులుండిరి యేమిటం గొదువలేద
టంచు జూపోపమియె, మత్స రంబు తండ్రి॥ 73

గీ॥ ఇవియె రాగాదు లెనిమిది యిందువలన
బంధకారణ మగును, త ప్పకని తెలిపి
నాడను, చతురంతః కర ణముల నిపుడు
వినుము మనసు బుద్ధియు చిత్త మును నహంకృ
తి యను నాలుగు వివరింతు, నయగుణాఢ్య॥ 74

## చతురంతః కరణములు

సీ॥ మనసు హృదంతర మున సంశయాత్మమై
తగు, జంద్రు డధిదైవ తంబుగాగ,
బుద్ధి నాభిస్థాన మున నిశ్చయాత్మమై
పరగు దైవము పర బ్రహ్మమనగ,
జిత్తంబు గంఠము చేరువ జింతల
బ్రబలును దైవము బ్రహ్మయనగ,
నాయహంకృతి నోట నమరు గర్విష్టియై
యధిదైవతము రుద్రు డై యెసంగ॥

గీ॥ నిటుల నొప్పెడి చతురంత రింద్రియములు
తక్కు పది యింద్రియంబుల దవిలి, యెల్ల
పనులు సేయించు చుండును ప్రభువులవలె,
ననుచు దెలియుము, నా ముద్దు లయ్య; నీవు॥ 75

గీ॥ మనసు యనియెడి యంతఃక రణము బార
దంబువలె జలనము, నింద్రి యంబులనెడు
గుఱ్ఱములకును గళ్లెము గొరలునట్లు
వాని ద్రిప్పుచు నుండు, న నూనగరిమ॥ 76

క॥ స్మృతి భీతి వికల్పాదులు
మతియందున నంటియుండి మఱి సుఖదుఃఖా
ప్తత విషయంబులు గలిగియు,
సతతము వెలుగొందుచుండు, సర్వగుణాఢ్యా॥ 77

సీ॥ మనసు పుట్టినగదా; కనులు సూచుచునుండు,
మనసు పుట్టిన చెవుల్ వినుట గలుగు,
మనసు పుట్టిన చేయి పనులను జేయును,
మనసు పుట్టినను గా ళ్లును నడచును,

మనసు పుట్టిన చవుల్ దినగల్గునాలుక,
మనసు పుట్టిన చర్మ గనును స్పర్శ,
మనసు పుట్టినను వా సన నెంచు నాసిక,
మనసు పుట్టిన నోరు మాటలాడు,

గీ॥ మనసు పుట్టిన గుదమును మలమువిడుచు,
మనసుపుట్టిన దార్ఢ్యత గనును పస్థ,
మనసుచే నింద్రియములెల్ల మసలు కతన
మనసు యింద్రియముల కర్త యనగ బడియె॥ 78

గీ॥ మనసు దశవాయువులను ప్రేరణ యొనర్చి
యింద్రి యాదులకును బల మొనయ జేయు,
కారణంబున నెల్ల వ్యా పారములును
నడపుచుండుట గల్గె, నీ పృథమి యందు॥ 79

గీ॥ మనసు నిలిచిన నిలుచును మారుతంబు,
మారుతము నిల్వ నింద్రియ వారమాగు,
ఇంద్రియాదులు నిలిచిన నేక దృష్టి
ధ్యానమొనరింప వచ్చును, తప్పకున్న॥ 80

గీ॥ కావున మనస్సుయే యెల్ల కార్యములకు
మూలమైనదియైతగు, మూర్తులకు ప్ర
పంచముకు మూల మాపర బ్రహ్మమైన
మాట్కియని గ్రహియింపు, నీ మదిని పుత్ర॥ 81

బుద్ధి

గీ॥ బుద్ధి యనునది సంతతం బును స్థిరత్వ
మూని సకల యుక్తాయుక్త ముల నొగి బరి
శీలన మొనర్చి. యింద్రియ జాలమును సు
మార్గమున గమనింపించు, మాన్యచరిత॥ 82

సీసమాలికా

సీ॥ కనులచే నన్య భా మినుల గాంచెడునెడ
మాతృభావమునూన మదిదలంచు,
చవులను గొనెడు ర ససను నభక్ష్యముల్
గుడుపు యెన్నండైన గూడదనును,

దుష్కరవాక్యముల్ దోనె వినుటమాని
చెవులను సత్కథల్ జివిగొనుమను,
నంటినతోనె జ ల్లనియెడి మోహంపు
స్పర్శలు వలదను చర్మమునకు,
పూతి విస్రాదు లె ప్పుడును వాసింపక
నాసను సురభుల నానుమనును,
బూతు లసత్యముల్ బ్రీతియౌ జిహ్వను
భగవంతు సత్యముల్ వలుకు మనును,
స్తనమర్దనంబు వాం ఛను జేయు కరముల
సర్వేశు పూజన సలుపుమనును,
మెట్టరాని స్థలాలు మెట్టెడు పదముల
దైవసన్నిధి కేగ దలచు మనును,
పదిచోట్ల మెలగు న పానంబు రేచక
సాధనంబున గృషి సలుపు మనును,
నాతులబొంది యా నందించు శిశ్నంబు
నూర్ధ్వరేతస్సుగా నుంచు మనును,
అన్నిటిం బ్రేరణ మాచరించుచు జల
నంబైన మనమును నాగుమనును,
ఆ గుణత్రయిచేత నలరెడి చిత్తంబు
సత్వముఖ్యంబుగా జరుగుమనును,
కామాది షట్కయు క్తమునౌ యహంకార
మును నెల్ల తగ్గించు మనుచు నను,

గీ॥ లేనిపోని దుర్భడతల మానుమనును,
పెద్దలందున భక్తిని బెట్టుమనును,
జ్ఞానమందున నాత్మను గలపుమను,
అతులవైరాగ్యమే ముఖ్య మైన దనును॥

గీ॥ మంచి నడువడులకు నెల్ల మార్గదర్శి,
చేరుకైవల్యముకు సహ కారియైన
బుద్ధి వైశేష్యమేరికి బొగడవశమె,
దీర్ఘ దర్శిత్వమోపి మి ధీకె తగును॥

గీ॥ మనసు దలచెడి యూహల మలపుటకును
చిత్తవృత్తుల నటు నిటు చేయుటకును,
ఆయహంకారగమనము నడచుటకును
ఇంద్రియముల సత్పధి నడ పించుటకును
బుద్ధియే మూలమైయొప్పు, ఖ్యాతచరిత॥ 85

గీ॥ వపువురథ, మింద్రియాదు ల శ్వములు, గళ్లె
మగు మనస్సును, రథికు డాత్మ, బుద్ధి
సారథియుగాగ, నింద్రియ సమితి నడుప
బుద్ధియేకర్త యని యెద, రిద్ధ చరిత॥ 86

గీ॥ కావునను బుద్ధియే సర్వ కార్యములకు,
దమ్మ మర్థమ్ము కామ మో క్షమ్ములకును,
భువిని నౌన్నత్య మహిమను బొందుటకును,
ముఖ్యమై యొప్పుచుండును, ముద్దులయ్య॥ 87

## చిత్తము

గీ॥ చిత్తమనునది తనదు ప్ర వృత్తిచేత
మూడు గుణములు గలది యా మూడు గుణము
లగును సాత్వికమును రజ స్సనగ దామ
సంబనంగను సు గుణత్ర యంబు, తండ్రి॥ 88

గీ॥ ఆ గుణత్రయి లోకమం దంతటికిని
ముఖ్య, మట్టి గుణంబులు మూడు చిత్త
వృత్తులైయుంట, సర్వంబు చిత్తవృత్తి
లై ప్రవర్తించు చుండె, న య్యా; కుమార॥ 89

## అహంకారము

గీ॥ ఆయ హంకార మస్థిర మౌ ప్రపంచ
మూలకారణ మైనది మూల పురుషు
డాదిని య విద్యయను మాయ యందుగలుగ
జేయుటను నేను నాయది యౌ నను నది॥ 90

గీ॥ అట్టిదైన యహంకార మందు గామ
మున్ను క్రోధము నా లోభ మును మదంబు
మోహ మత్సరములు సుండు ముఖ్యముగను
ఇదియ శత్రుషడ్వర్గ మౌ యిద్ధ చరిత॥ 91

గీ॥ నాదుకాలును నా చేయి నాదు మనసు
నాదు భార్యయు నాయిల్లు నాదు కొడుకు
నాదుబుద్ధి నాప్రాణము నాదుయాత్మ
యనునదియె యాయహంకార మయ్యపుత్ర॥ 92

గీ॥ చలనమైనది మనసు, ని శ్చలము బుద్ధి,
చిత్తము గుణత్రయిందగి చెలగుచుండు,
గా మషట్కంబుచే నహం కారమొప్పు,
నాల్గు విషయంబు లివియె మ నంబునకును॥ 93

గీ॥ వినుము, వీనికె యంతఃక రణ చతుష్క
మనియు, నంతరింద్రియ ములు ననియు నందు,
రివ్వి విషయంబులంబట్టి యిట్టులయ్యె
గాని మనసొక్కటియె చతు ష్కంబునయ్యె॥ 94

గీ॥ ధన్య; యీ నాలుగు చతురం తః కరణము,
లివ్వియె ప్రధాన మగునవి, యిక షడూర్మ
లెట్టివో వానివివరంబు నెల్ల నీకు
వి నిచెదను, మునిసుపుత్రా; వినులలర॥ 95

## షడూర్ములు

గీ॥ ఆకలియు దాహ మోహముల్ శోకమున్ను
జనన మరణంబులనియెడు షట్కమును ష
డూర్మలని చెప్పుచుండుదు రుర్వియందు,
బాలకా; వీని వివరంబు భక్తి వినుము॥ 96

## క్షుత్తు

గీ॥ భుక్తియును నిద్ర మైథున ము నను మూడు
ప్రతి శరీరికి ముఖ్యమై పరగు. నందు
భుక్తిలే మిని నాకలి బుట్టు, నట్టి
యాకలియె క్షుత్తనంగను నలరు, వత్స॥ 97

## తృష్ణ

గీ॥ పనులు సేతల నలసత బడినయపుడు
ఎండతాకున బడలిక నుండునపుడు
శ్రమము గొనునెడ దాహము సభవించు
నదియ తృష్ణయనంగను నలరు, గుణ్ణి॥ 98

## శోకము

గీ॥ దేహమున కాత్మకును వేధ తెవులు దవుల
తనదు పరివారమున కాప ద యొదవు నెడ,
దుఃఖముత్పన్న మగునప్డు తోచు నేడ్పు
శోకమని చెప్పుచుంద్రు, వి వేక శీల॥ 99

## మోహము

గీ॥ సుగుణవతియును సర్వాంగ సుందరి యగు
యౌ వతను గాంచునెడ, దన యాత్మ కింపు
గలుగు వస్తువు లొగి దార సిలు నెడలను
బుట్టు ప్రేమయె మోహంబు బుత్ర; వినుమ॥ 100

## జననము

గీ॥ ఓషధులు భుక్తిగొనుటచే నుద్భవించు
వీర్యములు గలయిక జంతు వితతి గర్భ
గోళముల గర్మవశత బా గుగ జనించు
చుంట జనన మటందురు సుగుణపేటి॥ 101

## మరణము

గీ॥ హృదయమున సూక్షరూపుడై యెసఁగు జీవు
డాహృదయమున నిలుచుట కనవకాశ
డయ్యు దశవాయువుల తోనె యంతరించు
చుంటయే మృతియందురు, సుమ్ము వత్స॥ 102

గీ॥ ఇవి షడూర్ములు నాగను నెసగి ప్రాణి
కోటి ముఖ్యప్రవృత్తియై కొరలుచుండె,
నీపయిని సప్తధాతువు లెట్టులుండు
నో వచించెద, వినుమయ్య; ధీవరేణ్య॥ 103

## సప్తధాతువులు

గీ॥ చర్మమును రుధిరమును మాం సంబు మేధ
యెమ్ములును మూల్గలును శు క్లమ్ము ననెడు
నేడు సప్తధాతువులయ్యు, యెసగుచుండు
తనువునకు నివి ముఖ్య మా ధారమయ్య॥ 104

గీ॥ చర్మమనునది తనువుకు వర్మమటుల
నలరి, యాపాద మస్తక మావరించి
షట్పుటల చేత నొప్పి, స్ప ర్శత వహించి
చాలమృదువుగ నెసగును, సద్గుణాఢ్య॥ 105

గీ॥ రక్తమనునది పలుచనై రాగి వన్నె
కలిగి కుంచెడు పరిమితి గానెసంగి,
యెల్ల నాడులలో బ్రవ హించు చుండి
తనువునకు బుష్టినొసగును, ధన్యచరిత॥ 106

గీ॥ మాంసమను ధాతు వెంతయు మార్దవంబు
గలిగి, నూరు పలములుండి కాంతినిచ్చి
నాడులను వృద్ధి నొందించి నాణ్యమైన
మేధను జనింపజేయును, సాధుచరిత॥ 107

గీ॥ మెదడనెడు ధాతువు శిరస్సు మీది భాగ
మందు దేహంబునందున నలరి, మానె
డుండు, నది బుద్ధికిని బల మొదవజేసి
జ్ఞాపకంబును మిక్కిలి కలుగ జేయు॥ 108

గీ॥ శల్యములు షష్టియుక్త త్రి శతము దేహ
మెల్ల ఖదుమూడు రూపుల నెసగి, తనువు
దార్ఢ్యతను గల్గ జేసి, యెం తయును బలిమి
నొప్పుచుండును, యొప్పుల కుప్ప; యప్ప॥ 109

## శల్యభేదములు

గీ॥ రవరములు తుంగములు ప్రస రములు సేవ
నము లులూఖములు గపా లములు నలక
ములును రుచకములు జల జములు సముద్గ
మండల తరణ వామన కుండలములు
ముఖ్యమైన శంఖావర్త ములుననునవి
పదియుమూ డగు నట్టి రూ పములెముకలు॥ 110

గీ॥ మజ్జ యనునది యెమ్ముల మధ్యమునను
శల్యసంధుల నిలిచియు జాలబలము
గలుగ జేయుచు దవ్వెడు గ్రాలుచుండు,
నారవది యగు ధాతువో యార్యవినుమ॥ 111

గీ॥ వీర్యమనునది యీధాతు వితతికెల్ల
ముఖ్యమై సోలెడుండును, పురుషులందు
దెల్లనై స్త్రీలయం దెఱ్ఱ తేజుగలిగి
జీవితమునై యెసంగును చిట్టి కన్న॥ 11

గీ॥ జ్వరము తలనొప్పి వ్రణ విశే షములు వాత
బాధ కండ్లనొప్పులు రోగ బాధలపుడు
కలనొ కూటంబుననొ వీర్య చలనమైన
ప్రాణ సంకట మొనరించు, భవ్యచరిత॥ 11

గీ॥ ఇవ్వియే సప్తధాతువు లిట్టులుండె
వీనిదెలిపితి గద యిందు పైని నీకు
పదియు నాడులు దనువున బరగెనెటుల
వాని వివరంబు దెలిపెద, వత్స; వినుము॥ 11

## నాడీ దశకము

గీ॥ నాడు లిళయు పింగళ సుషు మ్నయును జిహ్వ
యశ్విని కుకుర శంఖిని హస్తినియు న
లంబ గాంధారి యనుపేరు లం జెలంగి,
నాసికాదుల నివసించు నయగుణాఢ్య॥ 11

గీ॥ సర్వతో ముఖమనుచును జంద్రనాడి
యనుచు నిళనాడియనుచును యమున యనుచు
గుండలియటంచు నెడమ ము క్కునవసించు.
నాడి కిడయను పేరగు నయ్య; పుత్ర॥ 11

సీ॥ అయ్య; యి ళానాడి యనునది యమునయు
జంద్రనాడి యటంచు సంజ్ఞ గలిగి,
యాసుషుమ్నానాడి ననుసరించియు, వామ
మున నుండి యాధార మునకు దగియు,
దానికి నంటి యం తట నద్దియే మీది
కరిగి కపాల ప ర్యంతమేగి,
చంద్రమండలమును జక్కగా వ్యాపించి,
పూరకమునకును ముఖ్యమగుచు॥

గీ॥ నాసికారంధ్ర మందున సవ్యమైన
వాయువును సంగ్రహించియు, వరలుచున్న
దాని మహిమంబు వర్ణింప దరముగాదు
సుమ్మ, మునివర్య; యో ముని సుపుత్రార్య॥ 117

గీ॥ పింగళయు సూర్యనాడియు గంగయనుచు
నాస కుడిప్రక్క నివసించు నాడికమరు,
బ్రహ్మ నా ద్యగ్నియును సర స్వతి సుషుమ్న
యనెడు నాడియె నాసాగ్ర మందు నుండు॥ 118

సీ॥ పింగళ యనునాడి వెలయుఁ గంగయనంగ
సూర్య మటంచును సొంపు మీఱి,
యాసుష్మ్నానాడి ననుసరించియు, గుడి
ముక్కుచే నాధార మునకు దిగియు,
యాధారమున నంటి యందుండి మీదికి
నరిగి కపాల ప ర్యంతమేగి,
సూర్యమండలమును జొచ్చి, రేచకమును
గావించుచును, నాసి కనువసించి॥

గీ॥ యిళను రాదీసి, లోనకె క్కించ బడిన
వాయువును బైకి జిమ్ముచు, గాయశుద్ధి
జేయు పింగళమహిమంబు సెప్పదరమె,
సుగుణ గణ ధుర్య; యో ముని సుపుత్రార్య॥ 119

సీ॥ ఆసుషుమ్నానాడి ననుసరించియు గర్ణ
రంధ్రముల్ నాసికా రంధ్రములును
నేత్ర గోళంబులు నిలిచియు, సకలి శా
స్త్రోపనిషత్తుల స్థాపితమయి,
కుండలీస్థానము, మండలత్రయము, త్రి
కూటంబు, పూర్వ శృం గాట మనియు,
ద్విదళంబటంచు, ము క్తిద్వార, కొల్లాట
కుండలియని, యగ్ని మండల మని,
ద్వాదశాంత మటంచు, దగ నాద బిందు క
ళాతీతమని, ముత్తి నాతియనుచు॥

గీ॥ నా సరస్వతి యనియు, న వ్యక్తమనియు,
నిన్ని పేరులవాడుదు, రిందు హంస
రూపమగు పరమాత్మయు రూఢినిలుచు,
నీ సుషుమ్నను వర్ణింప నెవరి వశము॥ 120

గీ॥ హస్తినియు జిహ్వ యనునాడు, లంగమందు
గన్నులను నాశ్రయించి చ క్కగను దృష్టి
సర్వగాజేసి యెంతయో భవ్యమొసగు,
ననుచు పెలియుము, మునిసువ్ర తాభిధాన॥ 121

గీ॥ ఆ యలంబ గాంధారియు ననెడు నాడు,
లెంతొ వింతగ గర్ణముల్ జెంతనుండి,
యన్ని శబ్దంబులను విను నట్టి శక్తి
చెవులకు నొసంగు చుండును, చిట్టికన్న॥ 122

గీ॥ కుకురయును శంఖినియు నాగ గొరలురెండు
నాడులిరువంక నుండును నాభికడను
నందుచే నాభియం దుష్ణ మమరి ప్రాణ
నిర్గమనముపనుక నవ్వి నిలుచుచుండు॥ 123

ఆ॥గీ॥ అశ్విని యనునాడి యలరును, నాసిక
క్రేవనుండి యగ్ని కీలలొప్ప
బ్రాణ వాయువునకు నాధారమై చాల
మేలుచేయుచుండు, మేనునకును॥ 124

గీ॥ ఇవియె దశవిధ నాడులు యిందుపైని
మండల త్రయమెట్టిదో మఱియు దాని
వివరమును నీకు జెప్పెద వినగదయ్య;
సుగుణ గణ ధుర్య; యో ముని సువ్రతార్య॥ 125

## మండలత్రియము

గీ॥ కనులు రెండును నిటలంబు ననెడు మూడు
మండల త్రయమనెడు నా మంబు గలవి,
యివ్వియే యోగధారణ మెలమి జేయు
నపుడు యోగుల కానంద మలవరచును॥ 126

గీ॥ లాలిత గుణాఢ్య; యిది మండ లత్రయం బ
టంచు దెలియుము, యీపైని యీసగొలుపు
యీషణ త్రయమును వివ రించువాడ,
గాంచు మిక నద్దియే బంధ కారణంబు॥ 127

## ఈషణత్రయము

గీ॥ ఈషణ త్రయ మనగను నెద్దియనిన,
ధనము భార్యయు దనయులు ననెడు నిదియ,
దేహనాశంబు దనుకను దేహి కాశ
గొలుపు చుండెడు త్రితయంబు, కుఱ్ఱ; వినుము॥ 128

## ధనేషణము

సీ॥ సత్యానృతములు వా చామూలమున గల్గు
వాణిజ్యములు ధన వాంఛగాదె,
మతబోధకులు శిష్యతతి జేర్చి మంత్రంబు
లిచ్చుట ధనముపై యీహగాదె,
చదివి యెన్నియొ పరీ క్షల నిచ్చి యుద్యోగ
మూనుట ధనముపై యూహగాదె,
వ్యవసాయమున నోష ధాదు లెన్నియొ విత్తి
పండించుటయు ధన పరత గాదె,॥ 129

గీ॥ చోరవృత్తియు జూదంబు జారవృత్తి
సర్ప పంచానన వ్యాఘ్ర సంగ్రహంబు
నన్యదేశాటనంబు మా యాప్రవృత్తి
ధనము నందలి వాంఛ చే తనె, తనూజ॥ 130

## దారేషణ

సీ॥ పెరతేనె లొలికెడి సరసంపు మాటల
శ్రోత్రేంద్రియంబును జొక్కజేయు,
లక్షణమౌ రూప లావణ్యగరిమచే
గనులకు విందును గలుగ జేయు.
దగ రుచ్యమౌ పదా ర్థములను వడ్డించి
నాలుకలెంతయో మేలు సేయు,

మల్లికా స్రజ మృగ మద చందనము లిచ్చి
ఘ్రాణమునకు దృప్తి కలుగజేయు,
కంతుచెవ్వుల వింత గౌంగిలింతలు నిచ్చి
చర్మకు సౌఖ్యంబు జరుపుచుండు,
అడుమాటకును మా రాడక యనుకూల
వాక్యముల్ వలుకుచు వాక్కుదనుపు,
సరవి షోడశ కళా స్థానంబు లంటెడు
కరముల కానంద కరము సేయు,
బవ్వళించెడు వేళ బరిచర్య లొనరించి
పదయుగంబుకు సౌఖ్య మొదవ జేయు,
జౌశీతిరతులచే సౌఖ్యంబు నొందించి
యానందమొసగు గు హ్యంబునకును,
తనివినొందగ మంచి పనుల నొనర్చియు
మనమున కానంద మొనర జేయు,
యుక్త ప్రవర్తన నుండి సద్బుద్ధిచే
బుద్ధికి నెంతయో ప్రోదిచేయు,
సత్వగుణ ప్రశ స్త ప్రచారంబున
చిత్తంబునకు తృప్తి చేయుచుండు,
కామాదులను నంట కయె యుంట మేలని,
నొడువు చహంకృతి న్విడగ జేయు,॥

గీ॥ అహహ పదునాలుగగు యింద్రి యముల దనిపి
యెన్నియో గృహకార్యము లెల్ల సలిపి
తోడు నీడయి యీడును జోడునైన
దారయం దనురాగంబు దగులకున్నె॥ 13

## పుత్రేషణ

సీ॥ ఎన్ని యైశ్వర్యము లున్నను బితృఋణ
మోచనం బొనరించు బుత్రకుండు,
జిలి బిలి పలుకుల జెలువంపు నడకల
మోదం బొనర్చును పుత్రకుండు,
కాలు సేతులు బల్మి ప్రీలిన పిమ్మట
పోషణంబొనరించు బుత్రకుండు.
పుంనామక నిరయ మున బడకుండగా
బ్రోచును తండ్రిని పుత్రకుండు,॥

ఆ॥గీ॥ మంచి పనుల యందు మంచి నడతలందు
మంచి విద్యలందు మంచి బుద్ధి
మించి, భువిని కీర్తి నించి, తండ్రికి ముద
మొప్ప మెలగుచుండు, బుత్రకుండు॥ 132

గీ॥ ఇద్ది యీషణత్రయి, దీని నెనయు బంధ
మగు, గుణత్రయ మెట్టిదో యట్టి వివర
మును వచించెద, రాజస మున్ను సత్వ
మును దమంబును నను గుణం బులును మూడు॥ 133

## గుణత్రయము

గీ॥ నామ రూప క్రియా శూన్య మై మొదటను
నిప్పుడు నెప్పుడును దగి యొప్పుచున్న
యట్టి యద్వైతతత్వ మ నాదినుండి
పూర్ణమైయున్న వస్తువు బొలుచు, నొకటి॥ 134

గీ॥ అట్టి వస్తువునే పర మాత్మ యనుచు,
బ్రహ్మ మనుచును, మఱి పర బ్రహ్మమనుచు,
విశ్వకర్త యటంచును, విశ్వపూర్ణ
మైన పరిపూర్ణమని యందు రనఘచరిత॥ 135

గీ॥ అట్టి పరిపూర్ణమందున మొట్టమొదట
వింతగ న విద్యయను మాయ వెలసి, యదియె
మూడుగుణములుగా జగ న్మూల మగుచు
వెలసె, నవ్వియె త్రిగుణముల్, వినుము వత్స॥ 136

గీ॥ ఆ గుణము లసునవి రజ స్సనియు సత్వ
మనియు దామనమని భువి ననగబడియు,
దేహధారుల యాత్మలో దేజరిల్లు,
నందున ప్రధాన గుణ మొక టంటియుండు॥ 137

గీ॥ తామసున కొక్కవేళ స త్వంబు గలుగ
సాధువై సంచరించును, సత్వగుణున
కపుడు తామస మబ్బిన యంత గోప
మూను, క్షణికంబులో వింత గానుపుత్ర॥ 138

గీ॥ అందులో రజోగుణ మెరు, పచ్చమైన
తెలుపు సత్వగుణంబును, నలుపుతామ
స, మను మూడును, నీరీతి చాయలమరు,
ననుచు బెద్దలు సెప్పుదు రమల చరిత॥ 139

గీ॥ ఆ రజోగుణ రూపమై యలరు నరుణ
కాంతిచే బ్రహ్మ, శ్వేతప్ర కాశమైన
సత్వగుణ రూపవంతుడై శంకరుండు,
నాతమోగుణ రూపత నశిత వర్ణు
డైన విష్ణువు నవతార మందెనాది॥ 140

గీ॥ ఆ రజస్సుయె బ్రహ్మయై యవతరించి,
బృంహతి బ్రహ్మ యనురీతి వృద్ధినొంది,
యెల్లెడలనిండి, నిండించి యెరుపువన్నె
పరిణమించెను సుమ్మ; యో భవ్యచరిత॥ 141

గీ॥ సత్వమనునది తెలుపునై శంకరు డయి,
శం సుఖం కరోతి యనగ సకల సౌఖ్య
ముల నొసంగుచుఁ బోషణ మును నొనర్చు
చున్న యదిసుమ్మ, ముఖ్య మి దోయి; తండ్రి॥ 142

గీ॥ ఆ తమస్సనునది నలు పయ్యె గృష్ణు
డయ్యె, సర్వంకరోతి య టంచు సాధు
దుష్కృత త్రాణ ఖండనా దులనొనర్చు
చున్నదిగదయ్య; యో ముని సువ్రతయ్య॥ 143

గీ॥ ఆదియం దాదిశక్తి గు ణాత్మకమగు
శ్వేత రక్తాశి తాండముల్ వేసి యందు
హర విధాతృ కేశవుల గు ణానురూప
రూపగుణులుగ సృజియించె, రూఢిగాను॥ 144

గీ॥ అందుచేత త్రిమూర్తులు నాగుణాను
వర్తులగుటను సృజియించు బ్రహ్మ, శివుడు
బోషణమొనర్చు, నావిష్ణు మూర్తి లయము
సేయుచుండు వారి గుణ వి శేషములను॥ 145

గీ॥ ఇట్టి కారణముండు టం బట్టి వారి
సగుణులు గుణస్వరూపులు సద్గుణులని,
జనన పోషల యంబులు సలుపుదురని,
లోక మెన్నుచునుండుట రూఢి వత్స॥ 146

గీ॥ ఇట్టి గుణములె మానవు లెడను గలిగి
యజ్ఞ దాన తపంబుల నాచరింతు
రెట్టులో వాని వివరంబు లిపుడు నీదు
చెవుల కానంద మగునట్లు చెప్పెద, విను॥ 147

## త్రిగుణ యజ్ఞములు

గీ॥ ఇట్టి యజ్ఞము నాచర ణీయ మనెడు
శాస్త్ర విధిచేత మనమున సమ్మతించి
ఫలము గోరక చేతురు, భవ్యులైన
సాత్వికులు యజ్ఞములు భువి సద్గుణాఢ్య॥ 148

గీ॥ ఫలము గోరుచు నీతడీ పగిది జేసె
నహహ; యని లోకులెల్లరు ననుచు మెచ్చ
కొరకు జేసెడు యజ్ఞము ధరణి రాజ
సంబనుచు నెన్నుచుందురు, సత్వమూర్తి॥ 149

గీ॥ శాస్త్ర విధికాక మంత్రముల్ సదువకున్న
దానమును శ్రద్ధయునులేక దక్షిణలును
నీక యొనరించు యజ్ఞ మీ యిలను దామ
సంబనుచు జెప్పుచుందురు, సాధుచరిత॥ 150

## త్రిగుణ తపములు

గీ॥ ఫలము గోరక శ్రద్ధచే బహునియమితు
లగుచు నుత్కృష్టతపమును నాచరించి
రేని యత్తపమును బెద్ద లైనవారు
సాత్విక తపంబటందురు, సద్గుణాఢ్య॥ 151

గీ॥ పూజ సత్కార బహుమాన ములను బొంద
దంభమున నొనరించెడు తపము జలన
మస్థిరంబైన దగుటచే నద్ది రాజ
సంబయిన తపమందురు, సాధుచరిత॥ 152

గీ॥ తెలివి తక్కువ కలిగియు దేహమునకు
బాధయైనను నెరులను బాధపెట్టు
కొరకు జేసెడు తపము నీ ధరణి దామ
సంబనుచు నెన్నుచుందురు, సత్యమూర్తి॥ 153

## త్రిగుణదానములు

గీ॥ పుణ్యకాలంబు లందున బుణ్యతీర్థ
ములను సత్పాత్రులకును, మ రలను పకృతి
జేయుసట్టివారిక దాన మీయవలయు
ననుచు నొసగుట సాత్త్విక మందు రయ్య॥ 154

గీ॥ ఒకరి యుపకారమును గోరి యొకఫలంబు
గోరియో; మనమందున గుందుచును నొ
సగెడి దానంబు బుధులు రా జసమునందు,
రనుచు దెలియుము, మునిసువ్రతాభిధాన॥ 155

గీ॥ దేశ కాల పాత్రంబులు దెలియలేక
సత్కృతియు లేకయును నిర సనగ నొసగు
దానమునకును తామస దాన మనుచు
పెద్దలు పచింపుచుందురు, ముద్దులయ్య 156

గీ॥ ఇట్టి గుణముల చేతనె యెల్లయెడల
జ్ఞానమని కర్మయునియును గర్తయనియు
మూడు విధముల నేర్పడి యొనసి యుండె
వాని వివరంబు నుడివెద వరగుణాఢ్య॥ 157

## త్రిగుణ జ్ఞానములు

గీ॥ వేరు వేరుగ నగపడు వివిధములగు
భూతములయందు నవిభక్త మును నఖండ
మేకమగు పరమాత్మయే యిమిడియున్న
దనెడు జ్ఞానమె సాత్త్విక మందురయ్య॥ 158

గీ॥ బ్రహ్మయని విష్ణువని పశు పతియు నింద్రు
డనియు రవియని భూతము లన్నియయ్యె
నాత్మయని భిన్నభావన నరయుచుండు
జ్ఞానమును రాజస మటంద్రు, మౌనివర్య॥ 159

గీ॥ అల్ప ఫలద మహేతుక మన్ని విషయ
ములుగ నున్నట్టి వి యసత్య ము నొకటి యగు
విగ్రహాదికమందు భా వించు నట్టి
జ్ఞానమును దామసం బండ్రు, కన్నతండ్రి॥ 160

## త్రిగుణ కర్మలు

గీ॥ ఫలము గోరక ని యతి ద ప్పకయును నను
రాగమును ద్వేషమునులేక రాత్రి బగలు
నాచరించుట సత్వగు ణ ప్రధాన
కర్మయని పెద్దలందురు, కలుషదూర॥ 161

గీ॥ తనదు కోరిక సిద్ధింప దలచి మిగుల
క్లేశమును బొందగా గలి గితిని నేన
టంచు నెంచుచు జేసెడు నట్టి కర్మ
రాజసంబని యందురు ప్రాజ్ఞ; వినుమ॥ 162

గీ॥ అజ్ఞతను ముందు రాబోవు నట్టి బాధ
లున్న సామర్థ్యమును చేటు లును దలంప
బోక నాచరించెడి కర్మ మునొగి దామ
సంబనుచు బెద్దలందురు, సద్గుణాఢ్య॥ 163

## త్రిగుణ కర్తలు

గీ॥ సంగమునువీడి ధృతియు ను త్సాహములను
గూడి, యాయహంకారము న్వీడి, సిద్ధ్య
సిద్ధులందున వికృతిని జెందనట్టి
కర్త, సాత్వికుడందురు, గాదె పుత్ర॥ 164

గీ॥ రాగియై కర్మఫలమును రాదలంచి
హర్ష శోకాన్వితుండు హిం సాత్మకుండు
శుచి విహీనుండు లుబ్ధుడై చొక్కు కర్త
రాజసుండని యందురు, రాజయోగి॥ 165

గీ॥ దుఃఖశీలుడు శఠుడు మం దుడును బుద్ధి
హీనుడు మనోవినిగ్రహ హీను డొరుల
లాఘవపరచు వాడు నా లస్య పనులు
జేయుకర్త తామసి యని చెప్పబడును॥ 166

గీ॥ ఇవియె మూడు గుణంబులం చెరుగుమయ్య
ఇందుపై మూడవస్థలం చెరుగు జేతు,
వాని వివరంబు దెలియుట వశ్యమయ్య;
సుగుణగణధుర్య! యోముని సువ్రతార్య॥ 167

## అవస్థాత్రయము

గీ॥ జాగ్రతయు స్వప్నము సుషుప్తి సర్వజీవ
సంచయమునకు గల యవస్థాత్రయంబు,
ఇందులో నంతరావస్థ లెటులనుండు
వాని వివరంబు జెప్పెద, వరుస వినుమ॥ 168

గీ॥ అయ్య; యాహవనీయంబు ననెడు వహ్ని
హృదయముననుండ జీవుడా సదనమునను
నిలుచునెడ జాలతెలివిచే నెగడు కతన
దాని జాగ్ర దవస్థండ్రు, తత్వవిదులు॥ 169

గీ॥ దక్షిణాగ్నియె కంఠంబు దరిని నుండు
నెడను జీవుండు దానియం దెసగుచుండు
నప్పుడు విశేషముగ గల లొప్పుకతన
నద్ది భువిని స్వప్నావస్థ యందురయ్య॥ 170

గీ॥ అయ్య! వినుము గార్హపత్య మనెడు వహ్ని
బొమల మధ్యము నందున నమరియుండు,
నందు జీవుండు సేరెడు నపుడు నిద్ర
గ్రమ్మునదె సుషుప్తినా గ దగు, వత్స॥ 171

గీ॥ జాగ్రతందున జాగ్రత స్వప్నమును సు
షుప్తియును నంతరపు నవస్థాప్తి గలుగు,
స్వప్నమందున జాగ్రత స్వప్నమును సు
షుప్తియను మూడస్థలు సొప్పల వడు॥ 172

గీ॥ సుప్తియందున జాగ్రత వాప్తి స్వప్న
మును సుషుప్తియు ననుమూడు మొనసియుండు,
వీని వివరంబు తేటగా విశదపరతు
సావధానుండవై విను, సద్గుణాఢ్య॥ 173

గీ॥ పూర్వ పరిచితుడైనట్టి పురుషు డెట్టి
కేలకు దటస్థుడైనచో గేవలముగ
నాత డీతడె యనుపోలై యాత్మగలుగు
జాగ్రతను జాగ్రతందురు, సత్యచరిత॥ 174

గీ॥ అట్టి పరిచితుడు తటస్థ మైన యప్పు
డాతడేమో యనుచు సంశ యాత్మతోడ
నయ్య; నీవేన; వెంకయ్య వనుచు నడుగు
నదియె జాగ్రతలో స్వప్న మందు, రనఘ॥ 175

ఆ॥గీ॥ ఎరుకయైన మనుజు డెదురైన విస్మృతి
నెవరు మీరు, నామ మెద్దియనుచు
నెరుగనట్టు లడుగు టెద్దియో! జాగ్రత్తు
నందు సుప్తియందు, రనఘ చరిత॥ 176

ఆ॥గీ॥ కలను గనియు మేలు కాంచి స్వప్నమునను
గనినవెల్ల మఱపు గొనక తెలియ
జెప్పుచుండు తెలివి యొప్పను, స్వప్నము
నందు జాగ్రతనగ, నమల చరిత॥ 177

గీ॥ స్వప్నమందున గలగని జాగ్రతగొని
యేమి కలగంటినో; దాని నిపుడు చెప్ప
జ్ఞాపకము లేదుగాని, చ క్కనికల యను
నదియ స్వప్నములో స్వప్న మందు రనఘ॥ 178

గీ॥ స్వప్నమున స్వప్నముంగని స్వప్నముననె
జ్ఞాపకములేక విస్మృతి గలిగి సుప్తి
గొనుచు నుండుట యెద్దియో చనును స్వప్న
మందు సుప్తియనంగను నలరుఁ వత్స॥ 179

గీ॥ సుప్తి గొనియుండ నీగెలు సోకునెడను
చీమ కుట్టెడునెడ నందు జేయి జేర్చి
మరల వాటిని దోలక గురకవెట్టు
నదియె సుప్తిని జాగ్రత యందు రార్య॥ 180

గీ॥ సుప్తి నొందియు నందొక వ్యాప్తి కలిగి
అవు నవును నద్ది యద్దియే యనుచు బలికి
యేమిటదియని తెలిపిన నేమి లేదు
యనునదియె సుప్తిలో స్వప్న మందు రనఘ॥ 181

గీ॥ పండునెడ దోమలును నల్లు లుండి కరువ,
గదలకను చేయిచే బ్రామ కను బిలచిన
బలుకకను యూర్పుల మితంబు గలిగియుంట,
సుప్తిలో సుప్తియందురు, సుగుణ ధుర్య॥ 182

గీ॥ ఇవ్వియే మూడవస్థలం చెరుగుమయ్య;
యిందుపై దాపములు మూడు నెఱుగజేతు
నవియె యధ్యాత్మ మధిభూత మాధిదైవి
కమను నామంబు లందెను విమల చరిత॥ 183

## తాపత్రియము

గీ॥ ఆత్మ జన్యంబునకును న ధ్యాత్మికమని
భూతజన్యంబునకు నాధి భౌతికమని
దేవతా జన్యమున కధి దైవికమని
తాపములకు నామంబులై తనరు, వత్స॥ 184

సీ॥ తనదగు పరివార మునకేని, పశువుల
కేని బాధలు మూడు నెడను, తనను
నిష్కారణంబుగా నిందించు నెడలను,
యొరుల కన్నను ఆదన లకొక్కయెడను
గౌరవహీనత గలిగెడిచో, విద్య
ధనము లోపంబున్న, దారతమ్య
మెరుగని చోటున కేగెడునపుడు, ప
రాకునం జెడ్డకా ర్యంబొనర్చు

గీ॥ నప్పుడును, భార్యనెడబాసి నప్పుడును, ని
కృష్టసేవ లొనర్చెడు నెడ, దరిద్ర
తావసరమున దనకాప్త లరుగుదెంచు
నపుడు గల్గెడు తాప మ ధ్యాత్మమయ్య॥ 185

సీ॥ పులులు సిగంబులు నెలుగులు బందులు
కుక్కలు పిల్లులు నక్క లెలుక
లీగెలు దోమలు నేదులు జెఱ్ఱులు
నలులు పాములు తేళ్లు జీమ

లాబోతులును లూత లాదియగౌ జంతుల
కాటులు పోట్లు ర క్కురదములును
జాదులు చోరు ల సజ్జనుల్ జూదరుల్
త్రాగుబోతు లసూయ గ్రాగువారు॥

గీ॥ క్రూరులు నసత్య పరులును గొండెగాండ్రు
మొదలుగాగల వారిచే మూడునట్టి
బాధలకు నోర్వలేక తా పంబునొందు
నదియె యధి భౌతికంబునా నలరు, వత్స॥ 186

గీ॥ మూడు కోటుల దేవతల్ మొనసియుందురు,
వారి కపరాధులౌ నెడ వారివలన
బ్రాప్తమౌ బాధలకును దా పంబు నొందు
నదియె యధిదైవికంబని యందు, రనఘ॥ 187

గీ॥ ఇదియె తాపత్రయంబని యెఱుగు మయ్య;
యిందుపై బంచకోశము లెట్టులుండె
వాని వివరంబు దెలిపెద వరుసతోడ
నవ్వి గ్రహియింపు, మునిసుశ్రు తాభిధాన॥ 188

## పంచ కోశములు

గీ॥ అన్న మయమగు కోశము ననియు, బ్రాణ
కోశమనియు మనోమయ కోశమనియు
మఱియు విజ్ఞాన, మానంద మయమటంచు
బంచకోశంబు లి వియు, డిం భక; గ్రహించు॥ 189

సీ॥ అది పురుషుడైన 'యట్టి పరాత్పరు
నాత్మయం దాకాశ మవతరించె
నందు వాయువు దాని యందనలం బన
లంబున నీ రుద కంబు నందు
భూమియు నోషధుల్ భూమియందున బుట్టి
ప్రాణి కోటులకును నన్న మయ్యె,
అన్నమునను బ్రాణు లవతరించియు దాని
చేత జీవితములై చెలగి, యంచె

గీ॥ లీనమగుచుండె, నందుచే ప్రాణికోటు
లన్నిటికి నన్నమాధార మౌట దేహ
మన్నకోశం బనంగ ప్ర ఖ్యాతి గాంచి
జగమునందున విలసిల్లె. సద్గుణాఢ్య॥ 190

ఆ॥గీ॥ అన్నకోశమైన యట్టి దేహము గర్భ
మందునుంట, పుట్టు, టదియె పరిణ
మించి వృద్ధియై కృ శించి, నశించుట,
ముఖ్యమైన వృత్తి, ముద్దులయ్య॥ 191

గీ॥ అన్నమయ కోశమైన దే హాంతరమున
ప్రాణకోశము మూసలో పలను గరగు
కనకమును బోలి తేజంబు గ్రాలుచుండి
వాయుదశక సహాయత వరలు చుండు॥ 192

గీ॥ ప్రాణకోశమున మనోమ యంబుగలిగి
కలిసికొని స్మృతి భీతి వి కల్పములను
కామమాది షడ్వర్గంబు గదిసి, బుద్ధి
గూ డికొనియొప్పు చుండును, గుణ నిధాన॥ 193

గీ॥ ఆ మనోమయ కోశంబు నందు హత్తి
యుండు విజ్ఞానకోశంబు, యుక్తమైన
వేద శాస్త్రోపనిష దర్థ విధులదెలిసి
ప్రాజ్ఞత వహించి యుండును, భద్రశీల॥ 194

గీ॥ అట్టి విజ్ఞానమయకోశ మందు నిమిడి
సచ్చిదానంద రూపత సార్వకాల
ములను రాగాదులనువీడి చెలగు, నద్వి
తీయ మానందకోశము ధీ ప్రకాశ॥ 195

## అన్నకోశము

సీ॥ పుడమియందున గల భూతంబు లెల్లను
యన్నంబునను బుట్టి, యన్నమునను
జీవించు చుంటను జ్యేష్ఠ మన్నంబయ్యె,
నందుచే నదియ స ర్వౌషధమయె,

సర్వంబు నన్నమై జరుగుచు నుంటను
యన్నంబు బ్రహ్మగా నెన్నబడియె,
నందుచే నాయన్న మఖిల భూతంబులు
దినుచుండి వృద్ధియై తేజరిల్లె॥

గీ॥ నన్నమందున బుట్టిన యన్నసమితి
భుక్తి గొనుచును దానిచే బ్రోదియగుచు
నెసగుటను నన్నమెపుడు దూషించరాదు,
విదితమౌ యన్నకోశంబు నిదియె వత్స॥

సీసమాలికా

సీ॥ ఉర్వి యందున గల యోషధులెల్లను
నన్నంబునయ్యె, నా యన్నమందు
భూతముల్ జనియించె, బూతమౌ యన్నంబు
బ్రహ్మమటంచును బలుక బడియె
నన్నమందున బ్రాణ మావిర్భవించెను,
బ్రాణంబు దగనుంచ బడియె నన్న
మందున, నన్నంబు సమరె, నా యన్నము
యాహారమై యొప్పె, నన్నమునకు
నన్నమే యుదకము నయ్యెను, జ్యోతియే
యన్నంబు దినుచుండు, నట్టి జ్యోతి
యుదకంబునందున నుంచబడియె, నీరు
జ్యోతియందున నుండె, జ్యోతి యన్న
మందున నుండెను, నట్టి యన్నము భూమి
యన్నమయ్యెను, వ్యోమ మన్నముదినె
వ్యోమంబునను భూమి, భూమి యందావ్యోమ
మందు నన్నం బన్న మందు నన్న॥

గీ॥ మందుచే నన్నమే బ్రహ్మ మయ్యెగాన,
నన్నమును నిరసించరా దెన్నడైన,
నన్నమును సర్వదేవత లాశ్రయింతు,
రన్నమే ముఖ్యమయ్యె; యో కన్నతండ్రి॥

## ప్రాణకోశము

సీ॥ అన్నమునకు నంత రాత్మయౌ ప్రాణము
నొప్పను, యమర మ నుష్య సకల
భూతంబులకు నాయు వైతగ, సర్వాయు
వని దాని బ్రహ్మయే యర్థి గొలిచె,
నట్టిప్రాణము శరీ రాత్మయు బ్రహ్మము
నౌటచే భూతాళి యందె పుట్టి,
యందున జీవించి యభివృద్ధి నొందుచు
నందు లీనంబయి యమరుచుంట॥

గీ॥ బ్రాణము సమస్త దేహ సం త్రాణమును, బ
రాత్మయును, జగదాధార మైనదియును,
సర్వశక్తి మయంబును, సర్వగంబు
నైనదియె, ప్రాణకోశంబు నగును, వత్స॥

## మనోమయ కోశము

సీ॥ ప్రాణంబునకు నంత రాత్మయై యొప్పు మ
నోమయం బట్టి మ నోమయమున
సర్వభూతంబులు జననంబులై, యందు
జీవించు చందున జేరియుంట
నద్దియే బ్రహ్మము, నద్దియే సకలేంద్రి
యములకు కర్త, యూ హలను జేయ
నద్దియే ప్రాధాన్య మైనది, దానిచే
నన్నియు ప్రేరణ మగుచు నుండు॥

గీ॥ కర్తృకర్మ క్రియాత్మయై క్రాలునదియ,
ఇలను స్వచ్ఛంద వృత్తియై చెలగు నదియు.
మోక్షమున కాస్పదంబైన ముకుర మదియ
యన్ని మతములకును మన స్సగును వత్స॥

## విజ్ఞానమయ కోశము

సీ॥ ఆ మనోమయమున నంతరాత్మగను వి
జ్ఞాన మయంబుండె, దానియందు

నఖిల భూతంబులు నావిర్భ వించియు
జీవించు, చందున జేరియుండు,
విజ్ఞాన మందున యజ్ఞంబులును సర్వ
కర్మలు బ్రహ్మంబు గలుగుచుంట,
దనువునందున బాప తతివీడి, కోరెడు
కోరికలెల్ల జే కూరుటబ్బు,॥

గీ॥ వేద శాస్త్ర పురాణ శి ల్పేతిహాస
తతిపరిజ్ఞాన సుకృతి దుష్కృ తి విచార
ణాదికమును నాత్మా నాత్మ వేదితంబు
నైన విజ్ఞానమయ కోశ మమరు, దండ్రి॥ 200

## ఆనందమయకోశము

సీ॥ అట్టి విజ్ఞాన కో శాంతరాత్మకమయి
యానందకోశంబు యమరియుండు,
నానందకోశము నందున భూతము
లెల్లజనించి జీ వించుచుండు,
నానందమే బ్రహ్మ మౌటను యది యని
ర్వాచ్యంబు, నిర్ద్వయా ద్వైతభావ,
మాద్యంత శూన్యంబు, నవ్యయం, బచలంబు,
నిత్యంబు, సత్యంబు, నిర్మలంబు,॥

గీ॥ అహహ! యానందమయ కోశ మనెడునట్టి
దనటి బోదను గలసార మటుల మనసు
తక్కుకోశంబు లెల్లను దత్తిమి, లోన
దనరు, నానందకోశంబు, వినుతశీల॥ 201

గీ॥ ఇవియె పంచకోశంబులం చెరుగుమయ్య;
అన్నియును గూడికొని తొంబ దారు తత్వ
ములుగ నొప్పెను. యివియెల్ల దెలిసినాడ,
విందుపై ద్వాదశ మలంబు తెలుగ జేతు॥ 202

## ద్వాదశమలములు

గీ॥ మలము మూత్రంబు వీర్యంబు గులిమి పుసియు
క్రొవ్వు నెత్తురు మూల్గులు గోళ్లు చెమట
చీమిడియు నెమ్ములు ననంగ జెలగుచున్న
ద్వాదశ మలంబులివి సూవె, ధన్యచరిత॥ 203

గీ॥ ఆకలికి భుక్తిగొని న య న్నాదికంబు
జఠరవహ్నిని గ్రాగి పి ష్టంబునయ్యు,
నెనిమిదవ పాలు మలమునై దినమునకును
రెండు సారెలు వెడలుచు నుండెనేని
తనువు కారోగ్యమొదవును, తండ్రి; వినుమ॥ 204

గీ॥ మూత్రమనునది కొను జల మున స్థవిష్ట
భాగమై ద్రవమట్టుల బయలు వెడలు
దినమునకు నారు సారెలు దీనివలన
దనువునకు జాలసౌఖ్యంబు తగును, వత్స॥ 205

గీ॥ వీర్యమనునది తనువుల ద్వివిధముగను
దనరు, స్త్రీల యెడన్పుష్ప మనగ, బురుషు
లందు శుక్లమనంగను నలరు చుండి
జిగురువలె సోలెడుండును, చిరుతలనిడి
జీవితమొసంగుచుండును, చిట్టికన్న॥ 206

గీ॥ చానలకు నెలకొక్కొక సారె పురుషు
లకును మూడేసి దివసంబు లందు వెడలె
నేని యారోగ్యమును బల మిచ్చు వైప
రీత్యమైనను రోగముల్ రేగు, పుత్ర॥ 207

గీ॥ చెవుల రంధ్రముల్ దవుడల చేరువుగను
నుంట, గుటకలువేసెడి వెంట గొంత
ద్రవము గూబలజేరి ము ద్దగను నుంట,
గులిమియందురు దానిని మనన శీల॥ 208

గీ॥ కన్నులందున దూషికా ఖ్యమలముండు,
కలుగునెడను, వాతంబును గలుగునెడను,
వెన్నపూస వలె నైబ్కి వెడలుచుండు
నద్ది కన్నులకారోగ్య మగును, వత్స॥ 209

గీ॥ వస యనగ క్రొవ్వు నామమై యొసగుచుండు,
నద్ది మూడు తవ్వలు దేహ మందు నుండు,
నెడను సర్వావయవము ల హీనబలము
గనుటచే నట్టి వసయె, ము ఖ్యంబు, తండ్రి॥ 210

గీ॥ రక్తమనునది కుంచెడు ద్రవము సర్వ
నాళముల బ్రవహించుచు నవ్యధాతు
వృద్ధి నిచ్చుచు నెఱ్ఱగా నెసగుచుండి,
సప్త ధాతూర్ధమంబును జరుపు, వత్స॥

గీ॥ మజ్జ యన మూలుగులకు నా మంబు దనరు,
నద్ది శల్యాంతరంబుల నమఱి తవ్వె,
డన్నిటికి బలమొసగుచు నతి దృఢంబు
గలుగజేయును సుమ్మ; ని శ్చలమనీష;॥

గీ॥ గోరులనునవి కండువున్ శోకి యొండు
చోటు నను మఱలను గోకు చో దదీయ
మగు రసస్పర్శ విషతుల్య మై ప్రణాది
కంబు బరివృద్ధి నొందించు గన్నతండ్రి॥

గీ॥ చెమట యనునది శ్రమమును జెందునపుడు
నగ్ని యెండలు సోలెడు నపుడు వేడి
దినుసులను మెల్లమెల్లగా దినెడునెడను,
వెడలుటను సౌఖ్యమొదవించు, వినుతశీల॥

గీ॥ శ్లేష్మమనునది తనువున జేరి మూడు
మానికెలు గల్గి, గుండెలో మసలి, గొంతు
నందు నాసికా రంధ్రము లందు నుద్ధ
మించు, నది యెడ్డెనేని జీ వించుటరిది॥

గీ॥ అయ్య; షష్టియుక్త శత త్ర యంబును బదు
మూడు రూపులచేతను మొనసి దేహ
మందు నెమ్ములు దార్ఢ్యత నమరి రెండు
నూరుల పదియైనట్టి సం ధులుగ నొప్పి
వెలయుచుండును సుమ్మ, వి వేకశీల॥

గీ॥ అవని పశు పక్షి మృగ కీట కాది జంగ
మాదుల వ సాండ రక్త మాం సాంత్ర శల్య
ముఖపదార్థము లపవిత్ర ములువి భోజ
నార్హమని, మర్త్యకోటి వ నర్హము లని
యేర్పరచి భక్షణముసేతు, రెంతవింత॥

## ద్వాదశమలశుద్ధి

గీ॥ మూలుగులు క్రొవ్వు మలమును మూత్రమును రు
ధిరము శుక్లము ననునారు తీర్థ మృత్తి
కములచే శుద్ధియగు, దూషి కమును జెమట
గోరు లెమ్ములు చీమిడి గులిమియనెడు
నారు నుదకంబుచే శుద్ధి యగును, వత్స॥ 218

గీ॥ ఇవియె ద్వాదశ మలములం చెరుక పరచి
నాడను, గ్రహించితీవు, వి న్నాణముగను,
ఇకను షోడశాధారము లెఱుగజేతు,
నవియు గ్రహియింపు, మునిసువ్రతాభిధాన॥ 219

## షోడశాధారములు

గీ॥ శిరము తాడవ నుదురును శిఖయు కనులు
చెవులు మొగమును కంఠము చేతులును హృ
దయము నాభియు కటియు జా నుయుగ గుహ్య
జంఘ పదములు ధాతుల స్థలములగుట
షోడశాధారములు నివ్వె సుమ్ము, పుత్ర॥ 220

గీ॥ ఇవియె షోడశాధారము లవుట జీవ
ధాతువులు సంచరించెడి తావు, లందు
చే భిషక్కులు నాడెము జేసి జీవి
తమును గని పెట్టెదరుసుమ్ము విమలచరిత॥ 221

గీ॥ షోడశాధార నిలయముల్ సూచనగను
దెలియజేసితి నీవును దెలిసినాడ
వి కను జీవతత్వంబు నే నెఱుగ జేతు
సావధానుండవై విను, సద్గుణాఢ్య॥ 222

## కందగీత గర్భచంపకము

చ॥ వరవృషకేతనా; వరద;
పారిషదార్చిత; వామదేవ; శ్రీ
ధర వినుతా; హరా; పరమ
తాపసపోష భవాబ్ధి నౌక; ని

ర్భర విషభక్షకా; శశిధ
రా; విషమేక్షణ; శాంకరీశ; వి
స్తృర చరితా; సదా తమ ప
దంబులె నమ్మితిఁ దాన కల్పకా॥

## గర్భకందము

క॥ వృషకేతనా; వరద; పా
రిషదార్చిత; వామదేవ; శ్రీధర వినుతా
విషభక్షకా; శశిధరా;
విషమేక్షణ; శాంకరీశ; విస్తృతచరితా॥

## గర్భగీతము

గీ॥ వరద; పారిషదార్చిత; వామదేవ;
పరమ తాపసపోష; భ వాబ్ధినౌక;
శశిధరా; విషమేక్షణ శాంకరీశ;
తమ పదంబులె నమ్మితి, దానకల్ప॥

## నాగబంధము

చ॥ వరద; దశావతార; శుభ
వైభవ; రమ్యతనూ విలాస భా
సుర; పరమేశ; ధీర; వర
శూర; విపద్భవ పాశవారణా;
వరకవితా విచార; పరి
వారిత దుష్ట శఠా; దయాపరా;
పరవశ! భూతకారణ; సు
భాసుర సత్య విచారమేదురా॥



ఇది

ప్రౌఢసరస్వతి - స్మార్తసింహ - నూత్నమస్కరి
చేవూరి వేంకట సోమసుందరశాస్త్రి
విరచిత మానవజన్మ అను
జ్ఞానదీపంబున
చతుర్థోల్లాసము
ఓం తత్సత్ శ్రీ మత్పర బ్రహ్మార్పణమస్తు॥ శ్రీ

ప్రౌఢసరస్వతి గ్రంథమాల మేనేజరు
పంచవృత్తుల పురోహితులు
కవికుమార్ **చేవూరి భానుమూర్త్యాచార్య (శ్రీమూర్తి)**
బుక్కావీధి, విజయనగరం-2.

—o∩o—

పంచమోల్లాసము ప్రారంభం

## జీవతత్వ నిరూపణము

గీ॥ ఓ గురూత్తమ; విశ్వజ్ఞ; యోగివర్య;
ఈ యిలను జీవతత్వ మ దెందు బుట్టె
నెట్టి రూపము గలయది, యెందు నుండు
తనువులందెట్లు చేరును, తనువు విడచి
యెందునేగునొ యిది యాన తీయు, మార్య॥

గీ॥ ఓయి ముని సువ్రతా; మంచి యూహనీది
వాసవాదులు దెలియగా వశముగాని
గోప్యమును నావలన విన గోరినావు
నీకు దెలియంగ జెప్పెద, నెమ్మి వినుమ॥

సీ॥ అబ్బాయి; వినుము, నీ వడిగిన యట్టుల
జీవతత్వంబును జెప్పుటకును
ముందుగా నంతకు ముఖ్యమౌ బింబరూ
పంబగు నాపర బ్రహ్మమరసి
ప్రతిబింబ రూపమై పరగిన జీవత
త్వంబును దెలియగా వలయునందు
రా పరబ్రహ్మ స ర్వాత్మ, నిర్లేపము
విశ్వాత్మ మానంద విగ్రహంబు॥

గీ॥ సర్వశక్తి మయంబును సర్వలోక
వేద్యము, నిరంజనంబు, స ర్వేంద్రియజ్ఞ,
మాద్యము, విశుద్ధమును, బూర్ణ మైనదియును,
నాత నంబైన దొండుండె నాన్న; వినుమ॥

గీ॥ అట్టి పరమాత్మ యందున నఖిల జగము
నఖిల జగమును నిండె, స ర్వాత్మయనుచు
నెవ్వడరయునొ శోకమో హదు లట్టి
వాని నంటమి నానంద మూను, వత్స॥

గీ॥ సర్వభూతాంతరాత్మయై జరుగు యాత్మ
సచ్చిదానంద మయమయి చావు పుట్టు
కలును సుఖ దుఃఖ ములులేక గన్నుయైన
భాను డద్దోషమంటని పగిది సర్వ
భూతముల నివసించును, పూతచరిత॥ 5

గీ॥ పాంచభౌతికమును మల భరితమైన
తనువు జీవమువో జడా త్మకతనుంటి
కట్టెలనుబెట్టి యగ్నిలో గాల్చినను సృ
గాలములు దిన్న దెలియదుగా, యొకింత॥ 6

గీ॥ ఆత్మ యనునది పురుషుండు నతివ కాదు,
షండుడును మూర్తియునుగాదు, సర్వసాక్షి
సర్వజీవనమును ద్రష్ట సర్వపూర్ణ
మగుట జూడదు, వినదు, స త్యంబు వత్స॥ 7

గీ॥ ఇండ్లు నిర్మింప నిండ్లలో నెనయు నభము
ఇండ్లు గాలిన గాలక నెట్టులుండు
నట్టుల శరీరములు వోవ నంతరాత్మ
యెప్పుడైనను నశియింప కెసగు, దండ్రి॥ 8

గీ॥ చంపినను జంపితిననియు జచ్చునెడను
జచ్చితినటంచు ననుకొను జంపుటయును
జచ్చుటయు దానెఱుంగక సర్వపూర్ణ
మైన జీవాత్మ విలసిల్లు నయ్య; పుత్ర॥ 9

గీ॥ కత్తులును గోయులే వగ్ని కాల్చలేదు,
నీరు దడు పదు శోషింప నేరదనిల
మందుచే దునియదు కాల దది తడియదు
శోషిలదు, పూర్ణ మచలము సూవె, తండ్రి॥ 10

గీ॥ నామ రూప విభేదము లేమిలేక
సలరు నవ్యక్తమున నవి ద్యయను మాయ
వ్యాప్తమగుటను నామ రూపములనంది
కారణంబైన యాజగ త్కర్త యొప్ప॥ 11

గీ॥ ఎంత దనుకను మాయచే నెనయు భ్రాంతి
వశతనుండునొ; బంధము వదల, దట్టి
భ్రామికము వీడినంతనే బ్రహ్మపదము
సన్నిహితమై యెసంగును, కన్న బిడ్డ॥

సీ॥ పంచ భూతంబులై పరగిన భూ జలా
గ్న్యాశు గాకాశము లందు సాత్వి
కాంశలై ఘ్రాణ జి హ్వాక్షి చర్మ శ్రోత్ర
ములు, రాజసాంశల వలన వాక్కు
పాణి పాదంబులు పాయ్వు పస్థలు, రాజ
సాంశల బ్రాణంబు వ్యాన మును ను
దాన సమాన.మ పానంబులును, సాత్వి
కంబులవలన మ నంబు బుద్ధి,

గీ॥ బొడముటను బాంచభౌతిక మూలని, లింగ
దేహమని. నిశ్చయాత్మ బు ద్ధియని, సంశ
యాత్మ మనమని యనియెద, రాత్మయందు
నుంట గర్మను భవమును నొందు నవియె॥

గీ॥ అట్టి జీవాత్మ హృదయము నందునుండి,
ఆ నఖాగ్రముకే శాంత మైన దేహ
మంతటను నిండి యుండియు, నప్పనందు
దామరాకట్టులను సెలి ప్తత దనర్చు॥

గీ॥ అట్టి లింగ శరీరము నం దవిద్య
బెరసి, భగవదాత్మగ బ్రతి బింబితంబు
నయ్యు, జైతన్యమును బొంది వ్యావహార
జీవుడగు క్షేత్రజ్ఞుండు సెలగుచుండు॥

గీ॥ ఆకసంబున రవిబింబ మమరి చిన్న
యుదక పాత్రల ప్రతిబింబ మొప్పనటుల
తనువులందలి యంతఃక రణల నాత్మ
ప్రతిఫలించుటయే స్వభా వంబు, దంౘ్రి॥

గీ॥ అట్టి పురుషుడె యనాది యైన యట్టి
యిహపరంబుల గతియగు నెల్ల పుణ్య
పాపఫల భుక్తి జాగ్రత స్వప్నమాద్య
వస్థలను గుడుచువాడంౘ్రడు భవ్యచరిత॥

గీ॥ అద్దమందలి మలినము యాననమున
వ్యాప్తమైనట్టు లగపడి, వ్యాప్తిలేని
కరణ నంతఃకరణలతో గలియునాత్మ
దోషివలె గానవచ్చును దోషి కాడు॥ 18

గీ॥ ఆత్మ యంతఃకరణము ల న్యోన్య మిశ్రి
తాభిమానముచేత దుః ఖాదికంబు
నాత్మ బొందెడు రీతిగా నగపడుటయె
గాని తద్దోష మాత్మకు గలుగదెపుడు॥ 19

గీ॥ అట్టి నిర్లేపుడైనట్టి యాత్మ మూఢ
చిత్తుల కవిద్యాదోషము చేత నన్ని
చేయువానిగ రూపించి చెలగుగాని
కర్మఫలితము నొందడు కన్నతండ్రి॥ 20

గీ॥ అన్నమయమగు దేహము నందు హృదయ
మందు జీవుండు నివసించు, నా హృదయము
నాభి కూర్ధ్వము గంఠము నకు దిగు వను
పద్మముకుళంబు రీతిగా బరిఢవిల్లు॥ 21

గీ॥ అట్టి ముకుళం బధోముఖ మయ్యు, సూక్ష్మ
నాళమై యొప్పుచుండు, ద న్మధ్యసీమ
నెవరి ధాన్యపుములు బోలి నెగడ బచ్చ
నైనప్రభ దహరాకాశ మనగ దనరు॥ 22

గీ॥ ఆ మహాకాంతి మధ్యము నందు జీవు
డబ్జనాళము నూరు పా యలుగ జీల్చి
యందు నొక్కటి నూరగు నట్లు జీల్చ
నద్ది యెంతటి సూక్ష్మమో యంతసూక్ష్మ
మైన పరిమాణముగ నుండు నయ్య; పుత్ర॥ 23

గీ॥ అద్దియే యాత్మ్పరాఖ్యయై యలరు, సర్క
బింబ మెటు జలపాత్రల బింబితంబు
నై నటుల జంగమస్థావ రాదులందు
నమరి వర్తింపుచుండు, న నంతమగుచు॥ 24

గీ॥ అదియ హృదయంబునను దృఢ మగుచునున్న
యంతకును బ్రాణవాయువు నాని వెలికి
లోనికి నడపు జిమ్మన గోపి జలము
పీల్చి చిమ్ముచు నుండెడి విధిగ, దంద్రి॥ 25

గీ॥ కడిమి విరి కేసరంబుల కరణి హృదయ
కమలమున నుండి నాడులు గ్రమముగాను
దేహమంతట బ్రసరించి, దీప్యమగుచు
హితము బలము నొసంగుచు నెసగుచుండు॥ 26

గీ॥ అవియు డెబ్బదిరెండు వే లమరియుండు
నందులో నూట యొక్కటి యైన నాడు
లర్కు కిరణములట్టుల నగ్ని దీప్తి
గలిగి యడ్డుగ వ్యాపించి గడగుచుండు॥ 27

గీ॥ అట్టి నాడులు సకలేంద్రి యముల బదియు
బదియుగాజేరి స్వప్నాను భవములైన
సౌఖ్యమును బొందజేయుచు సార్వకాల
మాశ్రయించుచు నుండు గ దయ్య; పుత్ర॥ 28

గీ॥ నదులు నుదకంబు దాల్చు ప గిది సమస్త
కర్మఫలముల నాడులు గ్రమతదాల్చు,
వీటిలోన నొక్కటి శిరో వీధినంటి
యులరునాడి సుషుమ్న య నంత యంద్రు॥ 29

గీ॥ దానిచే బ్రోదియైన చై తన్యమే వి
బుధులు జీవాత్మ యందురు, పురుషు డొగి సు
షుమ్న మార్గముచే దీర్ఘ సుప్తి నొందె
రేని ముక్తిని గనునందు రిద్ధ చరిత॥ 30

గీ॥ రాహువెట్టు లదృశ్యుడై రాత్రి చంద్ర
మండలంబున రూపించు మాట్కి, సర్వ
గంబయిన యాక సంబొండు ఘటమునందు
నగపడెడురీతి లింగదే హంబునందు
నాత్మరూపించు మునిసువ్ర తాభిధాన॥ 31

గీ॥ నీటిచేనైన యుప్పు నా నీటవేయు
నంతలోన సదృశ్యమై యది జలంబు
నైనగతి లోన వెలినున్న యట్టి యాత్మ
తనువు వీడిన జను యథా స్థానమునకు॥ 32

గీ॥ తనువులందున జైతన్య తను వహించి
రాకపోకలు గలిమిని ప్రాణమునకు
జావు పుట్టువుల్ గలవని చర్చ చేతు
ఆత్మకవి రెండు లేవు సు మ్మయ్య; నిజము॥ 33

గీ॥ నీటితో పాత్ర లెండలో నిలుప వాటి
యందు బ్రతిబింబితంబైన యర్కుడట్టి
పాత్రలను దీయ నెప్పటి పగిదినుండు
మాట్కి జీవాత్మ యెన్నండు మారుపడదు॥ 34

గీ॥ వచ్చుటకు బోవుటకును ని వాసమునకు
తనువులాధారమని భ్రాంతి గొనుటె కాని
నిస్తరంగాబ్ధివలె నంత నిండియున్న
యాత్మకును రాకపోకలె ట్లబ్బునయ్య॥ 35

గీ॥ కర్మ తంత్రంబునకు నిన్ని కలవుగాని
జ్ఞాన మార్గంబునకు నెవ్వి కానరావు,
జగము మాయ యు బ్రహ్మమే సత్యమనెడు
నిజము గనుగొన దరియింత్రు నిర్మలాత్మ॥ 36

గీ॥ ఇదియ జీవతత్త్వము నెఱి గించినాడ
దీని దెలిసిన వాడె పో జ్ఞాన పురుష
డిద్ది తెలిసితిగద; యిక నిందుపైని
బలికెదను నే మహావాక్య పంచకంబు॥ 37

## మహావాక్య పంచకము

గీ॥ పలుకు బుక్కు ప్రజ్ఞానము బ్రహ్మమనుచు
స్థూల సూక్ష్మ కారణముల జోలివోక
చిత్స్వరూపత సాక్షియై చెలగు నెద్ది
అట్టి ప్రజ్ఞానమే బ్రహ్మ మని తెలియుము॥ 38

గీ॥ యజువనును, అహం బ్రహ్మాస్మి యని, ప్రపంచ
మాత్మనేపుట్టి నుండెను యందె కలసె
నట్టి కారణమగు బ్రహ్మ మైతి నేన
టంచు దెలిసిన సర్వజ్ఞు డగును, పుత్ర॥ 3

గీ॥ తత్వమసి, యని సామవే దంబు వలుకు
నంతటను బరిపూర్ణమై నట్టి జీవ
యైతివని యింతకన్న నీ యవని గలదె
దీని భావము నీయాత్మ దెలియు పుత్ర॥ 4

గీ॥ పలికెడు నథర్వ, మయమాత్మ బహ్మమనుచు
నా యనస్థాత్రయంబున నగపడెడు ప్ర
పంచరూపమౌ యీ యాత్మ బ్రహ్మమనుచు
దెలియ బంధముల్ వీడును, ధీప్రకాశ॥ 4

గీ॥ ఏతదేవాక్షరం బ్రహ్మ ఇదియ ఓంమ్మ
నుచును నాప్రణ వామ్నాయ మను, యదార్ధ
మందు సకల ప్రపంచంబు నిమిడియుండె
గాన దీని నుపాసించు మానవులకు
శాశ్వతంబైన మోక్షంబు సంభవించు॥ 4

గీ॥ ఇట్టివై తగు భావంబు లెఱిగి మనన
మాచరించిన, బంధము లన్ని వీడు
శాశ్వతంబైన యట్టి మో క్షంబు గలుగు
నిశ్చలానందుడవు కమ్ము, నీవు పుత్ర॥ 4

గీ॥ వేదము లుపనిషత్తులు సాదరమున
బలికె, నైదు మహావాక్య ములను, నివియె
నిశ్చయార్ధంబు లింతకం టెను తరింప
వేరు మార్గంబులేదు, వి వేక శీల॥ 4

గీ॥ ఇద్దియే జీవతత్వమం బెరుగుమయ్య;
యికను వృద్ధత్వ మరణాదు లెఱుగజేతు
నిందు పైని పెతరులు ద రించుమార్గ
మగుటన పరంబు నొడివెద నయ్య; వినుమ॥ 4

## వృద్ధత్వము

గీ॥ క్షణములో నిట్టి యౌవన మును గతించి
వృద్ధ దశ వచ్చు, డెబ్బది యేండ్ల, కందు
నింద్రియాదులు క్షీణించి యెల్లచింత
లొదవ, దీనత్వమున భువి నుండ గలుగు॥ 46

గీ॥ శ్లేష్మ మెల్లను గుండెలో జేరి, కుళ్లు
దగ్గులను రే బవళ్లును దగ్గుచుండి,
అలసటను జెంది, వాతము గలిగి, కాళ్లు
మెడయు చేతులు పృష్టంబు నడుము వంగు॥ 47

గీ॥ తలనెరసి గుండుపోలిక దగ, బలుచని
కడుపు ముడుతలువార, బ్రక్కటెముకలును
బోర గనుపడగా, వెన్ను పూసలన్ని
లెక్కగొసనొప్పి, వ్రేలాడు తొక్క గలిగి॥ 48

గీ॥ దృష్టి లోపము వినికిరి నష్టమును, బ
రాకు గొనుటయు, బోసి నో రగుటవలన
దొస్సెమాటలు, గాళ్లు సే తులును బలము
వీడి, కఱ్ఱ చేతనుబట్టి వెడల గలుగు॥ 49

గీ॥ అడు మాటయె మాటికి నాడుచుంట,
విసువునను నెల్లవారలు కసరుచుంట,
మాటి మాటికి నలుగుట, మనమునగల
కోరికలు వెల్లడింపక గుందుచుండు॥ 50

గీ॥ జఠరబలముడుగుటను బ చనముగాక,
నామ మెచ్చయి, నాలుక యందు జ వియు
లేక, చేదు పులుసును నోఱ్ఱి లేద నగను
మనను వ్యాపించి, యట్టులే తినుచునుండు॥ 51

గీ॥ నాయనా! అల్లకార్యము నకును వారు
పిలుచుచున్నారు వేగమ వెళ్లు మనిన,
ముసలివాడవు తినుకొని మూలనుండ
కిటుల పనులను జెప్ప నీ కేలనండు॥ 52

గీ॥ స్నానమొనరించు నప్పుడెంతేని యొడలు
దోముటకశక్తు డగుటను దుమ్ముమట్టి,
మలిన కాయుండు నశుచియై మసలి, రోగ
పీడితుండయి కృశియించు, వాడి దక్క॥

గీ॥ అన్నమరుగక, నిద్దుర రైనరాక,
నడువశక్తియు జాలక, గుడువలేక,
నింద్రియ బలంబు లెల్లను హీనమయ్యు
గడపుదురు, వృద్ధదశ యెంత కష్ట; మబ్బ॥

గీ॥ బాల్య యౌవన వృద్ధతా భావములివి,
యిందుపై లోకధర్మమై యెసగుచున్న
యట్టి యా మరణావస్థ యెట్టి విధమొ;
తత్క్రమంబును వినుము శ్రద్ధగను వత్స॥

## మరణావస్థ

గీ॥ ఇట్టి వృద్ధదశ ననుభవించు చుండ,
వార్ధకముకన్న రోగాది బాధకన్న
బహుదరిద్రత కన్న గొప్పదగు నట్టి
చావునందలి దుఃఖంబు సంభవించు॥

గీ॥ ముదిమినో; వ్యాధినో; శ్లేష్మ ముదగి, జఠర
వహ్నిమందమౌట, దినెడు వస్తువులొగి
నరుగమిని, భుక్తి దాహము లాన నొల్ల
కునికి, ధాతువుల్ శుష్కించు దనువునందు॥

గీ॥ తనువు ధాతువులను నేక మొనరుచు స
మానవాయువు గలుగమి, బాన భుక్త
రసములేమిని, బరిపక్వ రసము గలుగు
పండు, బరువున బడునటు పడును, తనువు॥

గీ॥ కఫము గొంతున దట్టమై క్రమ్మియుండ,
దనదు పరివారమెల్ల నత్తఱిని బిలువ,
బలుకుటకు శక్తిచాలక నలుదెసలను
దీనదృష్టుల నీక్షించు వెలవిమాలి॥

గీ॥ బంధు మిత్రులగల స్నేహ పాశములిటు,
లర్క సుతు నయఃపాశము లటులవీయ,
నేమి తోచక దిక్కుల నెల్ల మాటి
మాటికిని గాంచుచుండు, ను న్మాదివోలి॥ 60

గీ॥ కఫము కుత్తుకలోపల గ్రమ్ముచుండ,
గురక పెట్టుచు గూరుచొనుచు
నడిగడిగొ నన్ను రమ్మని యనుచునుండి,
రిదిగిదిగొ వత్తుననుచుండు, నేమతికను॥ 61

గీ॥ ప్రాణవాయువు జీవాత్మ యందునున్న
యట్టి యధ్యాత్మికాదుల, నవయవేంద్రి
యాది వాసనలను దీసి, యంత హృదయ
మందు నవవాయువుల గూడి యలరునప్పు,
డమితమై యూర్ధ్వనిశ్వాస లంకురించు॥ 62

గీ॥ మహితులగు పండితులు గొంత మంది యపుడు
తారకంబగు కర్ణ మంత్రంబొ; ప్రణవ
మో; షడక్షరియో; స్పష్ట ముగను నతని
కుడిచెవిని జెప్పుదురు ముక్తి కొరకు వడిగ॥ 63

గీ॥ భార్య యందున సుతులందు, భాగ్యమందు
గలుగు తగులంబుచేత నా క్రందనంబు
సేయుచుండిన, నీటిలో జెలగు పాము
గరుడునటు మిత్తి ప్రాణముల్ సరిగగొనును॥ 64

గీ॥ అపుడు తనలోన ననుకొను, యమభటాళి
చేత జిక్కితి; నికనేమి చేతు; నెందు
బోదు యెద్దియాధార మీ మీద ననుచు
దలచుచును, బ్రాణములువీడు తనుపునందు॥ 65

గీ॥ జ్ఞానులై యున్నవార ల క్కాలమున సు
షుమ్న నాడిని ప్రాణముల్ జొనిపి, నేత్ర
మార్గముననో; కపాలంపు మార్గముననో;
విడిచి, ముక్తిని గొంద్రు వి వేకశీల॥ 66

గీ॥ ఎన్ని భూషణములు దాల్చి యున్నదైన,
నెన్ని వస్త్రములను గట్టి యున్నదైన,
నాత్మ విడిచిన దేహంబు నంటరొకరు,
కట్టడిగ దాని జేయితో ముట్టరొకరు॥

## దేహవ్యాపారములు

సీసమాలికా

సీ॥ తనువునందున నెన్ని తత్వంబులుండెనో;
వచియింపనేరికి వశము కాదు,
గాత్రంబునకు నెన్ని కర్మలు గలిగెనో;
పలుకుట కేరికి వలనుపడదు,
వపువున కెన్నెన్ని నిపుణత లుండెనో;
తెలుపుట కేరికి దెలియ బడదు,
బొందికి నెన్నెన్ని బందు కట్లుండెనో;
లెక్కించ నేరికి చిక్కబడదు,
మేనికి నెన్ని వి న్నాణములుండెనో;
గణుతింప నేరికి గాన బడదు,
కాయంబు కెన్ని శృం గారంబులుండెనో;
యెన్నుటకేరికి నెఱుగబడదు
శారీరమునకు విలా సము లెన్నియుండెనో;
వర్ణింపనేరికి వలను పడదు,
దేహంబునకు నెన్ని దేశభాషలు గల్గె
నుడువుట కేరికి తడవులేదు,
ఒడలున కెన్నెన్ని యోగంబులుండెనో;
పరిగణింపగనే రి కివవు పడదు,
అంగంబునకు నెన్ని యాసనాదులు గల్గె;
నభ్యసించుటకును నలవికాదు,
మేయికి నెన్ని యు పాయంబులుండెనో;
యెన్నుట కేమైన తెన్నులేదు,
పీనుగకెన్నెన్ని విధులు గల్పించెనో;
దేవునికైనను దెలియబడదు,

గీ॥ ఇటుల దేహప్రవృత్తుల నెల్ల యెడల
గలుగునటు చేసె, మాయచే గర్తయైన
యా పరాత్పరు, డహహా; యే మనగవచ్చు,
యీ ప్రపంచపు మహిమంబు యిట్టులుండె॥

గీ॥ కోటి మన్మథాకారుడై నీటు గులుకు
వానినైనను, ప్రాణంబు వదలినంత,
నొక్క క్షణమైన నింటిలో నుంచకను, శ్మ
శానమునకును మోసుక జనుదురయ్య॥ 69

గీ॥ ఇట్టియే మరణావస్థ, యిందుపైని
ప్రేతకర్మ విధానము, పూతమైన
నిత్యకర్మయు, జెప్పెద నియత చిత్తు
డై వినదగును, ముని సుమిత్రాభిధాన॥ 70

## ప్రేతకర్మ

గీ॥ ప్రాణములు పోయినంతనే; పంచ గవ్య
ముల నొసంగియు, సుత్క్రాంత మునకు గోవు
దానమిడి, హోమమును జేసి, తచ్ఛవంబు
పైని నూతన వస్త్రంబు నునిచి, దాని॥ 71

గీ॥ ఇల్లు గడలించి, యూరుదాటించి, రుద్ర
భూమికిని యూరికిని మధ్య మూడుచోట్ల
దించి, భూతములకు బలు లుంచుచును, ప్ర
దక్షిణలు చేయుచును, కర్త తక్షణంబు॥ 72

గీ॥ చితి దరిని చేర్చి, వీర్వోసి, చేరి స్నాన
మొనర జేయించియును, గవ్య ముల నొసంగి,
చితిని దక్షిణ శిరముగా జేర్చి, కుడి భు
జమున హోమంబుజేసి, వ వక్త్రము బిలముల
బియ్యమును వేసియు, ముఖాగ్ని బెట్టుదురోగి॥ 73

గీ॥ వైష్ణవులు భక్ష్య భోజ్యముల్ వండి, పాంత
గూరుచొని తత్పదార్థముల్ గుడిచి దైవ
భజన చేయుచు, నపుడు శ వంబునెత్తి
రుద్రభూమిని దహియింత్రు భద్రముగను॥ 74

గీ॥ శైవు లుత్క్రాంతి మర్యోడు సమయమందు
సతని కుడిచెవిలోన ష డక్షరంబు
బిగ్గరిగ జెప్పి, కూర్చుండబెట్టి, పిదప
స్నాన మొనరింపజేసి భ స్మంబు నలది॥ 45

గీ॥ రుద్ర భూమికి దోకొను త్రోవయందు
మూడుచోటుల దింపి యు, భూతములకు
బలు లొసంగుచును, శ్మశాన వాటికందు
దింపి, ఖాతమునపుడు శుద్ధి యొనరించి॥ 76

గీ॥ ఖాతమున స్వస్తికాసను గా నుదఙ్ము
ఖునిగ గూర్చుండబెట్టు చే తనొకపార్ది
వంపులింగంబునిచ్చి, కర్త వానిచేత
దాని నభిషేచనంబు పత్ర కుసుములిడి
యుప్పు వేసియు బూడ్చెద రొప్పుగాను॥ 77

గీ॥ భ్రూణ హత్యాదికంబున బోవు వారి,
భయదమై యొప్పెడి మసూచి బాధచేత
మందువారిని తుప్పల బందలంబు
బారవైచెద, రది నక్క పాలుగాగ॥ 78

గీ॥ మఱియు గొన్ని మతస్థులు మంచివస్త్ర
ములనుగట్టి, గంధ ద్రవ్య ములను వేసి
యిటుకలను గట్టి యందులో నిమిడిపెదరు;
పెట్టెలందుంచి కొందరు బెట్టు దురొగి॥ 79

గీ॥ వారణాశిని మరణించు వారికిని ము
ఖాగ్ని వెట్టియు సంస్కార మాచరించి,
పిమ్మటను గంగలోన ప్ర వేశపెడుదు
రిద్దియే ప్రేత సస్కార, మిందుపైని॥ 80

## నిత్యవిధి

గీ॥ కర్తలొగి మంచి దినమున కర్మ చేయ
కర్తలొగి నూత్నవస్త్రముల్ గట్టికొనియు,
నగ్న సంజ్ఞిక ప్రచ్ఛాద నంబు నొకని
కబ్ది జీవన ధాన్యాదు లన్ని నిచ్చి,
నిత్యవిధి గంగయొడ్డున నియతముగను॥ 81

గీ॥ అందు శైవులు బంచలిం గార్చనంబు
జేసి, ప్రేతశిల ప్రతిష్ఠ జేసి యందు
మృత్తికాస్నాన వాసోద ములు తిలోద
కములు పిండ ప్రదానముల్ గడుపుదురొగి॥ 82

## దశాహకర్మ

గీ॥ పదియవ దినాన జ్ఞాతులు బంధువులును
గ్రామవాసులు నితరులు గలిసి ప్రేత
తృప్తికొరకు ధర్మోదముల్ తిలలతోడ
ధారలిత్రు, జలాశయ తీరమందు॥ 83

గీ॥ అంత పచ్చిల వస్త్రము నందు బొదివి
భూమికొ వియత్తుకొ నభ మునకొ దిశకొ
సువరమునకో జలంబుకో జొరుమటంచు
లోతు నీటికి నేగి యా లోన విడుచు॥ 84

గీ॥ అత్తరిని సచ్చట న ఘూప నుత్తిహోమ
మును తి లామల కస్నాన మును నొనర్చి,
యంతనానందహోమ పు ణ్యాహవాచ
లములు సలిపియు, కర్త గృ హముకు వచ్చు॥ 85

## ఏకాదశాహకర్మ

గీ॥ పదునొకంటను మూకత బధిర తాంధ
తయును పైశాచికాది బా ధలొగి ప్రేత
నంటకుండగ సంకల్ప మాచరించి,
గణపతిని గొల్చి పుణ్యాహ మును నొనర్చి॥ 86

గీ॥ మఱి వృషోత్సర్జనంబు, హొమంబు, గోవృ
షముల ముద్రించి భూమిభా గమున విడుపు,
వత్సరపుసా పిండ్యము వలను వడమి,
షోడ శశ్రాద్ధ మొనరింపు చుంద్రు వత్స॥ 87

గీ॥ మానితంబగు ద్వాదశ మాసికములు
మఱియు త్రైపక్షి కోన షా ణ్మాసి కోన
శరద, వసు, రుద్ర, గణ, వృషో త్సర్గ నావ
శిష్ఠములను పంబొమ్మిది చేయుటకును॥ 88

గీ॥ పది.యు తొమ్మండ్రు నందు ప వాసముంచి
కాళ్లు గడిగియు, నర్ఘ్యాది కం బొసంగి,
భుక్తినిడి దక్షిణలును తాం బూలము లిడి,
పిమ్మటను పెతరులకును పిండములిడి,
కర్మ దీర్చుచునుందు రే కాదశమున॥ 89

## ద్వాదశాహసాపిండ్యము

గీ॥ ద్వాదశాహంబునందు బె ద్దల యనుజ్ఞ
వడసి, సాపిండ్యమును జేయ గడగి హస్త
మందు దర్భపవిత్రము ల మరిచియును
యంతటను పునస్సంధాన మాచరించి॥ 90

గీ॥ విధిగ నౌపాసనంబును వ్రేల్చి, కాల
కామకులను విశ్వేదేవ ఘనుల, ప్రేత,
తత్పితృపితా మహప్ర పి తామహులను,
శ్రాద్ధ రక్షక విష్ణువు సంజ్ఞవారి
గొనుచు, సాపిండ్య సంకల్ప మును నొనర్చి॥ 91

గీ॥ క్షణములిడి, చౌకము త్రికోణ మును నుః వర్తు
లములుగా, వాకిటను మండ లములుదీర్చి,
గంధ పుష్పాకత కుశల కలయ చల్లి,
ముందు విశ్వేల జౌకము నందు నిలిపి॥ 92

గీ॥ కాళ్లు గడిగి, త్రికోణము కడను తండ్రి
యైన ప్రేతకు గాల్గడి, గచట గుండ్ర
మందు దక్కిన ముప్వు ర కుం దడవక
కాళ్లు గడిగి, నట్టింట జ క్కగను జేర్చి॥ 93

గీ॥ విశ్వేలను ప్రాఙ్ముఖులుగను, ప్రేత భోక్త
తత్పితృ పితామహ ప్రపి తామహుల, ను
దఙ్ముఖులుగను, విష్ణు ప్ర త్యఙ్ముఖునిగ,
క్షణములును, దర్భలను, నా సనము లొసగి॥ 94

గీ॥ అర్ఘ్యములు విశ్వేలకు నిచ్చి, యర్చనంబు
జేసి, ప్రేతకు పితలకు చిత సదర్ఘ్య
ము లిడి, ప్రేతపాత్రర్ఘ్యము ముపుర పాత్ర
లందునిడి, నల్వురకును న ర్ఘ్యము లొసంగి॥ 95

గీ॥ అర్చనలు జేసి, విష్ణువు కర్ఘ్యమిచ్చి,
యర్చన మొనర్చి, పంచభ క్ష్యముల నిడియు
భోజనము సెప్పి, రక్షోఘ్న ములు బఠించి,
అన్నమున నాజ్యతిలలు ద ధ్యాద్రకములు
జేర్చి, నాలుగు పిండముల్ జేసి, యంత॥ 96

గీ॥ ప్రేతకొక పిండ మిడియు, ద త్పితలుముపుర
కున్ను మూడు పిండములేసి కొనియు, ప్రేత
పిండమును మూడుజేసి, యా పిండములను
గలిపి, గోదాన మిచ్చియు, ఘనత మీఱ॥ 97

గీ॥ స్వర్గ పాదేయమిడి, పిండ సమితి పూజ
చేసి, వాటిని గంగలో జేర్చి, స్నాతాన
మాడి, కర్మణః పుణ్యాహ మపుడు చేసి,
బంధు సంతర్పణ మొనర్చు భక్తిమీర॥ 98

గీ॥ ఏవి మాసిక, సాంవత్స రీవిమోక
ములును, సాంవత్సరిక శ్రాద్ధములు మహాల
యాదు లున్నంత వరకును నాచరించు
చుంద్రు, పితృభక్తి పరులు ప్రచురముగాగ॥ 99

గీ॥ ఇది యపరకర్మ కొంచెము యెరుగజేసి
నాడ, నిది తెలిసి కొంటివి, నేడు, యివ్వి
ముఖ్య షోడశ సంస్కార ములుగ గొంద
రేర్పరచి, రెల్ల మానవు లిటుల నడువ॥ 100

గీ॥ తాత జీవించి తండ్రియే తరలెనేని,
తండ్రి తాతలవలె నొక్క తండ్రిసెన్ని,
తల్లి జీవించి భార్యయే తరలెనేని
భార్యనే రెండు సారెలు బలుకుచుంద్రు॥ 101

గీ॥ తండ్రి సాపిండ్యమందు ము త్తాత స్వర్గ
మంపబడు పినపెదతండ్రు లాచరించు
శ్రాద్ధమునను నాతనినె వ ర్గ త్రయంబు
నందు బిలిచెద, రీ పిండ మందుటకును॥ 102

గీ॥ వపువునను జీవతత్త్వంబు వదలినంత
కర్మవశతను జన్మమే కలుగుచుండు,
తండ్రి, తాతయు, నాతని తండ్రులుండి,
పిండములు దినవత్తురే నిండుగాను॥ 103

గీ॥ ప్రేతయని పదియురెండ్వా ళ్లు బిలుచుచుండి,
యంత సాపిండ్య సమయము నందు మొదలు
వసువులని, రుద్రులాదిత్య వరులటంచు,
బిలుచుచును, వేయుచుందురు పిండములను॥ 104

గీ॥ ఇవ్వి యన్నియు జూడగా నెంతమాయ
గాను దోచుచునుండె నీ కర్మలెల్ల
దానములు బట్టి జీవింపద లపుగాని,
పరము సాధింప నివియెల్ల పనికిరావు॥ 105

గీ॥ కర్మ లావట వృక్షము కరణి వ్యాప్త
మగుట ఛేదించుటకు శక్య మగునె, జ్ఞాను
లవ్వితెగతీసి పరమార్థ మందు నుందు,
రికను మతముల దెలిపెద నిద్ధ చరిత॥ 106

## మతములు

గీ॥ మతమనగ నిష్టమునకు నా మంబు నయ్యె,
గౌరవస్థుల యిష్టమే కరణి నుండు
నట్టులను నాచరింప మ తాచరణము
ననుచు నందురు, మునిసువ్ర తాభిధాన॥ 107

గీ॥ దేవుడొక్కడె యనుచును దేశదేశ
మానవావళికి విశద మైనదైన
ప్రబలురగువారు లేచి ప్ర ప్రథమ మందు
మతము లేర్పరచితి రైక మత్యముచెడ॥ 108

గీ॥ అస్తికము నాస్తికమ్మను ననగ రెండు
మతము లందాస్తికము ద్వైత మతమనియును,
నద్వయిత మనియును, విశి ష్టా ద్వయితము
ననియు, మూడు తెఱంగుల నలరుచుండె॥ 109

గీ॥ అట్టి మతములు లోకము నందు దొలుత
నారు స్థాపింపబడె, శైవ మనియు వైష్ణ
వమును సౌరగాణాపత్య బౌద్ధములని
మరియు శాక్తేయమనగ ష ణ్మతములుగను॥ 110

గీ॥ అందుపై మఱికొందరి యభి మతమున
బదియునెనిమిది మతములై ప్రబలియుండె,
నిప్పుడెన్నేని మతము లీ యిలను వృద్ధి
గాంచి గమనింప బడుచుండె, గన్నతండ్రి॥ 111

గీ॥ ఈ మతంబులు గమనింప నెన్నియన్నొ
దేవతలు, వారి కొలువుల దెలుపు నట్టి
శాస్త్రములు, మూర్తులేర్పరు పబడి ద్వంద్వ
భావమున కాస్పదంబయ్యె వసుధయందు॥ 112

గీ॥ అజుడు దపమాచరించెను హరుడు దపము
నాచరించెను, హరి తప మాచరించె,
ననుచు గ్రంథములందున ననిరి, వీర
లె వని ధ్యానించిరో; దాని నెఱుగ వలయు॥ 113

గీ॥ హర హరి విధాతృ శక్ర భా స్కరుల, బంచ
భూతములను ని విద్యచే బుట్ట జేసి
విశ్వమును గల్పించిన వేద వేద్య
నామక బ్రహ్మమే ప్రధా నంబు, వత్స॥ 114

గీ॥ మాయచే లోకములను ని ర్మాణ మొనర
చేసిన యనాది నిధ నుండు భాసురుండు
నా జగజ్జనకుండె స ర్వాశ్రయుండు
ననుచు దెలియుము, ముని సువ్ర తాభిధాన॥ 115

గీ॥ అట్టి మతములచే గొల్వ నట్టి దేవ
బృందమును దెల్పు శాస్త్రముల్ వేదములను
నుపనిషత్తులు గల్పించి రుర్వియందు
వాటి నామంబు లిందున జేట పఱతు॥ 116

సీసమాలికా

సీ॥ ఆ శంభువే దైవ మన్యము లేదని
శైవాగమంబులు చాటుచుండు,
విష్ణువు కన్నను వేరు దైవము లేద
టంచు వైష్ణవములు నెంచుచుండు,
మనసు నిర్మలతయే ఘనదైవ మన్యము
నాస్తియంచును జైన మనుచునుండు,
అల్లా మహా ప్రభుం డాది దేవుండని
పూనికతోడ ఖురాని బలుకు,

క్రీస్తుదేవుడు మన కే వలరక్షకుం
డనుచు బైబిలు వేద మనుచునుండు,
అన్ని విభూతులే నైతినంచును గీత
యందున శ్రీకృష్ణు డనుచునుండు,
నా కంటెనన్యమి లోకమందున లేద
టంచు శ్రీరాముతో ననియె హరుడు,
తల్లి దండ్రి గురులు దైవములని తైత్తి
రీ యోపనిషదము గూయుచుండు,
పరగు ప్రజ్ఞానమే బ్రహ్మమటంచు ఋ
గ్వేదంబు చాటుచు వెల్లడించు,
పరవశంబున నహం బ్రహ్మాస్మి యని యజు
వేదంబు నిజముగా విశద పఱచు,
అవ్యక్తమగు తత్వ మసి యంచు సామంబు
యెల్ల కాలంబును వెల్లడించు,
అక్షిగోచర మయ మాత్మ బ్రహ్మయటంచు
థర్వవేదంబు స త్యముగ బలుకు,
ప్రణవమే సాక్షాత్ప ర బ్రహ్మ మనుచును
వేదోపనిషదముల్ వెల్లడించు,
నాదబిందు కళల్వి నా యెద్దిలేదని
వేదాంత శాస్త్రముల్ విశద పఱచు,
పంచముద్రల యందు పరమున్నదనుచును
వేదాంతశాస్త్రముల్ వెల్లడించు,
మంత్ర జపంబుల మహిమ గల్గునటంచు
నిఖిలాగమంబులు నిలిచి చెప్ప,
తపములలో నిజ తత్వమున్నదటంచు
నిగమాగ మంబులు నెరివచించు,
పరిపూర్ణమును పాంచ భౌతిక మసదని
పదిరెండు పదియారు బలుకుచుండు,

గీ॥ ఇట్టి పేరులు పెట్టుచు నెవ్వరెవరి
భావముల దలపోసెడు ప్రాజ్ఞులెల్ల
రిహపరంబుల రెండిట నిష్ట కామ్య
ముల ననుభవించు చుండుట ముఖ్యమగును॥ 11

గీ॥ ఇంక నెన్నియో మతములు నెన్నొ క్రియలు
పరమ పదమును బొందనే ర్పరుపబడియె
నిందు నెద్ది నిజంబొ యి వెల్ల నిజమొ;
సంశయాత్మకు లివియెల్ల జరుపుచుండ్రు॥ 118

గీ॥ నామ మక్షరతత్త్వంబు నను జనించె
ననుచు దెలిసియు నీయాత్మ యందు నిజము
జూచి నామరూప క్రియా శూన్యమైన
యట్టి పరమాత్మ ధ్యానింప నబ్బు, ముక్తి॥ 119

గీ॥ ఇవ్వి మతములటంచు నే నెఱుగజేసి
నాడ దెలిసితిగద; యిక నరుడొనర్చు
పుణ్యపాపంబు లెట్టివో పొందుగాను
వాని సంగతి వినుమయ్య వీనులలర॥ 120

## పుణ్యపాపములు

గీ॥ కోటుల కొలంది గ్రంథముల్ గూయుచున్న
ధర్మములు రెండువాక్కుల దగవచింతు,
బాని యుపకార మొనరింప బుణ్యమగును,
పరగనపకార మొనరింప బాపమగును॥ 121

## పుణ్యము

సీ॥ శమ దమాదిక ధర్మ సంపద్విశిష్టులౌ
బ్రహ్మవేత్తార్చన పరత యొండు,
సద్గుణోపేతులై సతతంబు పితలను
దనిపెడి సుతులను గనుట రెండు,
అమృతోపమాన జలాశయంబులు మెండు
త్రవ్వించి జీవుల దనుపు మూడు,
ఎడలేక గాచి పూచెడు సత్ఫలానేక
హరామ సంస్థాప నాప్తి నాల్గు,

మృదు మధురోక్తులు వ్రేదచల్లు సత్కృతుల్
గవులచే ననిశంబు గాంచుటైదు,
అఖిలాంత రాత్ములౌ హరి హరాదుల యాల
యప్రతిష్ఠాపన మమర నారు,
అంతటి కాధార మౌ ధనం బవనిలో
నిక్షేపణంబును నెఱపు టేడు॥

గీ॥ ఇట్టి నప్త సంతానము లిలనొనర్చు
ఘనులకును బ్రహ్మలోక నా క శివలోక
విష్ణులోకాది సౌఖ్యముల్ వెలయుననుచు
నాచరించుచునుందురు పుణ్యాత్ములవని॥ 122

గీ॥ ఒక రొనర్చిన మేలును నుల్లమందు
మరువ కునికి కృతజ్ఞతై పరగుచుండు,
నట్టి మేలును మఱువని యట్టివారు
స్వర్గగాములు నౌదురు సద్గుణాఢ్య॥ 123

గీ॥ సకల జీవుల యెడ దయ క్షాంతి శౌచ
ముకృపణతయు ననాయాస మస్పృహతయు
మంగళం బనసూయ త నంగ నొప్పు
నెన్మిదియు నాత్మయందున నెనయు మేలు॥ 124

గీ॥ దమము శమమును నిర్లోభ తయు విరాగ
మింద్రియ జయంబు నీగియు నెల్లరియెడ
ప్రేమ మక్రోధమును సదా భీతి శోక
ముల విడుపు జ్ఞానమునకును ముఖ్యమయ్య॥ 125

గీ॥ అట్టులనుగాక పరిపూర్ణు లైన జ్ఞాను
లుత్తరాయణగా ములై యొప్పి, మఱల
బుట్టువులులేని బ్రహ్మైక్య మున గమించి
సంతతానందులై యుంద్రు సద్గుణాఢ్య॥ 126

గీ॥ ఇష్టమును బూర్తమును నన నెసగునట్టి
కర్మలును సంతత పరోప కార బుద్ధి
యన్నదానమ్ము బహుసత్క్రి యాచరణము
బొంకమియు సాధు సంశేవ పుణ్యములగు॥ 127

గీ॥ తపము దానము సత్యము దైవభక్తి
వ్రతములును యజ్ఞ కర్మలు పితృసమర్చ
నమును యోగీశ్వరారాధ నమును న్యాయ
మార్గ సంచారమును బుణ్య మబ్బునండ్రు॥ 128

గీ॥ ధరణి పుణ్యార్థి షోడశ దానములను
జేయు, బుణ్యాత్ములే వాని జేకొనియును
ఇహమునసె సంతసము సౌఖ్య మెలమినొందు
దాత పరసౌఖ్యమును బొందు బ్రీతితోడ॥ 129

సీ॥ గోదాన మిచ్చిన గొప్ప పుణ్యంబందు
రా పుణ్యమెవరిదో యరయవలయు
భూదాన మిచ్చిన బుణ్య మంచని యెద
రా పుణ్యమెవరిదో యరయ వలయు
కన్యం దానంబీయ గడుపుణ్యమని యెద
రా పుణ్యమెవరిదో యరయ వలయు
వస్త్రదానం బీయ వచ్చు బుణ్యమటందు
రా పుణ్యమెవరిదో యరయ వలయు॥

గీ॥ పాలుద్రాపుట భూమిపై బంట దినుట
కామసౌఖ్యంబు సంతతి గలుగుటయును
కట్టి కొనుటయు గలుగును గాన నివ్వి
పుచ్చుకొను వారిదే యిహ పుణ్యఫలము॥ 130

గీ॥ ఇంక నెన్నెని పుణ్యము లిలను గలవు
యవ్వియెల్లను సద్గతి కాస్పదంబు
లగుట బరలోక సౌఖ్యంబు లంది, మఱల
భువిని పుణ్యుల గృహముల బుట్టుచుండ్రు॥ 131

## పాపకర్మలు

గీ॥ పాపకర్మ లనేకము బరగు చుండు,
నైదు పాతకములు, స్మృతి నైన విస్మృ
తిగను నైనను జేయుచో జగతియందు
నిష్కృతి యొకింత లేదండ్రు, నిర్మలాత్మ॥ 132

గీ॥ కనకమును దొంగిలించుట, కల్లు ద్రావు
టయును, గురుపత్నితోడ గ వయుట, దొంగ
తనము, ద్యూతంబు వృత్తుల దగినవారి
తగులమును, భువి పంచపా తకములండ్రు॥ 133

గీ॥ ఇంక మఱి కొన్ని పాపము లిలను గలవు,
వాని జేయుచు నుండెడి వారికెల్ల
నరకవాసము గలిగెడి ననుచు నెంచి,
నిష్కృతి యొనర్చెదరు, శాస్త్ర నియతి ననఘ॥ 134

సీ॥ పరగుచుండును మహా పాతకములు, నతి
పాతకములు, నను పాతకములు,
నుప పాతకములును, నొప్పుగా సంకలీ
కరణములు, మలినీ కరణములును,
నని, నపాత్రీకర ణములు, జాతి భ్రంశ
కరములు, నవకీర్త కములునుం బ్ర
కీర్ణక ములునాగ గిల్బిషములు, నివి
తెలిసి చేసిన, మఱి తెలియకనొగి॥

గీ॥ చేసిన, తెలిసి తెలియక జేసినను, ని
రంత రాభ్యాసముననైన, వింత నొక్క
సారె చేసిన, నరకము సంభవించు
ననుచు, నిష్కృతి జేసెద రవి తొలంగ॥ 135

గీ॥ ఇంక మఱి కొన్ని పాపము లిలను గలవు
పర వధూ పరధన వాంఛ, పరుల నింద
సేత, యనృతంబు వలుకుట సేగి నలుపు
టయును, బాపంబులందురు, నయగుణాఢ్య॥ 136

గీ॥ ఒరులచే జేయబడి నట్టి యుపకృతి నొగి
మఱపు గొనుట కృతఘ్నులై వరలు, నదియె
పాతకంబులకెల్ల గొ ప్పది యగుటను
ననిశమును మేలు మరవరా దందురయ్య॥ 137

గీ॥ మనసునను, వాక్కునను, శేఫ మునను, గర్భ
మునను, జేతుల, గాళ్లచే తను, నహర్ని
శమును నొనరించు దుష్క్రియా సమితి వలన
బాప మబ్బునటందురు బాలక; విను॥ 138

గీ॥ మనసుచే జేయు పాతక మనగ గడుదు
రూహలను నెల్లవేళల నూహచేసి
యొరుల కపకార మొనరించు చుండుటయె, మ
నో దురితమందు రద్దాని, మోదకలిత॥ 139

గీ॥ వాక్కుచే బంటుబూతులు పలుకుటయును,
నసృతమాడుట, తబ్బిబ్బు లాడుటయును,
డంభములు పల్కుటయును, సం రంభవాక్కు
లాడుటయును, వాక్పాప మ టందురయ్య॥ 140

గీ॥ మన్నన లుచుట, పుడుకలు మఱి తునుముట,
తన పఘువుకాక నన్యకాం తల పయోధ
రములు పట్టుట, నరకుట యు, మొదలైన
యిట్టి విదె కరపాతకా లందురయ్య॥ 141

గీ॥ మెట్టరాని ప్రదేశముల్ మెట్టుటయును,
సేమనుల నాల నెద్దుల బెలియులను స
హోదరుల గోపమాపమి నెక్కపెట్టు
కాలదాచుట, పదముల కలుషమయ్య॥ 142

గీ॥ ఆ కటికినైన వాంఛచే నైన, గడపు
గడయుటకును సభక్ష్యముల్ గుడుచుచుండు
టట్టియో గర్భపాతక మిద్ది యనుచు
నాడుచుందురు మునిసుప్ర తాభిధాన॥ 143

గీ॥ శిశ్నమునకు నానందము శ్రీ మహేశు
డుంచుటను రతిసౌఖ్యము నొంద నన్య
కామినులతోడ ప్రేమచే గవయుటయె యు
పస్థ పాతకమందురు, భవ్యచరిత॥ 144

## ఏకవింశతి నరకములు

సీ॥ తామిస్ర, కాలసూ, త్రాంధతామిస్ర, మ
హారౌరవంబులు, రౌరవంబు,
తపన, కుట్మల, సంప్ర తాపన, సంహాత,
సంఘాతములు, నసి పత్రవనము,

సంజీవినము, లోహ శంకువు, పూతి మృ
త్తిక, ఋజీష, మహాన రకము, లోహ
దారు, మహావీచి, నారక, శాల్మలీ
నది, సకా కోలముల్, నాగ దనరి,

గీ॥ ఏక వింశతి నరకంబు లెసగుచుండు,
తగ మహాపాతకో పపా తకములెల్ల
జేయువారల కివియె సం సిద్ధి జేయు,
దక్షిణాశాధిపుడు సమ దర్శనుండు॥ 145

గీ॥ నరక గాములౌ వారలు మరల నిలను
బుట్టుచో నీచయోనుల బుట్టి, కర్మ
ఫలితము ననుభవించుచు మలయుచుండ్రు,
గాన పాపంబు సలుపుట కాదటండ్రు॥ 146

గీ॥ పాపులైనట్టి వారలు బడెడి బాధ
లరయుచో నెంత కఠినాత్మకులకునైన
గుండెలవయుటయ బ్రమే, గొప్పదాత
లైన నక్కరజేయగా బూనుకొనరు॥ 147

సీ॥ అన్నమో రామచంద్రా; యని వాపోవు
కటిక బీదల కడ కంట గనరు,
కా పీనమును చీలి కలతోడ గట్టెడు
దీనుల దయతోను తేరికనరు,
కాలు సేతులు లేక తూలియుంగద బడు
వారలనైనను వాలికనరు,
చీకుచే చేదోడు గైకొని మొరలిడు
వారలనైనను దేరి చూడ॥

గీ॥ రిట్టి యిక్కట్లు బడువార లెల్ల పూర్వ
పాపఫలితము బొందెడు వారలగుట
వారి సాకగనొల్ల రె వ్వారలైన
పుణ్యులకె యిచ్చుచుందు ర గణ్యముగను॥ 148

గీ॥ ఇంక నెన్నియో పాపము లిలను గలవు
గాన పాపములొనరింప గాదలపక
బెద్దలను నాశ్రయించియు తద్ద పుణ్య
మార్గమున గమనించుటే మంచి తండ్రి॥ 149

## కర్మ

సీ॥ వాక్కుచే మాటలు వలుకుటయే కర్మ,
చేతులచే పనుల్ సేత కర్మ,
అడుగుల నట్టిటు నడచుటయే కర్మ,
విడుపు పాయువునకు వెలయు కర్మ,
ఆ యువస్థకును ర త్యానందమే కర్మ,
చర్మేంద్రియమునకు స్పర్శ కర్మ,
కన్నుదోయికి గల వన్ని చూచుట కర్మ,
వీనుల కన్నియు వినుట కర్మ,
రసనకు రుచులను గ్రసియించుటే కర్మ,
ముక్కు తావుల గొంట ముఖ్య కర్మ,
మనసున తలపుల గణితమై తగ నింద్రి
యముల ప్రేరేచుట యనెడు కర్మ,॥

గీ॥ బుద్ధి నిశ్చలవృత్తిని బూనకర్మ,
చిత్తము గుణత్రయిందగి చెలగ కర్మ
అయహంకార మతుల కా మాది పట్టు
వృత్తి గమనించుచుండుటే. విపులకర్మ,
గాన బాహ్యాంతరేంద్రియ కర్మలివియ॥ 150

గీ॥ ఇందు సద్బుద్ధి చేత నూ హించుకొనియు
నెద్ది యాచరణీయమో యెంచి, యట్టి
కర్మ యొనరించి, సద్గతి గాంచవలయు
ననుచు బెద్దలు సెప్పెద, రనఘ చరిత॥ 151

గీ॥ ఇవియ పుణ్యపాపము లను నవి యనుచును
దెలిపితిని, వీని సంగతి దెలిసితీవు,
యిందుపై భక్తి యెట్టిదో యెరుగ జేతు,
నవధరింపుము, మునిసువ్రతాభిధాన॥ 152

## భక్తి

సీసమాలికా

సీ॥ పరమేశు డన్నిట బరిపూర్ణుడై యుంట,
నేయే స్వరూపంబు లెవ్వరెవరు
భావించి దృఢ మగు భక్తిచే బూజింప,
నాయా స్వరూపము లందు నిలిచి,

యా శేవకుల కోర్కె లన్నియు నిచ్చుట,
నందరు సగుణుగా నాత్మ నెంచి,
పసుపుముద్దను గణ పతిగాను కొందరు,
నవ్యదారువు జగ న్నాథునిగను,
శిలలచే బెక్కు మూ ర్తులు శైవవైష్ణవుల్,
బంగారు మూర్తులు, భవ్యమైన
రజతమూర్తులు, నవ రత్న మూర్తులు, దామ్ర
మూర్తులు, కర్పూర మూర్తులున్ను,
కాంశ్యంపు మూర్తులు, కలశంపు మూర్తులు,
బాషాణ మూర్తులు, బారదంపు
మూర్తులు, లోహంపు మూర్తులు, మృత్తికా
మూర్తులు, ఘటముల మూర్తులున్ను,
దారు మూర్తులును, జం దన దివ్యమూర్తులు,
స్ఫటికంపు మూర్తులు, భస్మమూర్తు,
లగ్నికళల్ మూర్తు, లా బిల్వ ఫలమూర్తు,
లంగుష్ఠ మూర్తులు, నగసమూహ
మూర్తులు, లేఖన మూర్తులు, నశ్వత్థ
మూర్తులు, వల్మీక మూర్తులున్ను,
పంచాననులు సేయు బహు శిల్పమూర్తులు,
నాకులు వక్కలు నక్షత్రముల
మూర్తులు; ధాత్రి స మ్మార్తులు, నర్మదా
మూర్తులు, బర్వత మూర్తులున్ను,
బంగారు పుర్వుల పట్లు సాలగ్రామ
మూర్తులు, రుద్రాక్ష మూర్తులున్ను,
నింపైన నారికే ళంపు మూర్తులు, భుజ
గంపు మూర్తులు, గోమ యంపుమూర్తు,
లా నరమూర్తులు, శ్వానంపు మూర్తులు,
పుస్తకముల్, వృష మూర్తులున్ను,
ఆయుధంబుల మూర్తు, లాపని ముట్టుల
మూర్తులు, నక్షత్ర మూర్తులున్ను,
రవి చంద్రముల మూర్తు, ల విరళ గోమూర్తు
లఖిల దేవను మూర్తు, లాదిగ గల
మూర్తుల నా దేవ మూర్తిగా భావించి
పూజింపు చుందురు, పూర్ణభక్తి॥

గీ॥ కాన నన్నిటికిని భక్తి కారణంబు,
అట్టి త్రికరణ శుద్ధిగా సలరెనేని
యెట్టివారైన దరియింతు రిహమునందు,
ననుచు పెద్దలు సెప్పుదు, రనఘ చరిత॥ 153

గీ॥ ప్రచుర భక్తియు జ్ఞాన వైరాగ్యములను,
మూడు సద్గతి బొందగా ముఖ్యమైన
మార్గములు, నందులో ప్రథమమగు భక్తి
తొలు పొలుత నభ్యసింపగా వలయు దండ్రి॥ 154

గీ॥ భక్తి యెన్నియో విధముల బరగు చుండు,
దేవ, సత్ప్రభు, మాతా, పి తృ, గురు, శిష్ట
భక్తు, లీ భక్తులను దైవ భక్తి పెద్ద,
దద్ది మూడు విధంబులై యలరు వత్స॥ 155

గీ॥ మనసు, వాక్కును, గాయంబు ననగ నందు
మనసుచే జింతనంబు, వా క్కునను గానం
మును, శరీరంబుచేత సే వనము సేత,
యందులో మానసికము ము ఖ్యంబు, దండ్రి॥ 156

గీ॥ అట్టి మానసమందు న నన్య భక్తి
నెద్ది పూజించి ధ్యానించె నేని వార
లిహ పరంబుల సౌఖ్యంబు లెల్లనొంది
ముక్తి గనుచుందురయ్య; యో ముద్దులయ్య॥ 157

గీ॥ భక్తి ముందుగను సగుణో పాసనమున
దృఢమొనర్చియు, జ్ఞానంబు దీర్ఘముగను
బొంది, వైరాగ్యమందుపై గ్రందు కొలిపి,
నిర్గుణో పాసనము ముఖ్య నియతి జరుప॥ 158

గీ॥ వేలకొలది జనంబులు వెలయ నందు
నెవ్వరో యొక్కరే ప్రయ త్నింపు చుందు,
రట్టి వార్వేలలోనొక్క రాపరాత్మ
గనుగొనియు ముక్తినొందగా గడగునయ్య॥ 159

గీ॥ ఇదియె భక్తి యటంచును నెఱుగజేసి
నాథ, భక్తి కుదిరిన జ్ఞా నంబు గలుగు,
జ్ఞానమునను వైరాగ్యము గలుగు, నందు
వలన మోక్షంబు నిజముగా గలుగు వత్స॥ 160

గీ॥ అయ్యా; యీ పైని మనుజు దే హావయవము
లట్టి రూపములున్ను, మా యావి సృష్టి,
గ్రంధ వైషయికములునా గలయవివిన
దేహమందలి యభిరుచి తెలియునయ్యా॥ 161

# దేహావయవములు

## సీసమాలికా

సీ॥ ముని సువ్రతాహ్వాయా; మనుజుని తనువున
గల యట్టి యవయవా దులను వినుము;
అన్నిటికని ముఖ్య మైన శిరస్సు ప్రబ
ధానాంగ మనఁ జొప్పు, దానియందు
తాడవ, బ్రహ్మరం ధ్రమ్ము, పై భాగము
బునుక తొమ్మిదగు నె మ్ములను నొప్పు,
బెడతల, జెంకెయు మెడ జీవలును దగి,
నుదురును, బొమలు, గ న్నులును, గ్రుడ్లు,
బాపలు, దృష్టు, రె ప్పలు, ముక్కు. శరములు,
చెవులు, గూబలు, కొన చెవులు, తమ్మె
లును, గండములు, జెక్కి ళులు, మీదిపెదవి, మీ
సలు, నీవుళులు, దవు డలును, బండ్లు,
నాలు, కంగుడు, గొంద నాలుక, గొంతుక,
క్రిందిపెదవి, గడ్డ ముందనర్చు,
కంఠమూ, మెడ, ఱుత్తు కయు, బు జమ్ములు, జంక
లును, దండలు, ముడుకు లున్ను, గీళ్లు,
మఱియు మోచేతులు, మణికట్లు, మండలు,
నరచేతులును. వ్రేళ్లు నంగుళముల
పెనువ్రేలు, దర్జని, యును, మధ్యమ, మనామి
కము, కనిష్ఠంబు, న ఖములు. గుండె,
పులదబ్బ, గుండెకా యలు. చేది, యూపిరి
తిత్తులు, చన్నులు దిట్టమైన
ప్రక్కలు, వెన్ను, కో రెక్కలు, వెన్నుపూ
సలు, నితంబము, బిరుదులును, తుంటి,
కడుపు, బొడ్డును, బొత్తి కడుపు, గుదంబును,
వస్తియు, గెజ్జెలు వస, యుపస్థ,

శేఫంబు, వృషణముల్ జిరుతొడల్, మీ దొడల్
ముడుకులు, సిప్పలు మూలుగులును,
పిక్కలునుం, గడ పిక్కలు, స్ఫిజులును,
పాదంబులును, నర పాదములును,
వేళ్లు, మీగాళ్లును, వెండ్రుకల్ గోళ్లును,
ధమనులు, బొట్టన రములు, బ్రేవు,
లెమ్ములు, వాత, పై త్యమ్ములు, శ్లేష్మము,
ద్వాదశ మలములు, ధాతువులును,
తేప, చొంగయు, బచ్చ, తెలుపును, నెఱుపును,
మలము, మూత్రంబును మఱియు లోడు,
మాంసము, రక్తము, మఱి మేధయును, వస,
చీమిడి, గుల్మ, పు సియును, చెమట,
అరయగా మున్నూట యరువది యెమ్ములు,
వీర్యంబు, క్రొవ్వును, వెలయుచుండు,
ఘన పదుమూడు ర కముల శల్యంబులఁ
ష్టాశీతి సాహస్ర కామయములు,
వెలయ డెబ్బదిరెండు వేల నాడులు, దొంబ
దారు తత్వంబులు, నీరు నూరు
పదియైన సంధులు బరగి, ముక్కోటుల
యేబది లక్షల యీ కెగమియు,
మీస గడ్డములందు మెరయు మూర్లక్షల
వెంద్రుకల్, జక్రముల్ వెలయ నారు
ఇడయను చంద్రము, యెడమను. పింగళ
యను సూర్యమును కుడి నా సుమ్న
యను బ్రహ్మనాడి నా సాగ్రమునందున,
పూర రేచక కుంభ ములనడపును,
అశ్విని, కుకుర, జి, హ్వాలంబ, శంఖిని
హస్తిని, గాంధారి యనెడు నాళ్లు,

ఆ॥గీ॥ ఇన్నికలిసి దేహ మేర్పడె, మూర్తిగా
నన్నిచూడ నేహ్య మైనవియును,
గన్ను మూసినంత మన్ను పాలగునని
రోయువాడు లోక మాయ వీడు॥

గీ॥ ఇవ్వి దేహావయవములై యెసగుచుండె,
వీని రూపంబులెల్లను విశద పఱతు,
వాని గ్రహియించి భావించు వాడె దేహ
మర్మ మెఱిగిన వాడగు, మాన్యచరిత॥ 16

## దేహావయవ స్వరూపములు

సీసమాలికా

సీ॥ మానవ దేహ మర్మంబు సెప్పెద, మొట్ట
మొదట స్త్రీ పురుషులు ముదము తోడ
నాకలి దీరుట కారగించెడి పదా
ర్థములు, దేహమున ఏ ర్యత్వమొంది,
గర్భగోళంబున గెలిసి, జంతు స్వరూ
పము నొంది, మాతయం శమున జర్మ,
రక్త మాంసములును, రా జిలి, మెదోస్తి
మజ్జలు, దండ్రి యం శమున గలిగి,
యవ్వియే పదియింద్రి యములును సర్వావ
యవములునై, దేహ మమరె, నందు
జట్టి బోర్లించిన చందాన శిరమును,
నందుపై బీచునా నలరు గొప్ప,
పదివ్రేళ్ల పొడవున బలుచని చర్మతొ
యూకెలు లేనిదై యెసగు నొసలు,
గొంగళి పురువుల కుందీటునై రెండు
బొమ్మ లాపొంతనే పొలుచుచుండు,
దుమ్మెదరెక్కల తో సమానంబయి
కనిరెప్ప లాక్రింద గానుపించు,
వాటిలో గోళీల వడువున నల్లని
మచ్చలం గని గ్రుడ్లు మసలు చుండు,
నారెంటి నడుమ న నటి కాయ ముక్కనా;
నాళద్వయము తోడ నాసయొప్పు,
దాని క్రిందను నోరు దగు, లక్క పిడతనా,
జలగ లట్టుల బెద వులు దనర్చు,
అందులో ముందర నగపడు దంతముల్,
పొల్లగింజల రీతి బొలుచుచుండు;
ఆలోన గోరలు నగపడు చుండును
గొలివగింజల రీతి గొరలి నాల్గు,

యా లోన గూనపం క్తు లరుచుండును, గుక్క
చే మంతిమొగ్గల చెలువు మీఱి,
యా మధ్య నాలుక యలరు వెల్లెటమేక
చెవిబోలి మిక్కిలి చిత్రముగను,
యాపైని యంగిటు నతి వింతగా, గొండ
నాలుక, కొండుసు నా నలరుచుండు,
నా పొంత రెండు రంధ్రములు మూషకయోని
వలె గూబలను నంటి యలరు చుండు,
మీసలు గడ్డంబు మితిలేని వెంట్రుక
గమిచేత వింతగా గ్రాలుచుండు,
అందులో మీసము లనునవి యురుతతో
కట్టుల బెదవిపై నలరుచుండు,
గోకురు చిప్పల కును సమానంబయి
చెవు లిరుపక్కల బెలగుచుండు,
నిరుప్రక్కలందు దో సెల బోలి చెక్కిళుల్
బలువింతగా గాన బడుచునుండు,
నారెంటి దిగువను నట్టుగానొక త్రాటి
టెంకెనా గడ్డము టీవిమను,
నాక్రింద కంధర మమరు చుండును, కంచు
పంచ పాత్రను బోలి భవ్యగతిని,
యా క్రింద నెమ్ముల న మరియు వింతయగొ
గూడు చందంబున గుండె యొప్పు,
దానిపై నిరువంక దగి మతేపుటకొక్కు
మొగ్గ లట్టుల జనుల్ మొలచియుండు,
మొగలి చన్నులబోలి మురువైన బాహువు
లిరు ప్రక్కలందున నెసగు చుండు,
వాటికి మొదలును వరలెడు చంకలు
గొబ్బరి చిప్పల ట్లబ్బియుండు,
బాహుల తుదలందు బరగెడు చేతుల
మండలిష్టైన లట్టు లుండు రెండు,
వాటియందున వ్రేళ్లు వరలును నైదేసి
గొరియల జంపెడి పురుపులట్లు,
ఆతుదలందున నలరును గోరులు
చిన్నాల చిప్పల చెన్ను మీఱి,

వక్షంబునకు దిగు వను గర్భముండును
ప్రేవుల గుంపుతో బెద్దదియగు
బాస బోర్లించిన పగిది, నా మధ్యను
బొడ్డంగుళము లోతు పొలుపు మీఱి,
వెన్ను మధ్యను గోవ తిన్ననై, యెమ్ములు
గిద్దెల మాదిరి గీలుకొనియు,
నిరుప్రక్కలను నెమ్ము లెంతొ వింతగ నిలు
వాసముల్ పగిదిని వరుస మీర,
కోరెక్కలను నునవి గొరలెడు నిరుప్రక్క
పిడకలు బోర్లించు విధముగాను,
పిరుదులు నాగ రూ పించెడు రెండును
బోడెద్దు శరమును బోలియుండు,
దొండకాయను బోలి యుండెడి శేఫంబు
వాయు పూరణమున బ్రబలుచుండు,
న దియందు మసలుట కను కూలమై దీర్ఘ
బిలము యుపస్థనా వెలయుచుండు,
నచ్చోట బురుష దే హమునందు నండముల్
జంట వంకాయల సరణి నుండు,
రోటాల మాదిరి రూఢి మీరగ దొడల్
గడపిక్కలను నవి గ్రాలుచుండు,
నా మధ్య ముడుకులు, నానొప్పునవి రెండు
పెద శంబపిక్కల కుదురు వెలయు,
పాదముల్ దనులెటు పడకుండ బాపోసు
లట్టలవలె గ్రింద నమరు రెండు,
ఆ తుదన్ వ్రేళ్లను నవి యైదునైదుగా
గొండెము పురువుల ట్లుండు బదియు;
రక్తంబు నెట్టుగా రావి చెక్క కషాయ
మట్టుల దనువెల్ల నమరియుండు,
బూరుగు పువ్వుల పోలిక మాంసంబు
కండకండలు గాగ గలిగియుండు,
గెనుసు గడ్డల రీతి దనువెల్ల మున్నూట
యరువది యెమ్ములు వరలు చుండు,
తెల్లగా దేహమం తెల్లెడ వ్యాపించి
క్రొవ్వనునది లోన గూడియుండు,

తూటి బడ్డల రీతి దోచెడు ప్రేవులు
బొట్టలో నిండుగా బొలిచి యుండు,
బీర పీ చట్టుల వెలసి డెబ్బదిరెండు
వేల నరంబులు వెలయుచుండు,
వుజెల, ముక్కు, న, గక్ష సీమ, యుపస్థల
చేరువ, వెండ్రుకల్ జేసియుండు,
దుర్గంధమై యేడు దోయిళు ల్మలము, శ
రీరమంతట వ్యాప్త మై రహిచు,
నివియెల్ల గలిసియు నెసగు మానవదేహ,
మందులో రక్తమాం సాస్తి నాళ
ములు, క్రొవ్వు మలమూత్ర ములు, గుండెకాయలు
నూపిరితిత్తుల నొప్పుచుండు,
నిందులో జీవాత్మ యిమిడి యున్నంతకు,
దశవాయువులు ధాతు తతిని బొంది,
యింద్రియ దశకంబు నెంతయు విషయాప్తి
గలిగించి, చైతన్య మలవరించి,
మనసుచే బ్రేరణ గొని, యన్ని పనులను
జేయించుచుంటను, స్థిర మనుకొని,
యెంత శృంగారిని, యెంత బలిష్ఠుండ,
నెంతటి ప్రాజ్ఞుండ, నెంత ఘనుడ,
నెంత విద్యానిధి, నెంతయుద్యోగిని,
యెత వాగ్జాలిని, యెంత ప్రభుడ,
నెంత పుణ్యాత్ముండ, నెంత ధర్మాత్ముండ,
నెంత ధనాఢ్యుండ నెంత జ్ఞాని,
నెంత తపస్వి, నే నెంత పీఠాధ్యుండ,
నెంత సిద్ధుండ, నే నెంత గురుడ,
నెంత తేజోనిధి, నెంతటి యుపకారి,
నెంత శాంతుండ, నే నెంత వాడ,
యెంతటి పూజ్యుండ నెంతటి దాతను,
యెంత నిష్టపరుండ, నెంత యశుడ,
ననెడి యహంకార మాత్మలోనిడికొని
దురహంకృతిని జాల ద్రుళ్లు చుందు,
రీ దేహమందున నెనసి నయవయవా
లొక్కొక్కటిని జూచి యుల్లమందు

భావించు కొనినచో బ్రతి వస్తువెంతయో
యేహ్యాకరంబయి యెసగి యుండు,
పైకి నన్నియు గూడి భావింప జక్కని
దేహమై విలసిల్లె తేజముగను,
అదియైన శాశ్వత మనియను కొందమా
క్షణ భంగురంబని గణు తికెక్కె,
జీవాత్మ విడచిన పై వపును గాల్చి
బుగెన జేతురు, పూడ్చివేతు,
రద్దాని నక్కలు గ్రద్దలు భక్షింప
వినియోగ మౌను, యీ విశ్వమందు

గీ॥ ఇట్టి మాయా శరీరంబు నెవ్వరైన
నమ్ముకొన సార్ధకములేదు, నెమ్మదిగను
గర్వమును వీడి, మోక్షంబు గాంచు తెఱవు
సద్గురుని వల్ల దెలియుటే సత్ప్రవృత్తి॥ 16

గీ॥ అయ్య; యివి యన్నియును దేహ మందునున్న
యవయవాదుల రూపంబు లనుచు దెలియు,
మిందుపైని మాయా సృష్టి నెరుగజేతు
దాని గ్రహియించి సన్మార్గ సరణి గనుమ॥ 16

## మాయాసృష్టి – ఉపసంహారము

### స్వానుభవము – మననము

సీసమాలికా

సీ॥ ఆదిని సర్వశూ న్యంబునై యున్నప్పు
డంతట నిండియు నట్టి వస్తు
వప్పుడు నిప్పుడు నెప్పుడు నొప్పుచు;
నట్టిది యిట్టి ద టంచు జెప్ప
నలవి గానిదియయి, తలప నశక్యమై,
వెలసెడు దానియం ద లఘుతరము
నైన మహత్తత్వ మను మాయ యావిర్భ
వించి, య విద్యను వెలయజేసి,

శక్తి త్రయాత్మయ సద్గుణంబులు ప్రచు
రించి, స్వతంత్రంబు గాంచుచున్న
యట్టి యహంకార మనునది పొడమగా
నది యూహ జేసెడి యంతలోన,
నాకసంబును, గాలి, యగ్గి, నీరును, భూమి
యను నైదు భూతము లవతరింప,
నట్టి భూతంబుల యందు ప్రధానమౌ
భూమియం దోషధుల్ బుట్ట దొడగె,
నా యోషధీ చయం బన్నంబుగా స్త్రీలు
బురుషు లాకటికయి భుక్తిగొనిన,
జఠరాగ్నిచేత బ చనమునై, నీరయి,
రసమయి, యద్దియే రక్తమునయి,
మాంసమై, మెదడయి మఱి యెమ్ములై, మూల్గు
లై వీర్యమై, స్త్రీల యందు రుధిర
మై, మగవారల యందు శుక్లంబయి
రతివేళ స్త్రీల గ ర్భమున నున్న
మావి యందున జేరి మసలు చునున్నప్పు
డద్దియే, కలలము నన బడియె,
నేడు దినంబుల కేకమై పొంగిన
బు ద్బుదంబను పేరు పొలుపు గాంచె,
మఱియు నద్దియె యొక మాసంబునకు దృఢ
మయ్యె, రెండవమాస మందు నందు
శిరము పోలిక గల్గి, కర చరణంబులు
మూడవనెల యందు మొలువ బడియు,
నాలవనెల యందు నాతియో పురుషుడో
యట్టి లింగము దేహ మందు గలిగి,
చలనంబుగల్గి, పం చమ మాసమున బృష్ట
వంశంబు జిత్తంబు వరలి, యంత
నారవ మాసంబు నందు జక్షు శ్రోత్ర
స్నాయు లో మాస్థి సంచయము గల్గి,
యేడవనెల యందు నెన్నెన్ని యవయవ
ములు గల్గవలె నన్ని గలిగి, పూర్వ
జీవుడై జ్ఞానంబు సెంది, పూర్వజ్ఞాన
కలితుడై, శ్లేష్మాస్ర కలితమైన

గర్భ వాసంబున గలిగెడు బాధల
దలచు, చంతట నెన్మి దవనెల నొగి
నోజస్సుతో గూడి, యుండియు, గడుపులో
గదలుచు శిశునామ కవితుడయ్యు,
మఱి తుట్ట యనెడు నా మంబును బొందియు,
నవమాసమున ప్రసవము నొంది,
పురిటింట మంచము పొత్తిళ్లలో నుండ
కండయటంచు బేర్గాంచి, పిదప
పదునొ కండవనాడు పాపన్నయను పేరు
బొందియు, నభివృద్ధి బొందుచుండి,
పా గండు డనుపేర బరగియు, నాపైని
బాలకుండన నొప్పి, పదియునారు
వత్సరములకు గో వాల్లన దనరి- డె
బ్బది యేండ్లకు ముసలి వాడనదగి,
యధ్వర్యుడును, సోమ యాజియు నవధాని
యని, శాస్త్రి, సిద్ధాంతి యనగ దనరి,
చక్రవర్తి, గవనర్, జడ్జి, కలక్టరు.
నాయుడు, బంట్రోతు నాగనొప్పి,
బ్రహ్మచారి, గృహస్థు, వనవాసి, సన్యాసి,
బాపడు, రాజును, వైశ్య, శూద్ర
పంచముడను పేర్లు బరగియు, దాతయు,
ధర్మాత్ముడును; బుణ్య తత్పరుండు,
ధీరుండు, రౌడీసు, జారుండు, జూదరి,
కల్లరి, రోగి, త స్కరుడనబడి,
ప్రాణంబు వీడిన పైని, యీ పేరులు
మాయమై, యంతట మారుపేర్లు,
బరగు, గట్టెయు, గళే బరము, శవంబును,
బొంది, పీనుగ, యని ముట్టరొకరు,
చూడరు కొందరు, చూచినం, గట్టిన
బట్టతో స్నానంబు బరగ జేసి,
యొక్క క్షణంబైన నుంచక, యూరిబై
టకు, మోసికొని పోయి ప్రకటమైన
కట్టెలపై బెట్టి కాల్చి బూడిద జేసి
పురమెత్తి యొకచోట బోసివేతు,

రద్దాని మఱి గొంద ర వని ఖాతము త్రవ్వి
యందులో బూఁడ్చెద రతి దృఢముగ,
మఱి గొంద రద్దాని జెరువులం దుప్పల
బారవైచియు నక్క పాలు చేతు,
రంతట వింతగా నప రూపముగ బ్రేత
యని యొకరాతిని నందు నిలిపిఁ
చనినట్టి వాని పే రును బెట్టి, దినమొక
యన్న పిండంబును నచట వైచి,
పదిదినంబులు బ్రేత భావంబునం బిల్చి,
పదియు రెండవ దినం బందు, వసుల
రుద్రు లాదిత్యుల రూపంబులను దాల్చి
యున్నట్టి పెతరు ల నూహ జేసి,
యందులో బ్రేతను బొందించి, యీాపైని
ప్రేత శబ్దములేదు, పూతులైన
వసువుల శబ్దంబు వచ్చెను, పెతరుల
గలియుటచేనని, నెలను, నెలను,
నేటేట శ్రాద్ధంబు లెన్నియో చేయుచు,
స్వర్గంబునకు వాని బంపుదు రొగి,
నర్ధోయ మహోద యాదుల, సంక్రమ
ణములను, మఱి గ్రహ ణముల, బుష్క
రములాది పుణ్యకా లముల, వారలపేర
నెన్నియో దానము లిచ్చుచుంద్రు,
పాంచ భౌతికములై పరగిన దేహముల్
బంచ భూతములందె పరి లయించు,
నాకాశమందు హృ దాకాశముంజేరు,
వాయువందు లయించు, వాయు వితతి,
అగ్నియందున నగ్ని యనుగమించును, జల
మందున నుదకంబు నంతరించు,
భూమియందున జేరు, భూ తత్త్వమగు దేహ
మాత్మ యెప్పటివలె నచట నుండు,
నిట్టి మాయాసృష్టి నెసగెడి దేహముల్
రజ్జు సర్పభ్రాంతి రహి జెలంగు,
నిది యంత మాయగా నెఱిగియు, శాశ్వతం
బనుకొని దంభ మ దాన్వితులయి॥

గీ॥ త్రుళ్లు చుండెదరే లొకో తుచ్ఛ బుద్ధి,
గన్నుమూసిన దేహంబు మన్నుపాల
టంచు నెంచినవాడె సౌ ఖ్యంబునొంది
యుండినన్నాళ్లు యానంద మొప్పనుండు॥

## ఫలస్తుతి

### సీసమాలికా

సీ॥ మానవ జన్మయన్ మహనీయసద్గ్రంధ
మెవ్వారు చదివిన నెవరు వినిన,
పంచభూతాది ప్ర పంచ సంభవమును,
శుక్లశోణిత ధాతు సూచనంబు,
జన్మ ప్రకారంబు, శారీర ధర్మంబు
బాల్య యౌవన వృద్ధ భావములును,
షోడశకర్మలు శుద్ధ పంచాక్షరీ
మహిమంబు, గాయత్రి మహిమములును,
పంచాశదక్షర ప్రాధాన్యతయు, బుణ్య
పాప విభేదముల్, ప్రచురభక్తి,
తగిన తొంబదియారు తత్వంబులును, జీవ
తత్వనిరూపణ, తగు మతములు,
దేహావయవములు దివ్యమాయా సృష్టి,
వరకును నూటయే బదియు దెలియు॥

గీ॥ తెలిసినందున మిక్కిలి తెలివిగలుగు,
దేహమందున నభిమాన దృష్టివిడి
జ్ఞానమును బొంది, పరలోక గతిని జెంది
యాఢ్యులగుదురు, మునిసువ్రతాభిధాన॥

గీ॥ ఎనుబదియు నాల్గు లక్షలై యెసగు జీవ
కోటులందున సుజ్ఞాన పేటి యగుచు
దనరు మానవజన్మ వృత్తాంత మెల్ల
కరతలామలకంబునై క్రాలునట్టి
లమరజెప్పితి, మునిసువ్రతాభిధాన॥

గీ॥ ఇందలి విశేషణంబుల నెల్ల నీదు
సూక్ష్మ బుద్ధిని యోచించి, చూడ చిన్న
యద్దమున గొండ యగపడు నట్టు నీకు
నంత తెలియును ముని సువ్రతాభిధాన॥ 169

సీ॥ అని యుపదేశించు నట్టి విశ్వజ్ఞుని
జూచి యిట్లను, ముని సువ్రతుండు
గురువరా! నా పుణ్య పరిపాకమునను నే
బది గ్రంథముల యందు బలుక బడిన
మానవ తతికి వి జ్ఞాన బోధకము లౌ
నూటయేబది క్రియల్ వాట పదునొ
కండు నూర్లేబది నిండు పద్యములందున
నిమిడిచి చెప్పితి రెంతొ ప్రేమ॥

గీ॥ నేను దెలిసితి నిది లోక మానవులకు
మిగుల నుపయోగమై యుండు, మేదిని పయి
మహిత మానవజన్మ నా మంబు నిడిరి
సార్థకంబయి వెలయును, జగతియందు॥ 170

చ॥ అవని జలంబు వహ్ని యని
లాంబర శంకర విష్ణు పద్మసం
భవ మఘ వార్క తారక స
వగ్రహముల్ బొడ చూపనప్పుడే
యవిరళ మూర్తినా జెలగి,
యప్పుడు నిప్పుడు నెప్పుడుండి సం
భవ విలయాదు లందని వి
భా మహితా; త్రి జగత్సు శేవితా॥ 171

చ॥ తనువును గాలు సేతులు గు
దంబును శిశ్నము వాక్కు శ్రోతముల్
గనులును జర్మ నాసిక క
ళాసము లెవ్వియులేక బూర్ణమై
మనసున వాక్కునం దలప
మాటలచే నుతియింపరాక స
జ్జన హృదయంబుల న్వెలుగు
సత్యకళా జగదేక భా వితా॥ 172

# సమర్పణము

సు శ్రీ విలాస భా సుర దేహతత్త్వవి
భా వించువారికి బరమ సుఖము,
శా శ్వతమనెడు యా శాశ్వశూన్యమగు మనో
వి కసనమునకు వి వేక ధనము,
మ ర్మముల్ దెలిసి ని ర్మలతత్త్వ మాత్మను
దో ప జేసెడి జ్ఞాన దీపకళిక,
సా ర వంతమను సం సారసాగరమున
క బ్రమై యొప్పెడి యాన పాత్ర,
బ్ర హ్మాదిసురలకు భావింపగా నాత్మ
ర ర్పణ రూపమై తగిన కాంతి,
ప్ర ణ వంబె సర్వప్రపంచాత్మయని తెల్ప
గ మనించుచున్నట్టి కార్యదర్శి,
త గు లంబులను నొక్క తటి వీడు టొప్పని
యా గా మి దెలిపెడి యాత్మబోధ,
న వు లాటగాదుః యీా తెవులు కొంపను నమ్మ
వి త ధమే; యనెడు వి వేక ధనుడు॥

గీ॥ గాగ నొప్పుచునున్న యీా గ్రంధరాజ
మైన మానవజన్మ జ నాళి చదువ
బదియు నూర్లెబదియునైన పద్యములను
శ్రీ పరాత్పరు కర్పణ చేసినాడ
నవని నా చంద్రతారక మై వెలయగ॥ 17

# గ్రంధోత్పత్తి కాలవివరణము

సీసమాలికా

సీ॥ కల్యాది, నగ7, వహ్ని3, గగన, 0, శర5 రాబ్దము,
దిక్కీ, 8, పంచ, 5, వసు8, ధరా1 దీప్తసంఖ్య
శాలివాహశకంబు, షట్ 6 త్రి 3 న 9, వైక1 మౌ
హూణశకంబు, పం5చో, దధిఖ, త్రి3
చంద్ర 1 సంఖ్యాక, ఫ సలి, ప్రభవాది, ద
శమ 10 మైన, ధాతృవ త్సరము, జ్యేష్ఠ

శుక్ల ద్వితీయము, శుక్రవారము, మృగ
శీర్ష నక్షత్రము; సింహలగ్న,
మవు సమయమున, మా నవజన్మ యను నపూ
ర్వ గ్రంధరాజము, వసుధయందు,
విశ్వకర్మాన్వయా విర్భూత ముని సువ్ర
త, సగోత్ర, చేవూర్యు వసితాఖ్య
లక్ష్మినారాయణ, లక్ష్మినర్సమ్మల
పుత్రరత్నమును, వి బుధ విధేయ,
ప్రౌఢసరస్వతి, వరస్మార్తసింహ, వేం
కట సోమసుందరా ఖ్యాతసు కవి॥

గీ॥ పదునొకండు నూర్లేబది పద్యములను
పొందుగ రచించె, దీని సద్బుధులు మెచ్చ,
నవని నా చంద్ర తారార్క మయ్యు, సర్వ
జన మనోరంజకంబయి, జ్ఞాన దాయి
యగుత, శ్రీ పరాత్పరు సత్కృ పాప్తిచేత॥

## నాగబంధము

చ॥ హర హరి ధాతలన్ రహి చ
రాచర సర్వ సురాది భూతముల్
బిరుదు వహించు ధీరత న
వీన సమర్థి; తదీయ వాసముల్
ధర మది తాము చారు తర
ధారగ ప్రబ్బుచు మీరితౌ; మహ
త్తర నుయశా; సుధారస స
దా సహిత ప్రముదావహ ప్రభూ॥



## సుగంధి వృత్తము

మార దూర సూర చంద్ర మాక్ష యక్ష రక్షకా
కారి వంద్య చారు పాద కంజ ఫాల లోచనా
నారద ప్రపూజితాంఘ్రి నాగ గరళ భక్షకా
కారణుండ మమ్ము బ్రోవు కరుణ మల్లికార్జునా॥



## కందగీత గర్భ చంపకము

చ॥ సుర ముని పోషణా; త్రిపుర
సూదన; హైమవతీ సమేత; దా
శరథి నుతా; మహా భుజగ
శాయి దృగంబుజపూజ్యమాన; శం
కర; ధన దప్రియా; విమల
కాంచనశైల న వీన చాప; సా
గర శరధీ; భవత్కరుణ
కై మదిగొల్చెద, గాంక్ష మీఱగన్॥ 1

## గర్భకందము

క॥ ముని పోషణా; త్రిపుర సూ
దన; హైమవతీ సమేత; దాశరథి నుతా;
ధనదప్రియా; విమల కాం
చన శైలనవీన చాప; సాగర శరధీ॥ 1

# గర్భగీతము

గీ॥ త్రిపుర సూదన; హైమవ తీ సమేత;
భుజగశాయి దృగంబుజ పూజ్యమాన;
విమలకాంచన శైల న వీన చాప;
కరుణకై మది గొల్చెద గాంక్ష మీఱ॥ 178

నిరోష్ఠ్యమాలినీ

వృ॥ జగదఖిలనుతా; కం సారి నేత్రార్చితాంఘ్రీ
సగజ హృదయతో; షా నంగ శిక్షా; త్రినేత్రా;
గగనశిఖ; గిరీశా; గౌరదే; హానలాక్షా;
సుగుణగణ నియుక్తా; శూలహ; స్త్రార్తి రక్షా॥ 179

# మత్తేభకంద గర్భసీసము

సీ॥ కుధర ధానుష్క; సు కోమలాంగ; సురమో
దా; పార్వతీ నాయకా; పరేశ;
స గరకంఠా; గిరి జామనోబ్జ మిహిరా;
కామ ప్రసంహార కా; మహేశ;
త్రిపుర దైత్యాంతక; దేవమౌని వినుతా;
భోగీంద్ర సద్భూష ణా; గిరీశ;
సుకరి చర్మాం బర శోభిత స్వకటి భా
గా; నిన్ను బ్రార్థింతు రా; నిరీహ!॥

గీ॥ గిరివర నివేశ; శంకర, పరమ పురుష;
వృషభగమన; పాపని చయ భీకర,; వర
సోమమకుట; శం, బరరిపు సూదన; శివ;
తమ పదములె గొల్తున్, గరు ణ మ మునేలు॥ 180

# గర్భ మత్తేభము

మ॥ ధరధానుష్క; సు కోమలాంగ; సురమో
దా; పార్వతీ నాయకా,
గరకంఠా; గిరిజా మనోబ్జ మిహిరా;
కామ ప్ర సంహారకా;

పురదైత్యాంతక; దేవ మౌని వినుతా;
భోగీంద్ర సద్భూషణా;
కరి చర్మాంర శోభిత స్వకటి భా
గా; నిన్ను బ్రార్థింతురా;॥

## గర్భకందము

క॥ గిరివర నివేశ; శంకర;
పరమ పురుష; వృషభ గమన; పాపని చయ భీ
కర; వరసోమ మకుట; శం
బరరిపు సూదన; శివ; తమ పదములె గొల్తున్॥

గద్య

ఇదిశ్రీ మదు మామహేశ్వర కరుణా కటాక్షసంలబ్ధ
కవితా మాధుర్యః శ్రీ విశ్వకర్మా స్వయ పయః పారా
రాకాసుధాకర, మౌనిసువ్రత, ఉదర, వేదపాలక,
త్రార్షేయ ప్రవరాన్విత, ప్రణవామ్నాయ శాఖీయ,
మణిభద్రసూత్ర, మునిసువ్రత సగోత్రోద్భవ, బ్రహ్మ
చేవూరి లక్ష్మినారాయణచార్య, లక్ష్మీసరసమాంబా
గర్భశుక్తేర్ముక్తా ఫలాయమాన జ్యేష్ఠ తనూజ
విబుధ జన విధేయ ప్రౌఢసరస్వతి – స్మార్తంహ
బిరుదాంకిత – నూత్నమస్కరి, చేవూరి వేంకట సోవ
సుందరాచార్యశాస్త్రి విరచితంబగు మానవజన్మ
యను సుజ్ఞానదీపంబున పంచమోల్లాసము
సర్వంబును సమాప్తము.

ఓం తత్సత్ శ్రీ మత్పర బ్రహ్మార్పణమస్తు॥ శ్రీ

ప్రౌఢసరస్వతి గ్రంథమాల మేనేజరు
పంచవృత్తుల పురోహితులు
కవికుమార్ చేవూరి భానుమూర్త్యాచార్య (శ్రీమం
బుక్కావీధి, విజయనగరం-2.

—○○○—

శుభమస్తు ఓం అవిఘ్నమస్తు

శ్రీ విశ్వకర్మ పరబ్రహ్మణేనమః

# ★ విజ్ఞప్తి ★

శ్రీ ______________________________ గారికి

విశ్వబ్రాహ్మణ సోదరులారా!

కీ॥శే॥ ప్రౌఢసరస్వతి, స్మార్తసింహ, పండిత, మహాకవి చేవూరి వేంకట సోమసుందర శాస్త్రిగారి ప్రౌఢసరస్వతి గ్రంధమాల గ్రంథ ముద్రణ సహాయార్థం.

## శ్రీ విరాట్ విశ్వకర్మ సంతతి

1) మను-సానగబ్రహ్మ ఋషి గోత్రం, 2) మయ-సనాతన బ్రహ్మ ఋషి గోత్రం, 3) త్వష్ట-అహభూనస బ్రహ్మఋషి గోత్రం, 4) శిల్ప - ప్రత్నస బ్రహ్మఋషి గోత్రం, 5) విశ్వజ్ఞ సుపర్ణ బ్రహ్మఋషి గోత్రముల సంతతి

మనలో పూర్వ సంస్కృతిని మరచి కొందరు తమ తమ గోత్ర సూత్ర ప్రవరులను విస్మరించే స్థితి వాటిల్లబోవుచున్నది. మరియు బ్రహ్మణ కర్మలు లోపించు చున్నాయి. కావున మత్పితామహులు, 1) కీ॥శే॥ చేవూరి లక్ష్మినారాయణాచార్యుల వారిచే నేర్పబడిన "త్రికాల సంధ్యావందన, గోత్ర గృహనామముల సంపుటన్నీ"

2) కీ॥శే॥ చిలకలపూడి వెంకట రత్నాచార్యులుగారి "గోత్రాది విజ్ఞాన సంధ్యావందన దర్పణమున్నూ"

3) కీ॥శే॥ బ్రహ్మయాజి కణిత జోగయాచార్య సిద్ధాంతి గారి "విశ్వకర్మ వంశ వృక్షమున్నూ"

4) బ్రహ్మశ్రీ చల్లపల్లి మల్లికార్జునరావు "విశ్వకర్మ గోత్ర దీపిక" ను పఠన చేసి, యీ త్రికాల సంధ్యావందన, గోత్రాది దర్పణమును, సమకూర్చి ప్రచురించినచో పూర్వోన్నత్యమును పొందగలుగుదురనే ఉద్దేశముతో యీ గ్రంథమును ప్రచురించదలచితిని గాన, యావత్ భారతీయులు తగు విరాళములిచ్చి గ్రంధ ప్రచురణను ప్రోత్సహించె దరని ఆశించుచున్నాడను.

# ప్రౌఢసరస్వతిగారి రచనలు

## (అముద్రిత గ్రంథములు)

1) మానవజన్మ గ్రంధరాజము 5 ఉల్లాసములు, 2) లఘుహరిశ్చంద్ర, 3) నీతిశాస్త్రము, 4) సోమసుందర లీలాకదంబము (2 భాగములు), 5) ఆంధ్ర ముహూర్తదర్పనము, 6) ఆంధ్ర జ్యోతిషామృతం (జాతక భావము), 7) రక్తలోచన చరిత్ర కలిప్రభావం, 8) రత్నశాస్త్రం (నవరత్నములు ధరించే క్రమం), 9) చేపూరివారి వంశం (250 పద్యములు), 10) విక్రమదేవువారి వంశం (జయపూర్ రాజాచరిత్ర), 11) గ్రామరాజము (పెదపెంకి చరిత్ర), 12) మానసబోధ, 13) గృహస్తధర్మములు, 14) భూకల్ప భూజము, 15) దుర్గాదండకం, 16) బ్రహ్మయజ్ఞం, 17) వివాహ, ఉపనయన, వినోద పద్యములు, ద స రా పద్యములు, సంకీర్తనలు, 18) పోలేరమ్మ పూజావిధానము, 19) పనసలు స్వరయుక్తతో.

గమనిక :- రాజపోషకులు మొదలు, ప్రోత్సహకుల వరకు వారి పేర్లు గ్రంధమున ప్రచురింపబడును. ముద్రించిన ప్రతి ఒకటి ప్రజంటుగా పంపబడును.

పై గ్రంధములు ఇతరులు అచ్చు వేయుటగాని, విక్రయించుటగాని, మా అనుమతి లేనిదే చేయరాదు. అట్లు చేసినవారు లా ప్రకారం చర్య తీసుకొనబడుదురని ఇందు మూలముగా తెలియజేయడమైనది.

ప్రౌఢసరస్వతి గ్రంధమాల మేనేజరు
స్మార్తప్రౌఢ, పంచవృత్తుల పురోహితులు, స్మార్తవిశారద,
కవికుమార్ **చేపూరి భానుమూర్త్యాచార్య (శ్రీమూర్తి)**
కొత్తపేట, గొల్లవీధి, విజయనగరం-2.

—ం౦ం—